ओं

శ్రీ నారసింహ గ్రంథమాల నెం 7.

# కావ్యప్రకాశవివరణము

ప్రథమ భాగము.


గ్రంథకర్త:

సాహిత్యశిరోమణి & ఉభయభాషాప్రవీణ

కాండూరు నరసింహాచార్యులు.





నారసింహగ్రంథమాల,

ప్రొద్దుటూరు.

1934




[వెల రూ. 1—0—0

# ఉపోద్ఘాతము.



గీ॥ విబుధలోకంబు కవితయె విద్యయనుచుఁ
జనువు వచనార్థమునను సంశయముగలదె?
విద్యలకు నెల్ల నుత్తము విద్య కవిత
దానిఁ దెలియుట విశ్వమంతయును గనుట.

కవిత సర్వోత్కృష్టమగు కళ. బ్రహ్మసృష్టికన్నఁ గవి సృష్టి సర్వవిధములఁ బ్రౌఢతరము. విధాతృని సృష్టి సుఖ దుఃఖ మిశ్రితము. కవి సృష్టి నద్వితీయమగు నానందమే వెల్లివిరియు చుండును. దీనినే నిష్కలుష విద్యానందమందురు. నిశితమగు ప్రతిభా విశేషమునను, సూక్ష్మమైన భావనాబలము పెంపునను, గవి విశ్వప్రకృతియందలి చైతన్యమును, హృదయంగమమగు సౌందర్యమును, జూఁడఁగొని యొక ప్రత్యేక ప్రకృతినిఁ గల్పించుకొని దాని నిందుగఁ జైతన్యసౌందర్యములే పాడ కట్టఁజేసి యందొక యున్నతస్థానమున దివ్యసింహాసనారూఢుఁడై యానందము నుపభోగించుచుండును. స్వచ్ఛంద స్వాతంత్ర్య ప్రియుఁడగు కవి భావాలాపములే, యతని స్వాతంత్ర్య ద్యోతక దివ్యగానములే, కావ్యములు.

కృతి సప్తసంతానములలోఁ బూర్వాభిగణ్యము. కృతికర్తయును, గృతి పతియును, బెక్కుదైవత వత్సరము లింద్రలోకమున వసింతురని శాస్త్రవచనము. కవితా సాహాయ్యమున మహానుభావులై పలువురు దుర్ఘటలాభ పరంపరలను గాంచిరి.

రామాయణమునఁ గపులు వారాశిఁ గట్టిరని వ్రా[illegible] యున్నదని యొక పోగదీవి యని వచింతురని యప్పయ్య[illegible] చెప్పుచున్నాఁడు. వ్యాసుల కలముపోటు తగులనిచో ని[illegible] ప్రస్థము పేరుగూడ వినియుండము. కవిత్వము రచింపఁ[illegible] పాండిత్యాదులు దీపప్రకాశ విహీనమగు నింటియందలి సం[illegible] పదలు. అగాధసముద్రాంతరమునఁ బడియుండు రత్నరాసులు. నిలిచిన నీరము.

శ్లో॥ కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే ।
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే ॥

కావ్యములు తప్ప జనులకింతటి గొప్ప ప్రయోజనము లను సమకూర్పఁ జాలునది వేఱొండుండదు. కావ్యములు సక ల సంపత్కరములు. కవి దేవాంశసంభూతుఁడు.

మ॥ జననాథాగ్రణి యాత్మరాజ్యమున ని
చ్చల్ పూజ్యుఁ డాసీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయఁ డన్నికడలన్
శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనకన్నన్ గవిమేటియౌ "సుకవితా
యద్యస్తి రాజ్యేనకి"
మ్మను వాక్యంబు నిజంబు దీనిఁ గనికా
వ్యంబుల్ రచింపదగున్. (అప్పకవి)

సితాతపత్రచ్ఛాయలవసించి భూభువన సామ్రాజ్యము శాసించు చక్రవర్తులకన్నఁ గవులే పూజ్యులని పెద్దలభావము.

సంస్కృతాంధ్ర భోజులును, గాళీదాస, పెద్దనలిందుకు నిదర్శ
నము.

కావ్యములు భాషాదేవి విహరించు ప్రమదావనంబులు. సాహిత్యలక్ష్మి కాస్థానరంగములు. ప్రజాసముదాయోప యోగమునకై నెలకొలుపఁబడిన సార్వకాలిక విజ్ఞాన సత్రములు. భాషాలక్ష్మికిఁ బట్టిన యాణిముత్యాల చలువ గొడుగులు.

కవితయనఁగా నెట్టిది? దాని తత్త్వమెట్టిది? లక్షణము లెవ్వి? యను నిత్యాది ప్రశ్నములు ప్రతిభాషాపండితుల సమః ఫలకములఁ బొడకట్టి యుండినందున నన్నిభాషలలోని బుధపుంగవులును వారి వారికి సరియని తోఁచినరీతి నీ విషయ ములను నిర్వచించియున్నారు.

*The art of employing words in such a manner as to produce an illusion on the imagination.* — *Macanlay.*

*Poetry we will call musical thought.* — *Carlyle.*

*It is simply the most delightful and perfect form of utterance that human words can reach* — *Arnold.*

*It is the act of uniting pleasure with truth by calling imagination to the help of reason.* — *Johnson,*

*Poet never manufactures words themselves, but builds the universal temple of nature.* — *Salisbury.*

కవితను నిర్వచించుటలో నందఱన్ని భిన్న భిన్న గతులం బోయిరని యింను మూలమున స్పష్టము. కవితాది విషయము ల నిర్వచించు గ్రంథములు ప్రతిభాషయందునున్నవి. గాని పూజ్యమైన యమరభాషయందుమాత్ర మహాప్రతిభాఖను లగు పండితులనేక గ్రంథములు వ్రాసి యున్నారు. ఇతర భాషా పండితులవలెఁ బైపైఁ దేలిన గొన్ని యంశముల నిర్వచించుటతోఁ దృప్తినొందక సంస్కృతభాషా కోవిదులు కేవలములోతునకుదిగి విషయము నామూలాగ్రముదేల్చి రాఁగల యెట్టి కాలమునకైనఁ జెడని విధమున ననేకామూల్యగ్రంథములు రచించి విజ్ఞానమును వెదచల్లి యున్నారు. అట్టి లక్షణగ్రంథములలోఁ బ్రతాపరుద్రీయము, కువలయానందము, సాహిత్యదర్పణము, రసమంజరి, దశరూపకము, రసగంగాధరము, కావ్యప్రకాశికయును, సర్వోత్కృష్టములై విరాజిల్లుచున్నవి. వానిలోఁ గావ్యప్రకాశిక యద్వితీయ గ్రంథరాజము. దీనిని సంస్కృతభాషలో మమ్మటోపాధ్యాయుఁడు రచించెను. ఇది పదియుల్లాసములుగ విభజింపఁబడి యున్నది.

ఆంధ్రభాష యనేకముఖ్యాంశములలో నమరభాషాసూత్రముల ననుసరించి నడచుటఁబట్టి విన్నకోట పెద్దనామాత్యుఁడు, భట్టుమూర్తి లోనగు కవులు కావ్యాలంకారచూడామణి, నరసభూపాలీయము, కవిజనాశ్రయము, సర్వలక్షణసార సంగ్రహము, మొదలగు గ్రంథములను బెక్కులు రచించిరి. అవి యన్నియుఁ బద్యబాహుళ్యముగల వగుట వలనఁ

ప్రస్తుతకాలమున నాంధ్రమునే విశేషించి పఠించువారి కవి
కొంతవఱకు సుబోధములు గావని తలంపఁ బడుచున్నవి.

ఈ కొఱంత దీర్చుటకై శ్రీయుత కాండూరు నరసింహా
చార్యులు కావ్యప్రకాశిక యందలి తొలుతటి యైదుల్లాసముల
లోని విషయము గ్రహించి యీ పొత్తము రచించియున్నారు.
దీనిని గ్రంథకర్త స్వయముగాఁదెచ్చి వినిపింపఁగా విని యానం
దించితిని. ఇయ్యది కేవలము భాషాంతరీకరణ మనరాదు. అం
దందుఁగొన్ని యంశములు మాతృకయందు కంటె నెక్కుడుగా
వివరింపఁ బడియుఁ గొన్నియెడల నూతన విషయములు చేర్పఁ
బడియు గ్రంథము విలువ యినుమడింపఁజేయఁ బడియున్నది.
ఇందుఁ బ్రథమోల్లాసమునఁ గావ్యోత్పత్తి బీజమును, గావ్య-
స్వరూపవిచారమును, వివరించుచు వ్రాసిన భాగము చాల
సమంజసముగ నున్నది. శబ్ద వ్యాపారాత్మకమైన లక్షణాస్వరూ
పము ద్వితీయోల్లాసమున సముల్లసితరీతిఁ దోఁపింపఁజేయఁ
బడియున్నది. చతుర్థోల్లాసమున రసము సమగ్రకళాపరిశోభిత
మై తాండవించుచున్నది. ఈ కోవిదుఁడు రస స్వరూప నిరూ
పణమును గడుఁ బ్రౌఢముగను యుక్తియుక్తముగను నడపి
యున్నాఁడు. పంచమోల్లాసమున రచనాధోరణిని గొంతవఱ
కుఁ దార్కికాంశములను నిరూపించుచు మీమాంసామార్గము
ప్రయోగించి వ్యంజనను నిరూపించినజాడ యెంతయు హృద
యంగమమై యలరారుచున్నది.

శైలి సులభమై సుబోధమై సమస్త పండిత పామరజన

రంజకమై యొప్పారుచున్నది. అందందు మాధుర్య ప్రసాద
గుణములు గూరియు చాటువుల నీ పండితుండు ముద్దులు గులు
కునట్టులు తెనిఁగించి యున్నాఁడు. ఈ గ్రంథము పాఠకులకుఁ
గవిత్వమునకు వలసిన సామగ్రిని బోధించుటయే కాక, మనో
వికాసము గలిగించి చదివి పాఠము చేయుటకుఁగూడ నెక్కు-
డుగ నుపకరింపఁ గలదు.

ప్రస్తుతకాలమునఁ బాఠశాలలోఁ బాఠ్యగ్రంథములుగా
నేర్పఱుపఁబడు పొత్తములలో నూటికిఁ దొంబది ప్రపంచమున
కు బరువుగ నుండునవి మాత్రమే యగుచున్నవి. కవితాకళను
గూర్చి రచింపఁబడిన యిట్టి యుత్తమగ్రంథములు పఠనీయము
లుగ నియోగించిన నడుగంటిన మన దేశభాష యున్నతస్థితిక
రాకపోదు. ఎల్లరకు నుపయోగించునవి కావున గవర్నమెంటు
వారు బాల బాలికా పాఠశాలలలోఁ బఠనీయ గ్రంథముగ దీనిని
నిర్ణయించి కవిని ప్రోత్సహింతురని కోరెద. దీని ద్వితీయ
భాగమును వ్రాసి యింక నిట్టి యుత్కృష్ట గ్రంథము లనేక
ములు రచించి యీకోవిదుఁడు తనకీర్తి నజరామరముగ నెల
కొనఁ జేయుగాత. పరమేశ్వరుఁ డీయన కాయురారోగ్యైశ్వర్య
ములఁ బ్రసాదించి కాపాడుఁగాత.

ఇట్లు,

ప్రొద్దుటూరు.
15—2—34

కావ్యకళానిధి, అవధానిపంచానన, & కవిసింహ,
డి. రాజశేఖరము.

॥ श्रीः ॥

# కావ్యప్రకాశవివరణము.

## ప్రథమోల్లాసము.

### ఇష్టదేవతాదిస్తుతి.

---

**श्लो॥ अमन्दानन्दमन्दरा येन्दिराराञ्चितोरसे।**
**नन्दात्मजाय कृष्णाय नाथायास्तु नमोनमः॥**

క॥ హరియెద నిరవుగఁ గైకొని
సురలెప్పుడు నుతులొనర్పఁ జోద్యంబుగ ని
ద్ధరపై వెలయు జనంబులఁ
గరుణాత్మతఁ బ్రోచుతల్లిఁ, గమలనుతింతున్.

క॥ అమ్మా! నిను హృది నిల్పక
యిమ్మానవులెన్నరాని, యిడుములఁ బడరే?
కొమ్మా! నిను నేఁ గొల్చెద
నిమ్ముగ మది నన్నుఁ బ్రోవ నెంచుము వాణీ!

ఆ॥ వె॥ ఎఱుఁగఁబడక తప్పులేవేని బడియుండు
టరిదియౌనె? సుకవి వరులు మీరు
పాలఁగ్రోలి నీరు పరిహరించెడు నంచ
రీతిఁ గరుణనాదరింత్రు గాక.

తే॥ గీ॥ అందముగఁగోరుఁ బురుషుఁడానందమెపుడు
సరస సాహిత్య మొసఁగును బరఁగఁదాని

సరస కవులకు నవరసామృతముఁ బొసంగుచుండు
నట్టి సరసులనే నిత్యమాదరింతు.

—•) గ్రంథారంభము. (•—

గ్రంథాది మధ్యాంతంబులందు మంగళమాచరించుట ప్రాచీన సంప్రదాయము. "మంగళాదులును, మంగళమధ్యంబులును, మంగళాంతంబులునగు గ్రంథంబులు (శాస్త్రంబులు) లోకోత్తరంబులగుటయేగాక, గ్రంథకర్తలు పాఠకులు మున్నగు వారలాయురారోగ్యాది సకల సంపదలం దులఁదూఁగుదురు"న్న పతంజలి మహర్షుల వాక్యమందుకు నిమిత్తము. నిర్విఘ్న పరిసమాప్తియే మంగళమునకుఁ బరమ ప్రయోజనము. మమ్మటోపాధ్యాయుఁడును తన గ్రంథారంభంబున మంగళ మాచరించుచుఁ బ్రాచీన సంప్రదాయము ననుసరించెను.

శ్లో॥ నియతికృతనియమరహితాం హ్లాదైకమయీమనన్యపరతంత్రామ్। నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి॥

అర్థము:—కవేః భారతీ=కవియొక్క వాణి, జయతి=సర్వోత్కృష్టమై వెలయుచున్నది. కవి భారతి యెట్లు వెలయుచున్నది? నిర్మితిం=నిర్మాణమును, (సృష్టిని) ఆదధతీ=చేయుచున్నటువంటిదై, ఎటువంటి సృష్టినిఁ జేయుచున్నది? నియతికృత నియమరహితామ్=ధర్మసంబంధమైన నియమముగాని, అదృష్టసంబంధమైన నియమముగాని లేనటువంటిదియు,

(అనఁగాఁ బద్మము మొదలగు వానియందుఁగల పద్మత్వా దులు ధర్మములు. వీనిచేతఁ బద్మములయందుఁగల సౌరభాదులు పద్మములవేగాని, యన్యదీయములు గావని నియమముగలదు. ఇట్టినియమము కవివాణియందు లేదని యభిప్రాయము. మఱియు స్వర్గాదులను బొందుటకు శరీరాంతర ప్రాప్తిరూపమైన యదృష్టము కారణమను నియమముగూడ దీనియందు లేదు. ఏలయనఁగా "అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః। యథాస్మై రోచతే విశ్వం తథైవ పరివర్తతే॥" అపారమైన కావ్యసంసారమునందుఁ గవి యొక్కఁడే సృష్టికర్త. ఇతనికిఁ బ్రపంచమే యేరీతిని రుచించునో యట్లే త్రిప్పుచున్నాఁడు. కావున కవిభారతీసృష్టియందు దైవనియమము పనికిరాదని భావము.) హ్లాదైకమయీమ్=సుఖముతో నిండినటువంటిదియు, అనన్యపరతంత్రామ్=సరస్వతికిఁ దప్ప నితరులకు వశము కానట్టిదియు, నవరసరుచిరామ్=శృంగారాదులగు తొమ్మిది రసములచే మనోహరమగునట్టి, సృష్టినిఁ జేయుచున్నదని యభిప్రాయము.

ప్రకృతము మమ్మటుఁడు రచియింపఁ బూనినది కావ్యప్రకాశము. కావ్యములు కవినిర్మిత నూతన సృష్టి విశేషములు. బ్రహ్మసృష్టి వ్యతిరేక నిరూపణ పూర్వకముగఁ జేయఁబడిన యీ కవిభారతీ స్తవనరూపమగు మంగళ మెంతయు నీగ్రంథప్రాశస్త్యమున కనుకూలము. తాను వివరింపఁ బూనిన విషయమున కనుగుణంబగు మంగళాచరణమే గ్రంథమునకు మిక్కిలి యొప్పు. మంగళము ఆశీరూపము, నమస్కారరూపము, వస్తునిర్దేశ

రూపమునని మూఁడు విధములు. గ్రంథాది నాచరింపఁ బడిన మంగళ మిా మూఁడింటిలో నొకటి గానలయును. "ఆశీర్నమస్క్రియా, వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్" క॥ "కృతిముఖమున దేవనమస్కృతియొండె నభీష్టవస్తు కీర్తనమొండెన్, వితతాశీః పదమొండెను, బ్రతిపాదింపంగవలయు, భద్రాపేక్షన్ ॥ అని ప్రమాణ వచనములు. ఇంచాచరింపఁ బడిన కవి భారతీ స్తవనరూపమగు నీ మంగళము నమస్కారాత్మక మగు చున్నదనియు, అత్యాది జయతి పదముచే గోచరించు చున్నదనియు, గ్రంథకర్త యాశయము.

ఇచ్చటఁ గవిభారతీసృష్టియందు బ్రహ్మ సృష్టి వ్యతిరేకత స్పష్టపఱుపఁబడి యున్నది. బ్రహ్మసృష్టి యెప్పటికిని ధర్మనియమమునకును, దైవనియమమునకును, లోఁబడును. కేవల సుఖమయముగాక సుఖదుఃఖ మిశ్రితమై యుండును. కారణ కార్యముల కధీనమై నడుచునేగాని స్వతంత్రించి ప్రవర్తింపదు. లవణకటుకషాయాది షడ్రసములచే నాత్మ గుణించనిదై వెలయును. కవిభారతీ సృష్టి యిట్టిదిగాదు. ఇది ధర్మనియమమునుగాని, దైవనియమమునుగాని పాటింపదు. పద్మాదులయందుఁగల సౌరభాదులను, చంద్రాదులయందుఁగల యాహ్లాదకత్వాదులను ముఖాదులయందు సృజింపఁగలదు. ఏ పదార్థమునుగాని తన యిచ్చవచ్చిన మార్గమునకు మార్చి క్రొత్తదిగాఁ జేయఁగలదు. దీనియందు నిత్య సుఖము తప్ప దుఃఖసంబంధ మేమూలను గోచరించదు. కార్యకారణ పరా

హీనత యన్నమాట యీ సృష్టియందు సున్న. ఇయ్యది శృంగారాది నవరసములచే మనోహరము. కావుననే కవి భారతీ సృష్టి సర్వోత్కృష్టమై యొప్పుచున్నది.

అనఁగాఁ గవులు కావ్యములను వ్రాయఁబూని నప్పుడు తమ గ్రంథము విఘ్నపరంపరలచేఁ గొట్టువడక కడవఱకుఁ గొనసాగుటకై మొదట మంగళ మాచరింతురనియు, నా మంగళమాశీర్వాద రూపముగఁగాని, యిష్టదేవతా నమస్కార రూపముగఁగాని, వస్తునిర్దేశ రూపముగఁగాని, యుండవలయు ననియు, నందుచేతనే కావ్యప్రకాశంబను లక్షణశాస్త్రమును వ్రాయఁబూనిన మమ్మటోపాధ్యాయుఁడు మొదటఁ గవి భారతీ స్తవన రూపముగ మంగళ మాచరించెననియు, నిందు బ్రహ్మ సృష్టి వ్యతిరేకత నిరూపింపఁ బడెననియుఁ, గావునఁ గవి భారతీ సృష్టి యత్యుత్తమమనియుఁ దాత్పర్యము.

## —) కా వ్య ప్ర యో జ న ము. (—

ప్రపంచమున సాంఘికముగఁగాని, యార్థికముగఁగాని, నైతికముగఁగాని, శారీరకముగఁగాని, పనికిరానట్టి పురుష ప్రయత్నము నిష్ఫలము, ఈ నాలుగింటిలో నొక్కటిగాని కవి భారతీసృష్టియందుఁ గాన్పించదుగదా? "ప్రయోజనమనుద్దిశ్యనమందోపి ప్రవర్తతే" "ఫలములేనిది మూఢుఁడుగూడ నొక కార్యమునకై ప్రవర్తింపఁ" డను న్యాయముంబట్టి ఫలములేని యీ కావ్యకర్తృత్వ ప్రయత్నమెట్లు సార్థకమగుననుట సరిగాదు.

కావ్యకరణమునకుఁ బ్రయోజనము లనేకములు. "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే॥" "కావ్యము యశస్సును, ధనమును, లోకవ్యవహారజ్ఞానమును, అసుఖనాశమును, చదివినంతనే పరమానందమును, కాంతాసమ్మితమగుటచే భార్యవలె హితోపదేశమును గలుగఁజేయుచున్న" దని మమ్మటుని యభిప్రాయము.

ప్రేయసివలె సుకుమారమతుల కాస్వాద ముఖమున గుడమిశ్రౌషధన్యాయముతో హితోపదేశమొసర్చుకావ్యములను గాంతాసమ్మితములందురు. బాలురు ఔషధము పుచ్చుకొన వలసినప్పుడు బేరుపెట్టుఁగా ఔషధముచుట్టు బెల్లమంటించి బెల్లమని చెప్పి మ్రింగింతురు. ఇదియే గుడమిశ్రౌషధన్యాయము. అట్లే కావ్యములు పైకిఁ దియ్యఁగాఁ గానుపించినను లోపల హితోపదేశసమర్థము లగుచున్నవి. కాళిదాసాదులు కావ్యములను రచించి కీర్తినిసంపాదించిరి. ధావకాదులు శ్రీహర్షాదుల వలన ధనముసంపాదించిరి. వీనివలనఁ బూర్వరాజ చరిత్రమును, లోకవ్యవహారమును, ఆయా కాలముల పరిస్థితులును, దెలియుచున్నవి. తన కవితాశక్తిచేమయూరకవి సూర్యునారాధించి కుష్ఠరోగమునుండి విముక్తుఁడాయెను. మఱియు నీ కావ్యములు సకల ప్రయోజనముల కగ్రగణ్యమును, యుగపద్రసానుభవాత్మకమును, నగు సద్యఃపరనిర్వృతి యానందము నొసఁగుచున్నవి. లోకోత్తర వర్ణనాచతురుఁ

తగు కవి వ్యాపారములు కావ్యములు. కావ్యములలోని శబ్దార్థములు రసాంగములు. కావునఁ గావ్యములు ప్రభుసమ్మితశబ్దప్రధానములగు వేదాదిశాస్త్రములకంటెను, సుహృత్సమ్మిత అర్థప్రధానములగు పురాణేతిహాసముల కంటెను, విలక్షణముగఁ బ్రియునిఁ బ్రేయసివలె సారస్యమున నభిముఖపఱిచి "రామాదులవలె వర్తింప వలయుంగాని రావణాదులవలెఁగూడ" దను నుపదేశమును గవికిని, సహృదయునకుం గలిగించును.

అనఁగాఁ బ్రపంచమునందు శ్రుతులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, మొదలైనవిగలవు. అవిజనులకుఁగావలసిన హిత ముపదేశించును. ఇంతకన్నఁ గవులు రచించు కావ్యము లేమిచేయును?. అవ్వియు శ్రుతి పురాణాదులవలె హితమునే బోధించునందువేని హితోపదేశమునకు శ్రుతి పురాణాదులే చాలియుండఁగాఁ గావ్యముల వలనఁ గలుగు విశేషప్రయోజనమేమున్న"దని యొక ప్రశ్నము బయలుదేఱుచున్నది.

కావ్యములు శ్రుతిపురాణాదులవలె హితమునే బోధించుచుండినను, బోధనా పద్ధతియందొండొంటికి భేదము గలదు. లోకమునందుఁ బురుషుఁడు చక్కని మార్గమునఁ బ్రవర్తించుటకు మువ్వురు తోడ్పడుచున్నారు. ప్రభువు. సుహృత్తు. కాంత. ప్రభు వాజ్ఞారూపముగ శాసనముల శాసించి యకార్యములనుండి తొలఁగించును. సుహృత్తు ఆజ్ఞారూపముగాఁగాక "ఇది యకార్యము. దీనినార్యులాచరింపరు" అన్న రీతిని

వారించును. కాంత తన మృదు మధుర వచనవిలాసముల చేఁ బ్రియునిఁ బరవశునిఁగావించి చక్కని మార్గమునకుఁ ద్రిప్పునున్నది. ఈమూఁడిటిలో మొదటి రెండును సుకుమారమతుల విషయమునకుఁ బనికి రావు. మూఁడవ మార్గ మేయందుకుఁజాలినది. ఇది లోకపద్ధతి. ఇట్లే మానవులకు హిత ముపదేశించు గ్రంథభాగములు మూఁడు విధములు. ప్రభుసమ్మితములు, సుహృత్సమ్మితములు. కాంతాసమ్మితములు. వేదాదులు ప్రభువువలె నాజ్ఞారూపమున నిరంకుశముగఁ గార్యభాగముల శాసించుంగావున వానిని బ్రభు సమ్మితములందురు. పురాణాదులు మిత్రునివలె నెమ్మదిగఁగార్యముల బోధించుంగాన వానిని సుహృత్సమ్మితములందురు. కావ్యములు, ప్రభువువలెను గాక, సుహృత్తువలెనుగాక, కాంతవలె సరసంపుఁ బలుకులచేఁ జిత్తమాకర్షించి నేర్పుతోఁగార్య భాగమును మనస్సునకెక్కించుంగావున వానిని గాంతా సమ్మితములందురనిముందే చెప్పఁబడెను. ఇందు మొదటి రెండును దృఢచిత్తులవిషయమునఁ బనికి వచ్చునుగాని, సుకుమారమతులగు రాజపుత్రాదుల విషయమునఁ బనికిరావు. అవివారికి మిక్కిలి కఠినములు, దురవగాహములు. అట్టివారికి హిత ప్రవృత్తి నిఁ గలిగింపవలయుననినఁ గాంతా సమ్మితములగు కావ్యములే వలంతులు. కావ్యములకిది యొక ముఖ్యప్రయోజనము. యశోవిత్తాదులు ప్రయోజనాంతరములు. కావ్యములు ఇవ్విధముగ సాంఘికాది ప్రయోజనములు గలవగుచుండుటచేఁ బ్రయోజనహీనములని తలఁపరాదు.

కొందఱు సామాన్యముగ "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" "కావ్యసంబద్ధమైన ప్రసంగములను (కావ్యములను రచించ వలయునన్న తలంపులను) మానుకొనవలయు" నని చెప్పుదురు గాని విద్యానాథుఁడు మొదలగు లాక్షణికులు "పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణమర్హతి" యథా రామగుణవర్ణనం రామాయణ వల్మీక జన్మనో ర్మహా ప్రతిష్ఠాకారణం తథా మహాపురుష గుణ వర్ణనేన శ్రేయస్కరీ ప్రబంధస్థితిః" "పుణ్యశ్లోకుని చరిత ముదాహరింపఁ దగును" "రామగుణ వర్ణనముచేత రామాయణ వాల్మీకులకుఁ బ్రతిష్ఠ యతిశయించునట్లు మహాపురుషగుణ వర్ణనముచేతఁ బ్రబంధ ప్రతిష్ఠ యుత్తమ మగునని వ్రాసియుండుటచేతను, సదాశ్రయ కావ్యమువలన ననేక ప్రయోజనములున్నవని ముందు నిరూపించి యుండుటచేతను, కొందఱు చెప్పుమాట లసత్కావ్యపరములని యంగీకరింప వలెను. లేనిచో విరుద్ధవాక్య పరిహారము దుర్లభమగును.

## —§ కా వ్యో త్ప త్తి బీ జ ము. §—

కావ్యప్రయోజన నిరూపణానంతరము కావ్యోత్పత్తి నిమిత్తమునుగూర్చి ప్రశ్న యుదయించుట సహజము. కావ్యోత్పత్తికి "శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్। కావ్యజ్ఞశిక్ష యాభ్యాస ఇతిహేతు స్తదుద్భవే॥" "శక్తియు, లోకమును, గావ్యశాస్త్రములను జూచుటవలని సామర్థ్యమును గావ్యముల నెఱింగినవారికడ శిక్షను బొందుటయుఁ, జేరి కా

వ్యోత్పత్తికిఁ గారణము" అని మమ్మటుని యభిప్రాయము. శక్తియనఁగాఁ గవితోత్పత్తికిఁ గారణ భూతమగు పూర్వజన్మ సంస్కార విశేషము. ఏ శక్తిలేనిది కావ్యములు రచియించుట యసాధ్యమో సాధ్యమైనను బరిహాసాస్పదమో యట్టిది. స్థావర జంగమరూపమగు లోకవ్యాపారము లోకము. అభిధాన, కోశ, ఛందో వ్యాకరణ, కలా, చతుర్వర్గ, గజతురగఖడ్గాది లక్షణ గ్రంథములు శాస్త్రములు. మహాకవి విరచిత గ్రంథములే కావ్యములు. ఇతిహాసాదులుగూడ నిందులో గ్రహింపఁబడు చున్నవి. కావ్యమును, రచియించుటకును, విమర్శించుటకును అర్హులగువారు కావ్యజ్ఞులు. ఈ మూఁడును జేరి కావ్యోత్పత్తికి నిమిత్తముగాని ప్రత్యేకముగ నిమిత్తముగాఁ జాలవు. ఈ యభి ప్రాయమును, కారికలోని 'హేతుః' అను నేకవచన ప్రయో గము తెలుపుచున్నదని గ్రంథకర్తగారి యాశయము.

అనఁగాఁ గావ్యమును రచింపఁబూనిన పురుషుని కావ్య రచనమునకు మూఁడు విషయములు మిళితములై కారణమగు చున్నవి. అందు మొదటిది కావ్యరచనమున కర్హమైన పూర్వ జన్మసంస్కార విశేషము. ఇదియే ముఖ్యమైన కారణము. ఇది లేనిచోఁ గావ్యము సరసముగఁ గుదురదు. విరసమై యనేక దోషాకరమగుటచేత సహృదయుల పరిహాసమున కాస్పద మగును.

రెండవది లోకవ్యవహారమును జక్కఁగా నెఱుంగుట వలనను, శాస్త్రములను గావ్యములను బాగుగాఁ దెలిసికొనుట

వలనను, సంపాదించిన గట్టితనము. వ్యవహారజ్ఞానము లేనిచో లౌకిక పదార్థ స్వరూప స్వభావాములుగాని, శాస్త్రకావ్య పరిచయము లేకుండినఁ బదార్థతత్త్వ, పూర్వకవి సంప్రదాయాదులుగాని తెలియక పోవును. వీని నెఱుంగు నంతవఱకుఁ గావ్యములయందు సంప్రదాయ సిద్ధమైన రసవద్వర్ణనము సంభవింపదు. రసవద్వర్ణనమే కావ్యమునకు మెఱుఁగు.

మూఁడవది కావ్యముల రచించుటకును, విమర్శించుటకును, సమర్థులగు వారికడ శిక్షనుబొంది యభ్యాసమునందుంచుకొనుట. శిక్షాపాటవములేని కవి సందర్భోచితముగ సరస శబ్ద ప్రయోగముఁ గావించుట దుష్కరము. అభ్యాస విహీనునకుఁ గావలసిన శబ్దస్ఫురణము లేమిఁ గావ్యములు వికట శబ్ద పూరితములై కటువులగును. ఇంతకుఁ దేలిన యర్థమేమనఁగా, కావ్యరచనానుకూల పూర్వజన్మసంస్కార సంస్కృతుఁడగువాఁడు చక్కఁగా లోకవ్యవహారముల నెఱింగి శాస్త్రములను, గావ్యములను బరిశీలించి, కావ్యజ్ఞశిక్షాభ్యాసములను బొంది కావ్యకరణమునకు యత్నింపవలయు ననియు, అట్టి కవి కల్పించి కావ్యములు మిక్కిలి రసవంతములై తేనెలొలుకు పలుకుల ముద్దులు గులుకుచు లోకోత్తరములై ప్రకాశించు చుండునని తాత్పర్యము.

ఇవ్విషయంబున నవీనాలంకారికులగు జగన్నాథ పండితులకును, మమ్మటోపాధ్యాయులకును, గొప్ప యభిప్రాయ

భేదముగలవు. జగన్నాథ పండితులు తమరసగంగాధరమునఁ గావ్యోత్పత్తి హేతువులను విమర్శించుచు,

"తస్యకారణం కవిగతా కేవలా ప్రతిభా, సాచకావ్య ఘటనానుకూల శబ్దార్థోపస్థితిః, తస్యాశ్చ హేతుః క్వచిద్దేవతా మహాపురుష ప్రసాదాది జన్యమదృష్టమ్, క్వచిచ్చ విలక్షణ వ్యుత్పత్తి కావ్యకరణాభ్యాసౌ, నతు త్రయమేవ, బాలాదేస్తౌ వినాపి కేవలాన్మహాపురుష ప్రసాదాదపి ప్రతిభోత్పత్తేః నచత త్రజన్మాంతరీయయోః కల్పనం వాచ్యమ్. గౌరవాన్మానా భావాదన్యథాప్యుపపత్తేశ్చ, నాపి కేవల మదృష్టమేవకారణ మిత్యపి శక్యంవదితుమ్, కియంతంచిత్కాలం కావ్యం కర్తు మశక్నువతః కథమపి సంజాతయోః వ్యుత్పత్త్యభ్యాసయోః ప్రతిభాయాః ప్రాదుర్భావస్య దర్శనాత్॥"

"కావ్యమునకుఁ గవిగతమైన ప్రతిభమాత్రమే కారణము. కావ్యరచనకుఁ దగిన శబ్దార్థములు తోఁచుటయే ప్రతిభ. అద్దానికి నిమిత్త మొకప్పుడు దేవతా మహాపురుషుల యనుగ్రహము వలనఁ గలిగిన యదృష్టము. ఒకప్పుడు విలక్షణమగు వ్యుత్పత్తి కావ్యకరణాభ్యాసములు, ఈమూఁటిను ప్రత్యేకముగఁ గారణము లేగాని మిళితములై కారణముగాఁ జాలవు. బాలురు మొదలగు వారికి వ్యుత్పత్త్యభ్యాసము లప్పటి యతని ప్రతిభకుఁ గారణమని కల్పించుటకుఁ బ్రమాణము లేకపోవుటయేగాక కారణాంతరములచే నయ్యది సిద్ధిం

ర్థములే కావ్య"మని సూత్రార్థము. ఏదో యొక యెడనలంకార విరహితములైనను అనుటకు అంతట నలంకారములుగూడ నుండవలయుననియు అలంకారముస్ఫుటముగా లేనిచోటఁ గూడ రసాదులనుబట్టి యదియుఁ గావ్యమే యగుననియుఁ, దాత్పర్యము. అదియెట్లు?

—*) అ స్ఫు టా లం కా ర మ గు కా వ్య ము. (*—

"యః కౌమార హరః సఏవహి వర స్తా ఏవ చైత్రక్షపా,
స్తే చోన్మీలిత మాలతీసురభయః ప్రౌఢాః కదంబానిలాః
సాచైవాఽస్మి తథాఽపి తత్రసురత వ్యాపారలీలావిధౌ
రేవా రోధసి వేతసీ తరుతలే చేతః సముత్కంఠతే॥"

తా॥ ఎవఁడు చిన్ననాఁటి నాయెలజవ్వనమును గొల్లఁగొనెనో యామనోహరుఁడే యితఁడు. ఆనాఁటి వసంతరాత్రములే యివి. ఆనాఁటి విరిసిన జాజి పూఁదావుల వెదఁ జల్లు మందమారుతములే యియ్యవి. నేనును సుఖపరవశు రాలనగు నాఁటి రతోత్సుకనే, అట్లయ్యును నామనస్సు రేవాతీరమునందలి యావేతస తరుచ్ఛాయా విహారమునే కోరుచున్నది.

స్వాధీనపతికయగు నొకనాయిక ప్రియాదులంగాంచి సంభోగాభిలాషిణియై తనసఖికిట్లు స్వాభిప్రాయమును సూచించుచున్నది.

ఇచ్చటఁ బద్యార్థము గోచరించిన వెంటనే యేట్టి యలంకారముగాని ప్రధానముగ స్ఫురింపదు. ఇందు రసము ముఖ్యముగాఁ జమత్కారియగుటచే రసవదలంకారము స్ఫుటమని చెప్పఁజాలము. ఒకరసము మఱియొక రసమున కంగమగునేని రసవదలంకారమని వ్యవహారము. ఇందలి రసము ముఖ్యముగాని యంగముగాదు. కావున నీకావ్యమున స్ఫుటమగు నలంకారము లెవ్వియు లేకున్నను, గావ్యాత్మభూతమగు శృంగార రసముంబట్టి కావ్యవ్యవహారము చెల్లుచున్నదని ప్రకాశకారుని యభిప్రాయము. మొత్తమునకు "ఏదియేని నొకయెడ నలంకారము స్ఫుటముగ లేకున్నను నంతట దోషవర్జితములై గుణాలంకార యుక్తములగు శబ్దార్థములు కావ్యమని" కావ్యలక్షణము తేలుచున్నది.

శాస్త్ర చర్చలయందు నందఱొక యభిప్రాయమునకు వచ్చుట కడుదుర్లభము. విషయ నిరూపణ చేయవలసి వచ్చినపుడు వారువారు తమతమ యనుభవమును బట్టి వేఱువేఱు రీతుల విమర్శించుట మొదటినుండి యింతవఱకు వాడుకయై యున్నది. ఇతర శాస్త్రకారులకంటె లాక్షణికులకు నేకాభిప్రాయత కుదురుట మహాకష్టము. కనుకనే కావ్యస్వరూప విషయమునందు ననేకభిన్నాభిప్రాయములు కన్పట్టుచున్నవి.

## —♦] కావ్యస్వరూప భేదములు. [♦—

"కావ్యమున కాత్మధ్వని"యని యానందవర్ధనుఁడు,
"కావ్యమునకాత్మ రీతి"యని వామనుఁడు,
"రసాత్మకమగు వాక్యమే కావ్య"మని విశ్వనాథకవిరాజు.
"రమణీయార్థ ప్రతిపాదకమగు శబ్దమే కావ్య"మని జగన్నాథపండితుఁడు.

ఇట్లు పలువురు పలుతెఱఁగుల వివరించుచున్నారు. ప్రసక్తమగుటచే వారివారి యభిప్రాయముల నించుకించుక ప్రకటించుట యుక్తము.

పలువురు కావ్యములయందు ధ్వనియనునది మఱియొకటి లేదని వాదించుచుండఁగా వారివాదములను ఖండించి ధ్వనిని సాధించి యదియె కావ్యమున కాత్మయని యానందవర్ధనుఁ డభిప్రాయపడుచున్నాఁడు. ధ్వనియే లేదను వారి యభిప్రాయమేమనఁగా, "కావ్యమునకు శబ్దార్థములు శరీరము శబ్దగతములైన యనుప్రాసాదులును, అర్థగతములయిన యుపమాదులును, శోభాధాయకములు. వర్ణసంఘటనా ధర్మములగు మాధుర్యాదులును, ఉపనాగరికాదులును, వైదర్భి మొదలగు రీతులును, గావ్యాలంకార హేతువులై యొప్పుచుండ వానికంటెను భిన్నమగు ధ్వనియనునది మఱేమున్న"దని కొందఱనిరి.

మఱికొందఱు ప్రసిద్ధములగు శబ్దార్థ గుణాలంకారా దులకంటె వేఱగునది కావ్యమే కాఁజాలదు. సహృదయుల కానందమునిచ్చు శబ్దార్థయుగళమే గదా కావ్యము? కొందఱు సహృదయబ్రువులు మాత్రము కావ్యము నొకదానిని 'ధ్వని' 'ధ్వని' యని వ్యవహరించినను నది సర్వసమ్మతము గాఁజా లదు. కావున ధ్వని యనునదియే లేదనిరి.

ఇంకఁ గొందఱు "ధ్వని యనునది యుండవచ్చును గాని యది పూర్వోక్త శబ్దగుణాలంకారాదుల నంతర్భూతమగుటచే నదియొక యపూర్వపదార్థమని చెప్ప నొప్పు" దనిరి.

ఈవాదములన్నియు విమర్శించి చేసినవి గావని ధ్వనికా రుఁడు. అది యెట్లనఁగా 'అర్థము, వాచ్యము ప్రతీయమానము నని రెండు విధములు. ఉపమారూపకాదులచే నానాభంగుల వివరింపఁబడు వాచ్యార్థ మెల్లరకు సుప్రసిద్ధము. శరీరమునం దలంకృతములయిన కరచరణాద్యవయవములకంటె వేఱుగ లావణ్యము ప్రకాశించునట్లు మహాకవి వాక్యములందు గుణా లంకారాలంకృతమైన వాచ్యార్థముకంటె భిన్నముగ నొక యర్థ ము ప్రకాశించుచున్నది. ఇదియే ప్రతీయమాన మనఁబడును.

" భ్రమధార్మిక! విస్రబ్ధం స శునకోఽద్యమారిత స్తేన।
గోదావరీ కచ్ఛకుహరవాసినా దృప్తసింహేన॥"

(ప్రాకృతచ్ఛాయ)

తా॥ ఓయీ! ధార్మిక! యాకుక్క యిప్పుడు గోదావరి

యొద్దను గుహాయందుండెడి మదించిన సింహముచేఁ జంపఁ
జెను. గనుక నీయిచ్ఛవచ్చినట్లు సంచరించుము.

ఒక యింతి సంకేతస్థానమునఁ బుష్పములఁ గోయుఁ
సంభోగమున కంతరాయముఁ గలిగించుచున్న ధార్మికుని గు
ర్చి తన యంతరాయమును దొలఁగించుకొనుటకై యిట్లు బ
కుచున్నది. ఈపద్యమునందు వాచ్యార్థము 'ఇచ్చట య థే
ముగ సంచరింప వచ్చున'నియు, దేశకాలప్రకరణము 'లిందు స
చరింపఁ గూడద'నియుఁ, జెప్పుచున్నవి. ఇచ్చట విధిరూపమై
వాచ్యార్థముకంటె నిషేధరూపమయిన వేఱొకయర్థమున్న
ఎల్లరును గ్రహింపఁగలరు. అట్లుగాదేని సామాన్యమైన కుక్క
కే భయపడునటువంటి ధార్మికునిగూర్చి సింహమున్నదని
ప్పుట యసంగతమగునుగాదా? అట్లు తోఁచునట్టి యర్థమ
ప్రతీయమానముగాక వాచ్యమున నేరికిఁ దెలియు?

మఱియు నిందు వాచ్యార్థముకంటెఁ బ్రతీయమానా
మే చమత్కారజనకము గనుక "ఎచ్చట శబ్దముచేఁగాని, యర్థ
ముచేఁగాని, వాచ్యార్థముకంటెఁ జమత్కారియైన వేఱొక య
ర్థము ప్రధానముగ బోధింపఁబడుచున్నదో యాకావ్యమే ధ్వని
యనఁబడును". అని ధ్వనికి నిర్దుష్టమైన లక్షణమేర్పడుటయే
గాక శబ్దార్థాలంకారాదులకంటె భిన్నత్వముగూడ సిద్ధించుచు
న్నది. కావున సహృదయులకుఁ జమత్కారియై వ్యంగ్యరూప
మగు ధ్వనియే కావ్యమున కాత్మయగుచున్నదని యానందవర్ధ

నుని సిద్ధాంతము. వస్త్వలంకార రసరూపముల మూఁడు విధములగు ధ్వనిలోను ప్రధానమగుటంబట్టి రసరూపధ్వనియే కావ్యాత్మ యనియు, వస్త్వలంకార ధ్వనులు రసాంగములగుటంబట్టి యవ్వియు నాత్మకోటియందుఁ జేర్పఁబడుచున్నవనియు వీరి తాత్పర్యము.

## — వామనుఁడు —

ఇతఁడు తన కావ్యాలంకార సూత్రములయందు "కావ్యమున కాత్మరీతి" అది విశిష్టములగు పదముల రచన, పదముల లోని విశేషము గుణరూపము" అని వక్కాణించెను. అంతటఁ టీకాకారుఁడు సంఘటనారూపమగు రీతి కావ్యమున కాత్మ కాఁజాలదని తలఁచి యేమో రీతియన అంపమువంటి కఠినములగు తర్కవాక్యములకంటె విలక్షణమగు స్ఫూర్తినిఁ బ్రకటించు నొక స్వభావవిశేషమని యర్థమును వ్రాసి యట్టిది కావ్యాత్మయనుటకు బాధకముండదను నభిప్రాయమును విశదపఱిచెను.

## — విశ్వనాథ కవిరాజు —

ఇతఁడు పైవారి యభిప్రాయముల నన్నిఁటినిఁ గ్రింది విధమున ఖండించి తుదకుఁ దానొక యభిప్రాయమును గనుపఱిచెను. ఇతఁడు తన సాహిత్యదర్పణమున సర్వశ్రేయములకు మూలమగు కావ్యస్వరూపమును నిరూపించుచుఁ గావ్యమన నెట్టిదని ప్రశ్నించుకొని "ఒకఁడు (మమ్మటుఁడు) దోష

రహితములై గుణాలంకార యుక్తములగు శబ్దార్థములు కావ్య మ"ని పలికెను. కాని యది యవిచారమూలకము. ఏలయన, దోషములులేని శబ్దార్థములే కావ్యమగునేని—

"న్యక్కారోహ్యయమేవ మే యదరయః తత్రాప్యసౌతాపసః
సోఽప్యత్రైవ నిహంతి రాక్షసకులం జీవత్యహో రావణః॥
ధిక్ ధిక్ శక్రజితం ప్రబోధితవతా కిం కుంభకర్ణేనవా,
స్వర్గగ్రామటికావిలుంఠనవృథో చ్ఛూనైః కిమేభిర్భుజైః॥
(హనుమన్నాటకము)

తా॥ రాముఁడు రాక్షసులను సంహరించుచుండఁగా మన మునఁ గలఁగి రావణుఁడు తన్నుగుఱించి యిట్లు విసుఁగుకొను చున్నాఁడు. "నాకును శత్రువులు గలరనుటయే నిందింపవ లసి యున్నది. అందును ఈమానుషమాత్రుఁడగు తాపసుఁడు నాకు శత్రువు. అతఁడును ఎక్కడనో గాక నా సమీపముననే రాక్షసకులము నాశనము చేయుచున్నాఁడు. కట్టా, ఇంత జరి గియు రావణుఁడు బ్రదుకుచున్నాఁడా? ఛీ, ఛీ, ఇంద్రజిత్తుతో ఫలమేమి? మేలుకొని యున్నట్టి కుంభకర్ణునిచే ఫలమేమి? స్వర్గమనునట్టి యొక చిన్నపల్లెను ధ్వంసము చేసి వ్యర్థముగ బలిసిన యీ భుజములచేతను నేమి ప్రయోజనము?

ఈ పద్యమునందు నాల్గవ పాదమున విధేయావిమర్శ దోష ముండుటఁబట్టి యిది యెప్పటికిఁ గావ్యముకాకపోవల యును. ఒక దానిని గుఱించి విధింపఁదగినది విధేయము.

విధింపవలసినప్పుడు విధేయాంశమిది సమాసఘటితముగాక, విడిగానుండవలయును. పైశ్లోక పాదమునందు "భుజములు వ్యర్థముల"ని భుజములనుగూర్చి వ్యర్థత్వము విధింపఁబడుచున్నది. గాని విధింపఁబడనున్న వృథాత్వరూప విధేయాంశము సమాసఘటితమై యుండుటచేత స్పష్టముగా స్ఫురింపదు. ఇచ్చటఁ గవికి "భుజములు వ్యర్థములనియేగాని, వ్యర్థములైన భుజముల"ని యభిప్రాయముకాదు. విధేయాంశము స్పష్టముగానప్పుడు విధేయావిమర్శమను కావ్యదోషము సంభవించునని ప్రాచీన సంప్రదాయము. కావున నిందు విధేయావిమర్శరూప కావ్యదోషముండుటఁబట్టి యిది యెట్లు దోషరహితమగు కావ్యమగును?

మఱియు నియ్యది యుత్తమకావ్యమని పలువు రంగీకరించి యుండుటచేఁ గావ్యము కాదనుటకు వీలుపడదు. కాఁబట్టి దోషరహితమగు శబ్దార్థములు కావ్యమనుట సరిపడదు. ఈ పద్యమునందొక యంశముమాత్రము దుష్టమైనను సర్వాంశము దుష్టముకాదుగనుక కావ్యత్వము చెల్లుచున్నదని చెప్పుచో నప్పుడు 'ఏ యంశము దుష్టమో యది యకావ్యమనియు, ఏది యదుష్టమో యది యుత్తమకావ్యమని చెప్పవలసివచ్చును. అత్తఱి రెండుప్రక్కల లాగఁబడు నియ్యది కావ్యముగాని, యకావ్యముగాని యేదియుఁ గాఁజాలదు.

మఱియుఁ బై కావ్యలక్షణమునందు "సగుణములగు శబ్దార్థముల"ని చెప్పఁబడిన సగుణవిశేషణము అసంగతము.

గుణములు కావ్యమున నాత్మభూతమగు రసధర్మములు గాని శరీరప్రాయములగు శబ్దార్థ ధర్మములు గావు. "యేరసస్యాఙ్గినోధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః, తేగుణాః ॥ "ఎవ్వి యాత్మకు శౌర్యాదులవలె నంగిభూతమగు (ప్రధానమగు) రసమునకు ధర్మములో నవ్వియే గుణములు" అను తనవాక్యమే యిందుకుఁ బ్రమాణము. కావ్యస్వరూపముగ నంగీకరింపఁ బడిన శబ్దార్థములయందు రసమున్నదందువా? లేదా? లేదంటి వేని గుణములు సహితము లేవు. ఉన్నదందు వేని 'సగుణము' లనుటకంటె సరసములనుట యుత్తమము. 'సగుణముల'ను విశేషణమే యీ యర్థమును బోధించుననుచో లోకము నందు "ప్రాణిమంతములు దేశముల"ని వాడుక యున్నదిగాని, "శౌర్యాది మంతముల"ని లేదుగదా, కావున "సరసములగు శబ్దార్థముల"ని యుండవలయునే గాని "సగుణములగు శబ్దార్థము"లని లక్షణముండఁగూడదు.

మఱియు "యఃకౌమారహరః" అను పద్యమునందు విభావనావిశేషోక్తి మూలకమైన సందేహ సంకరాలంకారము స్ఫుటముగా నుండినను "స్ఫుటమగు నలంకార మిందేదియు లే"దనుట విచారణీయము.

("కారణము లేకున్నను గార్యోత్పత్తి కథనము' విభావనాలంకారము. "కారణమున్నను గార్యోత్పత్తి గలుగకుండు నట్లు వర్ణించుట" విశేషోక్త్యలంకారము. ఇందు వరుఁడు, ఉపకర

ణములు, మొదలగు వాని యనుపభోగరూపమైన కారణము లేకున్నను, దత్కార్యంబైన యుత్కంఠ యుదయించుటం జేసి విభావనాలంకారమా? లేక 'వరోపకరణాద్యుపభోగరూపమైన కారణమున్నను దత్కార్యంబైన యుత్కంఠాభావము లేమింజేసి విశేషోక్తియా? యని సందేహ ముదయించి తన్మూలకంబైన సంకరాలంకారము స్ఫుటముగాఁ గన్పట్టుచున్నదని విశ్వనాథుని యభిప్రాయము. గాని కావ్యములయందు వాచ్యములగు నలంకారములకుఁ దక్క నితరములకు స్ఫుటములను వ్యవహారములేదు కాఁబట్టి యిందలి విభావనా విశేషోక్తులు వాచ్యములు గాక యార్థికములగుటచే వీని మూలకమైన సందేహ సంకరము స్ఫుటము గాదని మమ్మటుని తాత్పర్యము.)

మఱియు, ధ్వనికారుఁడు చెప్పిన కావ్యాత్మయగు ధ్వని వస్త్వలంకార రసరూపమా? రసాది రూపము మాత్రమా? కావ్యములనుటకు వీలుగాని ప్రహేళికాదులును (ఖండకావ్యములు) వస్త్వలంకార ధ్వనిగల వగుటంబట్టి మొదటి పక్షము నంగీకరింపఁ జాలము. రెండవ పక్షమే సమ్మతమగునేని శుభంబగుఁ గాక.

రసాది రూపధ్వని మాత్రమే కావ్యమున కాత్మయని చెప్పు పక్షమున.

"శ్వశ్రూరత్ర నిమజ్జతి, అత్రాహం దివసకం ప్రలోకయ! మాపథిక! రాత్ర్యంధ! శయ్యాయామావ యోర్నిమంక్ష్యసి."
[ప్రాకృత ఛాయ]

తా॥ రేఁజీఁకటిగీల యోయీ! తెరువరీ! ఇచ్చట మా యత్త యొడలెఱుంగక పడియుండును. [నిద్రించును] నేనిందుఁ బరుండి యుందును. పొద్దు క్రొంచెముగా నున్నది చూడుము. మా శయ్యపైఁ బడెదవు సుమా...

ఇత్యాది పద్యములయందు వస్తుమాత్రమే వ్యంగ్యమై నను గావ్య వ్యవహారమెట్లు చెల్లుచున్నది? అని కొందఱు ప్రశ్నింప వచ్చును గాని, వస్తుమాత్ర వ్యంగ్యమును బట్టి గాక రసాభాస వ్యంగ్యమునుబట్టి కావ్యవ్యవహారము చెల్లుచున్నదన వలయును, లేనిచో "దేవదత్తుఁడు గ్రామమునకు వెళ్లుచున్నాఁ డ"ను నెడఁ దోఁచునటువంటి సేవకుని యను గమన వ్యంగ్యమును బట్టి యిదియుఁ గావ్యమున వలసి వచ్చును. రసవత్తే కావ్యమగును గాని యిది యెట్లగును?

మఱియు, "కావ్యమున కాత్మరీతి" యని చెప్పిన వామనుని లక్షణము గూడ నసంగతమే. అవయవ సంస్థాన రూపమగు సంఘటనావిశేషమే రీతి. వాక్యమునందుఁ బదములను దగిన స్థానమునందుఁ జేర్చుటయే యవయవ సంస్థానము. ఇట్టి యవయవ సంస్థానమునకును, ఆత్మకును భేదము సుప్రసిద్ధము కావున రీతి కావ్యమున కాత్మ యెట్లగును? ఇచ్చటఁ డీకాకారుని సమర్థన మెంతమాత్రము పనికి వచ్చునో చదువరులకే స్పష్టమగును.

కావున నీ లక్షణము లెవ్వియుఁ గావ్యలక్షణములు కాఁజాలవు. "రసాత్మకమగు వాక్యమే కావ్యము"ని చెప్పవల

యును. అనఁగాఁ బ్రధానముగ రసమును బోధించు వాక్యము కావ్యమని తన యభిప్రాయమును విశదపఱచెను.

## —§ జగన్నాథుఁడు. §—

ఇతఁడు తన రసగంగాధరమున "రమణీయార్థ ప్రతిపాదకమగు శబ్దమే కావ్యము" కాని ప్రాచీనులు సెప్పు "దోషవర్జితములై గుణాలంకార విశిష్టములగు శబ్దార్థములు కావ్యము''ను లక్షణము సరిపోవదు. 'కావ్యము పఠింపఁబడు చున్నది." "కావ్యము వలన నర్థము తెలిసినది." "కావ్యమును వింటిని అర్థము కాలేదు'' అను లోక ప్రసిద్ధములగు వ్యవహారముల వలనను, "శబ్దార్థములు కావ్యము"ని చెప్పుటకుఁ దగిన యితర ప్రమాణములు లేకుండుటవలనను, శబ్దమునకుఁ దప్ప శబ్దార్థయుగళమునకుఁ గావ్యత్వము సమకూరద''ని విస్తరించెను.

చక్కఁగా విమర్శించితిమేని విశ్వనాథ కవిరాజు మతముగాని, జగన్నాథుని మతముగాని, యీ విషయమున నెంతమాత్రము సరిపడదని తేలుచున్నది. "రసాత్మకమగు వాక్యము''ని చెప్పు విశ్వనాథుని మార్గము ననుసరించు పక్షమున వస్త్వలంకార వ్యంగ్యములగు "శ్వశ్రూరత్రనిమజ్జతి" ఇత్యాదులు కావ్యములనుటకు వీలులేక పోవును. ఇట్టి స్థలములయందు మహాకవులు, కపి బాలాది చరిత్రములను, బ్రవాహావేగాదులను, వస్త్వలంకార ప్రధానముగ వర్ణించి కావ్యవ్యవహారమును జెల్లింపుచుండఁగా మనము దానిని దొలఁగించుట

యసాధ్యము. లక్ష్యములనుబట్టి లక్షణమును గల్పింప వచ్చును గాని లక్షణమునుబట్టి లక్ష్యమును సవరించుకొనఁ జూచుట యనుభవ విరుద్ధము. అసాధ్యము. ఇట్టి స్థలములలోను బరంపరగా స్ఫురించుచున్న రసస్పర్శమును బట్టియే గావ్యవ్యవహారము చెల్లుచున్నదనుచో నిట్టి రసస్పర్శము "గోవు చలించుచున్నది" "మృగము పరుగిడు చున్నది" ఇత్యాది స్థలములయందును నుండుటచే నిష్ప్రయోజనము.

మఱి "రమణీయార్థ ప్రతిపాదకమగు శబ్దమే గావ్యమ"ను జగన్నాథుని మత మవలంబింతుమేని శబ్దమువలె అర్థము పుట్టించు రసాస్వాదమును బలాత్కారముగఁ గల్పింపవలసి వచ్చును. "గావ్యము వినఁబడెను, చదువఁబడెన"ను వ్యవహారమువలె "గావ్యము తెలిసికొనఁబడె"నను వ్యవహారమును ప్రసిద్ధమగుటచే 'శబ్దమే గావ్యమ'నుట యుక్తియుక్తము గాని మాట. ఇందుకు "తవ ధీతే తద్వేద" అను పాణిని వ్యాకరణ సూత్రము కూడఁ దోడ్పడు చున్నది.

కాఁబట్టియుదకెవ్వరెన్నివిధముల విమర్శించినను ప్రకృతానుభవమునుబట్టి చూడఁగా "రసాత్మకమగు వాక్యమే కావ్యమ"నిచెప్పు విశ్వనాథునికంటెను, "రమణీయార్థ ప్రతిపాదకమగు శబ్దార్థములు కావ్య"మని చెప్పు జగన్నాథుని కంటెను శబ్దార్థములు కావ్యమని చెప్పు మమ్మటుఁడే యుక్తవాదియని తోఁచుచున్నది. సరసములయిన వేణువీణాది గాన

ములు అర్థవిశేష విచారము లేకయే శబ్దములు మాత్రము ఆహ్లాదమును గలిగించుచుండుట యనుభవసిద్ధమైనట్లు నారికేళపాక ప్రధానములయిన కావ్యములను బఠించునపు డర్థవిశేష ప్రతీతిలేనిది శబ్దమాత్రముచే నెట్టి యాహ్లాదమును గలుగుట లేదు. కావున నందుఁగలిగెడి యాహ్లాద మర్థకృతమైనదని తప్పక చెప్పవలయును. ఇట్లాహ్లాద మొక్కొక్క యెడఁ గేవల శబ్దకృతముగాను నొక్కొక్క యెడఁ గేవలార్థకృతముగాను, నుండుట సకలసహృదయ విదితము. ఇట్లు శబ్దార్థములు రెండును నాహ్లాదజనకములై యొప్పుచుండ నొక్క శబ్దమునకు మాత్రమే కావ్యత్వమును జెప్పుటకుఁ గారణము గనుపింపదు. గనుక కావ్యత్వము శబ్దార్థములకు రెంటికిఁ జెప్పుటయే యుక్తమని నాయభిప్రాయము.

—♦ కావ్యభేదములు. ♦—

కావ్యములు ఉత్తమములు, మధ్యమములు, అధమములని మూఁడు విధములు. ఇవి వరుసఁగా ధ్వని, గుణీభూతవ్యంగ్య, చిత్రకావ్యము లనఁబడుచున్నవి. అందు ఉత్తమకావ్యము,

"ఇదముత్తమ మతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః"

"వాచ్యార్థముకంటె వ్యంగ్యార్థము మిగుల నానందమును బుట్టించునేని ఇది యుత్తమ కావ్యమని పండితులచేఁ జెప్పఁబడుచున్నది." అను లక్షణము గలదగుచున్నది. శబ్దములు తమతమ యర్థములనుగాక తమలోని వ్యంజనాశక్తిచేత. ప్రధాన

ముగ బోధించు స్ఫోటమును నర్థమునే ధ్వనియందురని శబ్దార్థ ములకు వ్యంగ్య వ్యంజక భావము నంగీకరించిన వైయాకరణుల మతము ననుసరించు నాలంకారికులుగూడ వాచ్యార్థము నకంటెను రమణీయమగు నర్థమును బోధించు శబ్దార్థములకు వ్యంగ్య వ్యంజకభావము నంగీకరించిరి. అనఁగాఁ గావ్యముల యందు మొదట శబ్దములు తమతమ యర్థమును బోధించును. ఇదియే వాచ్యార్థ మనఁబడును. అనంతరము శబ్దశక్తిచేతనో యర్థశక్తిచేతనో సహృదయులకు వేఱొక యర్థము తోఁచుచున్నది. ఇదియే వ్యంగ్యార్థ మనఁబడును. ఒకానొకయెడ సహృదయులకు వ్యంగ్యార్థముకంటె వాచ్యార్థము చమత్కారిగా నుండును. ఒకానొకయెడ వాచ్యార్థముకంటె వ్యంగ్యార్థము చమత్కారిగానుండును. ఏకావ్యములయందు వ్యంగ్యార్థము సొంపుగానుండి సహృదయుల హృదయముల నానందసాగరమున నోలలాడించునో యాకావ్యములు ధ్వనికావ్యము లనఁబడునని తాత్పర్యము.

"నిశ్శేషచ్యుత చందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రే దూరమనంజనే పులకితా తన్వీతవేయం తనుః।
మిథ్యావాదిని! దూతి! బాంధవజన స్యాజ్ఞాత పీడాగమే!
వాపీంస్నాతు మితోగతాఽసి నపున స్తస్యాధమస్యాంతికమ్."

తా॥ నాయకునిఁ గొనితెచ్చుటకై పంపఁబడిన దూతిక వానితో రమించి రాఁగా స్నానకార్యములను బ్రకటించు నెపమున సంభోగకార్యములను వెల్లడించు విదగ్ధనాయిక యిట్లు

బలుకుచున్నది. ఓసి దూతీ! నీయీ చనుమొనల గంధము జా ఱినది. కెమ్మోవిరాగము వీడినది. కనులం గాటుకంతయుం బో యినది. అలసిన మైదీవె గగుర్పొడిచినది. అబద్ధములాడుదానా! ఆత్మీయుల దుఃఖమెఱుంగనిదానా! బావికిం దానమాడంబోతివి గాని, యాయధముని కడకుం బోయితివా?

ఇచ్చటం బ్రేమపూర్వకముగ వరించిన నాయకుని "అధమ" పదముచే నిరూపించుటవలన నింతకుం బూర్వము నాయికానాయకుల కన్యోన్యానురాగము దృఢముగా నున్న ట్లును, అందుననే విరహము నోర్వలేక దూతినిం బంపినట్లును, ఆదూతిరాంగా దానియందుం దోంచుగుర్తులంబట్టి నాయకుని యందు నాయికకు వైరస్యముదయించినట్లును, ఆ వైరస్యము దూతీ సంభోగమూలకమైనట్లును, దానినే యధమ శబ్దము ధ్వనించుచున్నట్లును, ఆధ్వనినే స్నానసాధారణములైన చిహ్న ములు సంభోగ సాధారణములై బలపఱుచుచున్నట్లును, తన ప్రియుండు దూతీసంభోగముం జేసినవాండు అను నర్థమును నిపు ణముగా నధమశబ్దముచే వెడలించు చమత్కారమే కావ్యా త్మమై శోభిల్లుననియుం దేలుచున్నది. కావున నిది యుత్తమ కావ్యమనంబడుచున్నది.

## —♦ మధ్యమకావ్యము ♦—

"అతాదృశిగుణీభూత వ్యంగ్యంవ్యంగ్యేతు మధ్యమమ్."

"ప్రతీయమానార్థము వాచ్యార్థముకంటె నెక్కువ చ మత్కారిగాక వాచ్యార్థమున కంగమగునేని అది గుణీభూత

వ్యంగ్యమను మధ్యమకావ్య మనఁబడును."

"గ్రామతరుణం తరుణ్యానవ వంజుల మంజరీ సనాథకరమ్।
పశ్యంత్యా భవతి ముహుర్నితరాం మలినా ముఖచ్ఛాయా॥"

తా॥ క్రొత్త వంజుల (ప్రబ్బలి) పుష్పగుచ్ఛమును జే తఁబట్టుకొనిన గ్రామసుందరునిఁ గాంచెడి యువతి ముఖకాంతి మిక్కిలి వాడిపోవుచున్నది. ఒక యుపనాయిక ప్రియునకొక స్థలమునఁ దానే సంకేతమొనర్చి యింటిపనుల యాటంకముచే నచ్చటికి రాకపోఁగాఁ గొంతసేపటికందుఁ గాఁచియుండిన ప్రియుఁడీ విషయమును బేర్కొనుటకై యాఁదలి వంజుల గుచ్ఛము నొకదానిని జేతఁబట్టుకొని వచ్చెను. అతనిం గాంచి దుఃఖించెనను విషయమీ పద్యమున వర్ణింపఁబడియున్నదని యెఱుంగవలయును.

ఇచ్చట "వంజులలతాగృహమునకు వచ్చెదనని రానైతి"వను వ్యంగ్యార్థముకంటె వాచ్యార్థమే చమత్కారముగ నున్నది గావున నియ్యది మధ్యమకావ్యము.

## —♦ అధమకావ్యము ♦—

వ్యంగ్యార్థశూన్యమగు కావ్యము అధమము. అయ్యది శబ్దచిత్రము, వాచ్యచిత్రమని రెండువిధములు. చిత్రమనఁగా గుణాలంకారయుక్తము. ప్రతీయమానార్థము స్పష్టముగా లేనిది వ్యంగ్యార్థశూన్యము. వీని యుదాహరణములు యమకాదులయందును, అనుప్రాసాదులయందును, ఉపమాదులయందును స్పష్టముగాన నిందు వివరింపనైతి.

—♦ మతాంతరము ♦—

విద్యానాథుఁడును, విన్నకోట పెద్దనయు, మొదలగు వారు కవికృతకావ్యము గద్యమయము, పద్యమయము, గద్య పద్యమయమునని మూఁడు విధములుగ విభజించుచు నయ్యది యష్టాదశవర్ణనాత్మకమై యుండవలయునని వివరించుచుండఁగా నీయుత్తమ మధ్యమాధమరూపమైన విభాగమెట్లు సంగతమగు చున్నది?

"అట్లు కవికృతమైన కావ్యత్రయంబు
గద్యపద్యవిమిశ్రి సంపాద్యమండ్రు
నగరముఖ్యాష్టదశవర్ణనముల చేతఁ
బరఁగునదియును భవ్యప్రబంధ మనఁగ."

"పురవారాసి మహీధరర్తు శశభృత్సూర్యోదయోద్యాన పు
ష్కరకేళీ మధుపానమోహన వియోగక్షేమయానస్వయం
వరపుత్రోత్సవ మంత్రదూత్యరణదోస్సైన్యక్రాంతి సంకీర్తనా
కరమష్టాదశ వర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబిలన్."

(విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి)

కావ్యములన్నియు గద్యపద్యాత్మకములై యష్టాదశ వర్ణనలఁ జెన్నొందుచుఁ బూర్వోక్తవిషయ విభాగమునుబట్టి యుత్తమ మధ్యమాధమము లనఁబడుచుండు ననుటవలన నీమ తముల కెంతమాత్రము విరోధముగాని, అసంగతిగాని యుండ దని యెఱయవలయును.

ఇవ్విధముగ నిరూపింపఁబడిన కావ్యములు దృశ్యముల

నియు, శ్రవ్యములనియు, వాడఁబడుచున్నవి. నాట్యరంగస్థలములయందు నాల్గువిధములయిన యభినయముల నభినయించునపుడు చూచి యానందించఁదగినవి దృశ్యములు. వీనినే రూపకములనియు, నాటకములనియుఁ జెప్పుదురు. చదివి విని యానందించఁదగినవి శ్రవ్యములు. ఇవి ప్రత్యేక వివరణమునకర్హములగుటచే నిందు వివరింపనైతిని,

ఇంతకుఁ గావ్యమునకు రసమాత్మయనియు, శబ్దార్థములు శరీరమనియు, అనుప్రాసోపమాదు లలంకారములనియుఁ గావ్యప్రకాశకారుని యభిప్రాయమని తెలియవలయును.

—♦ గద్య. ♦—

ఇది శ్రీనిజామదేశీయ మహాబూబునగర మండలాంతర్గత పెద్దమందడి గ్రామవాసి భారద్వాజగోత్ర పవిత్ర కాండూరువంశ పయఃపారావార రాకాసుధాకర చింతకుంట రాఘవాచార్య ద్వితీయతనూజ, శ్రీపదపురవాస్తవ్య మహామహోపాధ్యాయ శ్రీమాన్, కపిస్థలాభిజన, దేశికాచార్యాది గురువర ప్రసాదలబ్ధ సాహిత్యప్రబోధ సాహిత్యశిరోమణి & ఉభయభాషాప్రవీణ పట్టసమంచిత, కడపమండల స్థానిక విద్యాశాఖాంధ్రపండిత, కాండూరు నరసింహాచార్య వివృతంబైన కావ్యప్రకాశ వివరణంబునందు ప్రథమోల్లాసము సంపూర్ణము.

# కావ్యప్రకాశవివరణము.

## ద్వితీయోల్లాసము.

### ప్రథమభాగము.

ప్రథమోల్లాసమునఁ గవిస్వరూపమును, గావ్యప్రయోజనమును, గావ్యోత్పత్తిబీజమును, గావ్యస్వరూపమును, గావ్యభేదములును, సవిమర్శముగ నిరూపింపఁబడియె. ఇఁక రెండవ యుల్లాసమునందుఁ గావ్యస్వరూపఘటితములగు శబ్దార్థంబుల స్వరూపంబును, వాని భేదములును, మొదలగునవి వివరింపఁబడును.

#### శబ్దస్వరూపము

శబ్దము వాచకము, లాక్షణికము, వ్యంజకమని మూఁడు విధములు. అర్థము సహితము వాచ్యము, లక్ష్యము. వ్యంగ్యమునని మూఁడువిధములే. కొందఱు తాత్పర్యార్థము మఱియొకటి కలదందురు. దానింగూర్చి స్థలాంతరమున వివరింతుము.

వాచ్య, లక్ష్య, వ్యంగ్యములను మూఁడువిధములైన యర్థములును మఱియొక యర్థమునకు వ్యంజకములగుచున్నవి. అనఁగా వ్యంజనాశక్తిచేత రమణీయమైన వేఱొకయర్థమును బోధించుచున్నవని తాత్పర్యము. అందు,

—♦ వ్యంగ్యవ్యంజకమైన వాచ్యము. ♦—

"మాతర్గృహోపకరణ మద్యఖలునాస్తీతి సాధితం త్వయా
తద్భణ కిం కరణీయమేవ మేవ నవాసరః స్థాయీ॥"

ప్రా॥ ఛా॥

తా॥ అమ్మా! ఇంటికిఁ గావలసిన యుపకరణములు లేవని యిప్పుడు సెప్పితివి. అందుకు నేనేమి చేయవలెనో చెప్పుము. ప్రొద్దు ఇల్లనిలువదు.

ఉపపతితో రమింపఁదలఁచిన యొక కామిని కట్టెలు దెచ్చునెపమున బయటికిఁ బోవుటకై తల్లితో నిట్లు బలుకుచున్నది. ఇందుఁ బద్యార్థమును వినిన వెంటనే సామాజికులకు వ్యంజనా వ్యాపార మహిమచే "ఈచెప్పెడు వ్యక్తి కామిని. ఈమె యుపపతి సంభోగ మపేక్షించుచున్నది" అని తోఁచుచున్నది. కావున నిందలి వాచ్యార్థము వ్యంగ్యార్థమునకు వ్యంజకమగుచున్నది.

—♦ వంగ్యవ్యంజక లక్ష్యార్థము ♦—

'సాధయంతీ సఖి! సుభగం క్షణేక్షణే దూనాసి మత్కృతే।
సద్భావ స్నేహకరణీయ సదృశకం తావద్విరచితంత్వయా॥'

ప్రా॥ ఛా॥

తా॥ ఓచెలీ! ప్రియుని సాధించుదానవై నాకొఱకుఁ బ్రతిక్షణము బహుశ్రమఁ జెందితివి. నీవు నీమంచితనమునకును, స్నేహమునకును దగినట్లాచరించితివి.

ప్రియునిఁ బిలుచుకొని వచ్చుటకై పంపఁగా నతనితోఁ దానే రమించి వచ్చిన దూతికనుఁగూర్చి నాయిక యిట్లు బలుకుచున్నది. ఇందు సుభగుని సాధించుదానవై బహుశ్రమఁజెందితివనుటచే నాప్రియునితో రమించు నీచేత శత్రుత్వమాచరింపఁబడెనను నర్థము లక్షణచే బోధింపఁబడుచున్నది. అద్దానిచేఁ "గాముకుఁ డపరాధి" యను నర్థము వ్యంగ్యమగుచున్నది. గావున నిందలి లక్ష్యార్థము మఱియొక యర్థమునకు వ్యంజకమగుచున్నది.

—♦ అర్థాంతర వ్యంజక వ్యంగ్యము ♦—

"పశ్య నిశ్చల నిష్పందా బిసినీ పత్రే రాజతే బలాకా
నిర్మల మరకత భాజన పరిస్థితా శంఖశుక్తి రివ."

తా॥ ఓప్రియా! చూడుము. నిర్మలమగు మరకతపాత్రమునందుండు ముత్తైపుఁ జిప్పవలెఁ దామరాఁకునందుఁ గొక్కెర కదలమెదలక ప్రకాశించుచున్నది.

ఉపపతిని గుఱించి యొక ముద్దియవచనము. ఇందుఁ గొక్కెర కదలమెదలకుండుటచే దానికి భయము లేకుండుటయు, అందుచే నయ్యది నిర్జన ప్రదేశమగుటయు, గనుక నయ్యది సంభోగయోగ్యమగు స్థానమనియు, వ్యంగ్యమగుచున్నది. ఇందు మొదట వాచ్యార్థముచే నొక యర్థము వ్యంగ్యమయి దానిమూలమున మఱియొక యర్థము వ్యంగ్యమగుచున్నది. గావున నిది వ్యంగ్యార్థ వ్యంజకమనఁబడును.

## —♦ వాచకస్వరూపము ♦—

"సాక్షాత్తుగా సంకేతగోచరమగు నర్థమును బోధించు శబ్దము వాచక మనఁబడును. ఈశబ్ద మీయర్థమును బోధించు నను నీశ్వరేచ్ఛయే సంకేతము. అనఁగా గోశబ్దమునకు గోవ ర్థము. మనుష్యశబ్దమునకు మనుష్యుఁడర్థమని మొట్టమొదట నీశ్వరుఁడు ఒక్కొక్కశబ్దమున కొక్కొక్క యర్థమునందుఁ గ ల్పించిన సంకల్పమే శక్తి యనఁబడుచున్నది. ఏశబ్దమున కేయర్థ మునందు శక్తిగలదో యాయర్థ మాశబ్దమునకు ముఖ్యమైనది. అట్టి శక్తిసహితమైన శబ్దము సంకేతితార్థమును బోధించుచు నా యర్థమునకు వాచకమనఁబడుచున్నది. సంకేతజ్ఞానము లేనప్పా డు అర్థజ్ఞానము గలుగదు గావున సంకేతజ్ఞానము అర్థజ్ఞానము నకు నిమిత్తమని తాత్పర్యము.

## —♦ వాచ్యార్థ భేదములు. ♦—

ఈసంకేతితార్థము జాతి, గుణ, క్రియా, సంజ్ఞలచే నా లుగు విధములుగఁగాని, జాతిమాత్రముచే నొక్కవిధముగఁ గాని బరఁగుచుండునని ప్రాచీనులు పలుకుదురు. అది యెట్టుల నఁగా! ఆవు, గుఱ్ఱము మొదలగు పదార్థములే యెఱుఁగనివాఁడు 'ఆవునుదెమ్ము' గుఱ్ఱమును దీసికొని పొమ్ము' అని యొక పు రుషుడు మఱియొకనితోఁ జెప్పునప్పుడు అతఁ డావునుఁ దెచ్చు చు గుఱ్ఱమునుఁ దీసికొని పోవుచుండఁగాఁ జూచి 'ఇదియావు' 'ఇది గుఱ్ఱము' అని యానయన నయనములచేఁ దెలిసికొనుచు న్నాఁడు. ఈజ్ఞానము ఆవు, గుఱ్ఱమను వ్యక్తులనుఁ గాంచుట

వలనఁ గలిగినది గావున సంకేతము వ్యక్తియందేగాని జాత్యాదులయందు లేదని కొందఱు వాదింతురుగాని, యొక్కజాతి యందే యనేక వ్యక్తులయం దనేక శక్తుల నంగీకరించుటకంటె నన్నివ్యక్తుల కనుకూలించులాగున సముదాయముగ ఆయాజాతులయందు సంకేతము నంగీకరించుట సుళువు. మఱియు వ్యక్తిశక్తి నంగీకరించుచో గోవు, శుక్లము, చలము, డిత్థుఁడు మొదలగు విభాగమే సంభవించకపోవును. గనుక ఉపాధిశక్తి నంగీకరించుటయే యుక్తము. పదార్థములలో నొండొంటికి స్వరూపభేదమును దెలియఁజేయు ధర్మము ఉపాధియనఁబడును. ఘటము, వస్త్రము, ఆవు, గుఱ్ఱము మొదలగునవి. ఇచ్చట ఘటముయొక్క స్వరూపము వేఱు. వస్త్రముయొక్క స్వరూపము వేఱు. ఈరెంటికిని భేదమును దెలుపునటువంటి ధర్మమొండు ఘటమునందును, వస్త్రమునందును గలదు. ఘటత్వము, వస్త్రత్వమనఁబడున దిదియే.

—♦ ఉపాధిభేదములు ♦—

ఉపాధి, "వస్తుధర్మము, వక్తృయదృచ్ఛాకల్పితము" అని రెండువిధములు. అందు వస్తుధర్మము సిద్ధము సాధ్యమని ద్వివిధము. వానిలో సిద్ధము, "పదార్థప్రాణప్రదము, విశేషాధానహేతు" వని రెండువిధములు. పదార్థప్రాణప్రదమగు సిద్ధవస్తుధర్మమే జాతియనఁబడును.

అనఁగా వ్యక్తిగతమైన ధర్మమే వస్తుధర్మము. అది ఘటత్వ, శుక్లత్వ, చలత్వముల నెడి జాతిగుణక్రియారూపమనియు

పురుషుఁడు తన యిష్టప్రకారము కల్పించిన సంజ్ఞారూపమగు డిత్థత్వ, డవిత్థత్వ, చైత్రత్వ, మైత్రత్వ, యజ్ఞదత్తత్వ, దేవదత్తత్వరూపమైన ధర్మమే వక్తృయదృచ్ఛా కల్పితమనియు, పూర్వాపరావయవ విశిష్టమగు క్రియారూపవస్తుధర్మమే సాధ్యమనియు, జాతిగుణరూపమైన సిద్ధవస్తుధర్మము పదార్థప్రాణప్రదము, విశేషాధానహేతువని రెండువిధములనియు, పదార్థమునకు వ్యవహారయోగ్యతను బుట్టించు జాతి పదార్థప్రాణప్రదమని చెప్పఁబడును. సజాతీయవస్తువులనుండి వ్యావృత్తినిఁ దెల్పుటకుఁ గారణమగుచు శుక్లాది విశేషములచే విశేషింపఁబడు గుణము విశేషాధానహేతువని చెప్పఁబడుచుండుననియు, నెఱుంగవలయును.

జాతి పదార్థ ప్రాణప్రదమనుటకుఁ గ్రిందనిరూపించిన వాక్యపదీయవచనము ప్రమాణము. "నహిగౌః స్వరూపేణ గౌర్నాప్యగౌః గోత్వాభి సంబంధాత్తుగౌః" గోవు ఆకారమాత్రముచేత గోవనికాని, గోవు కాదనికాని చెప్పుట యశక్యము. మఱి గోత్వమను జాతి సంబంధముచే గోవనఁబడును." "గోవు, శుక్లము, చలము, డిత్థుఁ డిత్యాదులయందు నాలుగువిధములయిన ప్రవృత్తులు గలవని" మహాభాష్యకారుఁడగు పతంజలి నుడి. ఇచ్చట ప్రవృత్తిశబ్దమునకుఁ బ్రవృత్తి నిమిత్తమని యర్థము. శబ్దార్థమును బోధించు వ్యాపారవిశేషమే ప్రవృత్తి. ఇట్లు గోవు, శుక్లము, చలము, డిత్థుఁడు మొదలగు శబ్దములయందుఁగల గోత్వాది ప్రవృత్తి నిమిత్త భేదమునుబట్టి శబ్ద

ములు జాతిశబ్దములు, గుణశబ్దములు, క్రియాశబ్దములు, సంజ్ఞాశబ్దములు అని నాలుగువిధములని యభిప్రాయము.

పరమాణువు మొదలగునవి జాతిశబ్దములే యయినను పరమాణ్వాది శబ్దములను గుణశబ్దములమధ్య పఠించుటచే నాశబ్దములయందుఁగల గుణత్వము పారిభాషికమే (పేరునకు మాత్రమే) యని తెలియవలయును.

గుణక్రియాదులు నానావస్తుగతములై భిన్నభిన్నముగా గన్పట్టినను స్వరూపమునుబట్టి యవి యేకరూపములేయని గ్రహించునది. ఒక్కముఖమే ఖడ్గమునందును, అద్దమునందును, తైలమునందును, భిన్నభిన్నముగాఁ బ్రకాశించినను దాని స్వరూపమునకు భేదములేకుండుట యనుభవసాక్షికము. ఇందుచే నానావిధములయిన క్రియాదులయందు వేఱువేఱు శక్తుల నంగీకరింపవలసి వచ్చుననియు, అది భారమనియు భ్రమింపఁగూడదు.

ప్రవృత్తి నిమిత్తభేదమునుబట్టి శబ్దములు జాత్యాదులచే నాలుగు విధములని కొందఱి యభిప్రాయము. మఱికొందఱు అన్నివిధములయిన శబ్దములకును జాతియొక్కటే ప్రవృత్తినిమిత్తమని యభిప్రాయపడుచున్నారు. అది యెట్టులనఁగా, మంచునందును, పాలయందును, శంఖమునందునుగల తెలుపు వేఱని యెల్లరకుఁ దెలియును. అయినను వాని నన్నింటినిఁ దెల్లవి యనియు, వానిలో తెలుపున్నదనియు నొక్కరీతినే వాడుకొనుచున్నాము. ఇట్లు వ్యవహరించుటకు

నిమిత్తమొకటి యవసరము. అది శుక్లత్వమను జాతి తప్ప మఱి యొకటి కాఁజాలదు. ఇవ్విధముననే బెల్లము, బియ్యము మొదలగువానియందును వానిక్రియలు భిన్నభిన్నములుగా నున్నప్పటికిని ఒక్కవిధమైన క్రియావ్యవహారము వానిలోని క్రియాత్వరూపజాతినిబట్టియే గలుగుచున్నది. కాఁబట్టి శబ్దము లర్థములయందుఁ బ్రవర్తించుటకుఁ గారణము జాతి యొక్కటేయని వీరి యభిప్రాయము.

## —♦ అభిధాస్వరూపము ♦—

లోకమునందుఁ గార్యకారణములకు మధ్య నొక వ్యాపార మవసరమైనట్లు శబ్దము లర్థమును బోధించునపుడు బోధనానుకూలమైన వ్యాపారమొకటి యవసరమైయున్నది. దీనినే శక్తియందురు. ఇది యభిధా, లక్షణా, వ్యంజనా భేదములచేత మూఁడు విధములు.

సాక్షాత్సంకేత విషయమగు ముఖ్యార్థమును, వ్యాపారాంతర సహాయములేక బోధించునట్టి శక్తి యభిధ యనఁబడును.

అనఁగా ఈశ్వరుఁడు మొట్టమొదట ఈయాశబ్ద మీయాయర్థమును బోధించునని సంకేతమొనర్చినాఁడనియు, నా సంకేతమే శక్తియనఁబడుననియు ముందే తెల్పితిమి. శబ్దమర్థమును బోధించునపుడు శక్తి వ్యాపారరూపముగా నుండుననియు, వ్యాపారమనఁగా శబ్దమునుండి యర్థజ్ఞానము గలుగుటకు నిమిత్తముగా నుండుట యనియు, సంకేతవిషయమగు ముఖ్యార్థమును బోధించుశక్తి యభిధయనఁబడుచున్నదనియు, అభిధాశక్తి

యర్థమును బోధించుటకు లక్షణాదులకువలె నితర వ్యాపార ముల సహాయ మవసరము లేదనియుఁ దాత్పర్యము.

గోశబ్దము గోరూపార్థమును బోధించుటకుఁ దత్సంకేతము ఇతర వ్యాపార సహాయము లేక తోడ్పడుచు నభిధయనఁబడు చున్నదని యరయ వలయును. ఇట్లే శబ్దములన్నియు తమ తమ ముఖ్యార్థములను బోధించుటకు అభిధావ్యాపారము నిమిత్త మగు చున్నది.

—* లక్షణాస్వరూపము. *—

"శబ్దము యొక్క ముఖ్యార్థమునకు బాధగలిగి, యా ముఖ్యార్థ సంబంధముండి, రూఢిచేఁగాని ప్రయోజనముచేఁ గాని, యితరార్థమెద్దానిచే బోధింపఁబడునో యట్టి యారోపిత శబ్ద వ్యాపారమే లక్షణయనఁబడును."

అనఁగా, ఒకస్థలమునందుఁ బ్రయోగింపఁబడిన శబ్దార్థ మనుకూలముగా లేనప్పుడు పురుషుఁడు ప్రకరణానుకూలమైన వేఱొక యర్థమును గల్పించుకొనును. గాని తన యిచ్ఛవచ్చిన యేయితరార్థమునుగాని కల్పించుకొనఁ గూడదు. ఏ యర్థము నందాశబ్దమునకుఁ బ్రయోగ ప్రసిద్ధిగాని, ప్రయోజనముగాని గలదో యట్టి యర్థమునే కల్పించుకోవలెను. కల్పించుకొను నట్టి యా యర్థమునందు శబ్దమునకు సంకేతము లేకపోవుటచేత ను, వ్యాపారము లేనిది యర్థప్రతీతి గలుగక పోవుటచేతను, యర్థాంతర ప్రతీతి గలుగుటకు వేఱొక వ్యాపార మందుండ

వలెను. అదియే లక్షణ యనఁబడును. ఈ లక్షణా వ్యాపారము ముఖ్యార్థగతమై యుండునుగాని శబ్దగతముగాదు అర్థగతమైన యీ లక్షణావ్యాపారము శబ్దగతమైనట్లు ఆరోపింపఁబడు చున్న దని తాత్పర్యము

ఎట్లులనఁగా, 'కర్మయందుఁ గుశలుఁడ'ను నెడఁ గుశలుఁడను శబ్దమునకు ముఖ్యముగ దర్భను గ్రహించువాఁడని యర్థమగు చుండినను, నా యర్థము ప్రకృతము బాధితమగు చున్నది. అనఁగా నాయర్థ మిందనుపయుక్తమని తాత్పర్యము. ముఖ్యార్థబాధ యనునది యిట్టిదే. మఱి వివేచకత్వరూపమైన ముఖ్యార్థసంబంధమును, వివేచకార్థ విషయమునఁ బ్రయోగ ప్రసిద్ధియు, నుండుటచే బాధితమైన యీ కుశల శబ్దార్థము స్వగతమైన లక్షణావ్యాపారమును గుశల శబ్దమునందారోపించుకొని తద్ద్వారా "వివేచకుఁడ"ను నర్థాంతరమును బోధించు చున్నది.

ఇంక, "గంగయందు ఘోషమున్నద" ను నెడ ముఖ్యముగ గంగాశబ్దమునకుఁ బ్రవాహమనియు, ఘోషశబ్దమునకుఁ జిన్నపల్లెయనియు నర్థము. ప్రవాహమునందుఁ జిన్నగ్రామముండుట యసంభవము గావున గంగాశబ్దార్థము బాధితమగు చున్నది. ముఖ్యార్థమగు ప్రవాహ సంబంధము తీరమునందుఁ గలదు. గంగాతీరమునందు ఘోషమున్నదని చెప్పుటకు వీలుండినను, గంగయందు ఘోషమున్నదని చెప్పుట, గంగయందుఁగల పావనత్వాదులు ఘోషమునందు స్ఫురించుటకొఱకే. కాబట్టి

యుచ్చట ముఖ్యార్థబాధయు, దాని సంబంధమును, పావన త్వాది ప్రయోజనమును, నుండుటచేఁ బ్రవాహరూపార్థగత మైన లక్షణావ్యాపారము శబ్దమునం దారోపింపఁబడినదై పరం పరఁగఁ దీరమను నర్థమును బోధించుచున్నది.

—♦ లక్షణాభేదములు. ♦—

**లక్షణ యుపాదానలక్షణయనియు,** లక్షణ లక్షణయ నియు, రెండువిధములు. తనకు వాక్యార్థమునం దన్వయము సంభవించుటకై వేఱొక యర్థము నాకర్షించుకొనుట యుపా దానము. "కుంతములు ప్రవేశించుచున్నవి" "దండములు నడు చుచున్నవి" ఇత్యాది వాక్యములయందుఁ గుంతములకుఁగాని, దండములకుఁగాని, క్రియాసంబంధము పొసఁగుటలేదు గనుక కుంతములును, దండములును, దమకుఁ గ్రియాన్వయ సిద్ధికొ ఱకు స్వసంబంధి పురుషుల నాక్షేపించుచున్నవి. ఇదియ యు పాదానలక్షణ.

శబ్దమునకు ముఖ్యముగ వాచ్యముగానటువంటి యర్థ మునకు (లక్ష్యార్థమునకు) క్రియాసంబంధము సిద్ధించుటకై శబ్దము తన ముఖ్యార్థమును వదలుకొనుటయే లక్షణలక్షణ. "గంగయందు ఘోషమున్న"దను వాక్యమున గంగాశబ్దమునకు వాచ్యముగానట్టి తీరరూపార్థమునకు ఘోషముతో సంబంధ ము కుదురుటకై గంగాశబ్దము ముఖ్యమగు ప్రవాహరూపార్థ మును వదలుచున్నది.

## మతాంతరము

ఇచ్చట మండన మిశ్రులనువారు గోవు, ఘటము, వస్త్రము, ఇత్యాదులయందు గవాదిపదార్థములు ఉపాదాన లక్షణచే బోధింపఁబడుచున్నవని వాదింతురు. ఏలయనఁగా "విశేష్యం నాభిధాగచ్ఛేత్ క్షీణశక్తి ర్విశేషణే" అభిధావ్యాపారము, గోత్వరూపమైన విశేషణార్థమును బోధించి శక్తిహీనము గుటచే విశేష్యరూపమైన గోపదార్థమును బోధింపఁజాలదను న్యాయముంబట్టి విశేష్యములగు గవాది పదార్థములను బోధించుటకు ఉపాదానలక్షణ నంగీకరింపవలయునని వీరి యభిప్రాయము. కాని యిచ్చట లక్షణనంగీకరించుటకు లక్షణానిమిత్తములగు రూఢిగాని ప్రయోజనముగాని లేకుండుటచే నయ్యది యుక్తముకానిమాట. మఱియు గవాదిపదార్థములు విశేషణవిశేష్యములకుఁగల యవినాభావ సంబంధముచేతనే బోధింపఁబడుచుండఁగా నిందుకై లక్షణ నంగీకరించుట బరువే యగును. ఒకదానిని విడిచి యొకటి యుండలేకపోవుటయే యవినాభావ సంబంధము. విశేషణరూపమైన గోత్వము బోధింపఁబడుచుండఁగానే దానిని విడిచి యుండలేని విశేష్యమైన గోపదార్థము నైతము బోధింపఁబడును గదా?

మఱికొందఱు "పీనో దేవదత్తో దివానభుంక్తే" బలిసిన దేవదత్తుఁడు పగలు భుజింపఁడు అను వాక్యమునందు రాత్రివేళ భుజింపనిది దేవదత్తునికి బలుపు సంభవింపదు గనుక ఈవాక్యము లక్షణావ్యాపారముచేత రాత్రి భోజనమును గల్పించు

చున్నదంగురు. గాని మీమాంసకుల్కు శ్రుతార్థాపత్తి ప్రమాణ
ముచేతఁగాని, యర్థాపత్తిప్రమాణముచేతఁగాని యీ రాత్రిభో
జన రూపార్థము బోధింపఁబడుచున్నది. కాఁబట్టి లక్షణాకల్పన
మనసరము లేదు.

మీమాంసకులలో భాట్టమతమనియు, గురుమతమని
యుఁ గలవు. భాట్టులు ప్రయోగింపఁబడిన శబ్దార్థము అసం
భవియైనప్పుడు శాబ్దబోధము గలుగుటకై 'శ్రుతార్థాపత్తి'
యను ప్రమాణము నంగీకరించిరి. గురుమతము వారిట్టియెడ
అర్థాపత్తిప్రమాణము నొప్పుకొనిరి.

శ్రుతమనఁగా శబ్దము. శబ్దమునుబట్టి శబ్దాంతరకల్పనమే
శ్రుతార్థాపత్తి. అనఁగా నెచ్చటఁ బ్రయోగింపఁబడిన శబ్ద మ
సంభవియై యన్వయము సరిపడుటకు శబ్దాంతరమును గల్పిం
చునో యచట శ్రుతార్థాపత్తి ప్రమాణము. ఒకఁడు "ద్వార"
మని మాత్రము చెప్పఁగా నన్వయము సంభవించక పోవుట
చేత నాశబ్దము "మూయు" మను శబ్దాంతరమును గల్పించును.
"ద్వారమును మూయు" మని యేర్పడుటచే నన్వయబోధము
సంగతమగునని భాట్టుల యభిప్రాయము.

అర్థమునుబట్టి యర్థాంతరమును గల్పించుట యర్థాపత్తి.
అనఁగాఁ బ్రయుక్త శబ్దార్థమున కన్వయబోధము కుదురనప్పు
డు తదర్థ మర్థాంతరమును గల్పించుకొనుట యర్థాపత్తి ప్రమా
ణము. 'ద్వార' మను నెడ ద్వారరూపార్థము తనకన్వయబోధ
ము సంభవించుటకై మూయుమను నర్థాంతరమును గల్పించు
చున్నది. ద్వారము మొదలగు శబ్దములనుబట్టి శబ్దాంతరము

లను గల్పించుకొని యర్థము నరయుటకంటె శబ్దమును విన
గానే యర్థమునుబట్టి సంగతమగు నర్థాంతరమును గల్పించుకొ
నుట సులభమని గురుమతమువారి యాశయము.

ఎట్లయినను "బలిసిన దేవదత్తుఁడు పగలు భుజింపఁడు."
ఇది మొదలగు వాక్యములయందు శ్రుతార్థాపత్తి ప్రమాణ
మో, యర్థాపత్తిప్రమాణమో సరిపోవునట్టి యర్థజ్ఞానమును
గలిగించుచుండఁగా లక్షణాకల్పన మనవసరమని నిష్కర్షము.

మఱియు లక్షణశుద్ధ, గౌణి యని రెండువిధములు.
అందు ఉపచార శూన్యమగునది శుద్ధలక్షణ. ఉపచారయుక్త
మగునది గౌణీలక్షణ. మున్నుపపాదింపఁబడిన యుపాదాన
లక్షణయు, లక్షణలక్షణయు, ఉపచారశూన్యములగుటచే
శుద్ధలక్షణ లనఁబడును. సాదృశ్యరూప సంబంధముచేఁ బ్రవర్తిం
చుటయే యుపచారము. ఎచ్చట విషయమును, విషయియు,
శబ్దోపాత్తములగునో యందు సారోపలక్షణ యని గ్రహించు
నది. ఆరోపమున కాశ్రియమగు పదార్థము విషయము. ఆరో
ప్యమాణమగు పదార్థము విషయి. భిన్నార్థకములగు శబ్దము
లకు సప్రయోజనమైన సామానాధికరణ్య ప్రయోగము
ఆరోపము. అనఁగా వేఱువేఱర్థములుగల శబ్దములను నేదో
యొక ప్రయోజనమునుబట్టి యొక్కచోట విశేషణ విశేష్య
రూపమునఁ బ్రయోగించుట యని యర్థము. "వాహీకుఁడు
గోవు" "ముఖము చంద్రుఁడు" మొదలగు వాక్యములయందు
వాహీకునకును, గోవునకును, ముఖమునకును, జంద్రునకును,

బరస్పరభేదము స్పష్టమైనను, వాహీకునియందు గోవునందలి జాడ్యాది ధర్మములుండుటంబట్టియు, ముఖమునందుఁ జంద్రుని యందలి యానంద జనకత్వముండుటంబట్టియు, నిట్లు విశేషణ విశేష్య రూపమునఁ బ్రయోగింపఁబడు చున్నవి. వాహీకుని యందు గోత్వమును, ముఖమునందుఁ జంద్రత్వమును, ఆరోపింపఁబడుచున్నవని తాత్పర్యము.

ఎచ్చట విషయి మాత్రము శబ్దోపాత్తమయి విషయము ఆర్థికముగ విషయి మాత్రముచే గ్రాహ్యమగుచున్నదో యందు సాధ్యవసాన లక్షణ యనఁబడును.

ఇంతకు శబ్దోపాత్తములయిన విషయ విషయులకుఁగల యభేదజ్ఞాన మారోపమనియు, శబ్దోపాత్తమగు విషయి మాత్రముచే గ్రాహ్యమగు విషయజ్ఞాన మధ్యవసాయమనియుఁ దేలుచున్నది.

సాదృశ్యసంబంధముచేఁ బ్రవర్తించునవి గౌణీలక్షణలనియు, నితరసంబంధముచేఁ బ్రవర్తించునవి శుద్ధలక్షణలనియు వ్యవహారము. "గోవు పఠించుచున్నది." "గోవునుఁ జదివించుము." అను వాక్యములు సాధ్యవసానలక్షణ కుదాహరణములు. ఇందు గోసదృశుఁడగు పురుషుఁడు వాచక శబ్దముచే గ్రహింపఁబడక గోశబ్దముచే మాత్రము బోధింపఁబడు చుండుటచే నిది సాధ్యవసాన లక్షణయగుచున్నది. ఇట్లే యంతట నూహించుకొనునది.

ఇట్లు లక్షణశుద్ధ, గౌణి, యని సామాన్యముగా రెండు విధములు. అందు శుద్ధ, ఉపాదానలక్షణ, లక్షణ లక్షణ, సారోపలక్షణ, సాధ్యవసానలక్షణ యని నాలుగువిధములు. గౌణి, సారోపగౌణి, సాధ్యవసానగౌణి యని రెండు విధములు. చేరి మొత్తము లక్షణ యాఱు విధములగుచున్నది.

మఱియు లక్షణసామాన్యముగ వ్యంగ్యార్థసహితము, వ్యంగ్యార్థరహితమని రెండు విధములు. అందు వ్యంగ్యార్థము గూఢము, అగూఢమని రెండు విధములు. గంగయందు ఘోషమను ప్రయోజనలక్షణ వ్యంగ్యార్థసహితమనియు, రూఢి లక్షణ [కర్మయందుఁ గుశలుఁడు] వ్యంగ్యార్థరహితమనియు గ్రహించునది.

—♦ గూఢవ్యంగ్యము ♦—

"ముఖం వికసితస్మితం వశితవక్రిమప్రేక్షితం
సముచ్ఛలిత విభ్రమాగతి రపాస్త సంస్థామతిః।
ఉరో ముకులిత స్తనం జఘనమంసబంధోద్ధురం
బతేందు వదనాతనౌ తరుణిమోద్గమో మోదతే॥"

తా॥ యువతినిఁ గాంచిన యొక యువకుని పలుకు. ఇందువదనయగు తరుణీశరీరంబున యౌవన ముదయించి యుత్కృష్ట వస్తుసంబంధముచే మిక్కిలి యుత్కర్షము నొందుచున్నది. ఏమి యీయిందుముఖి తారుణ్యాతిశయము! ముఖము వికసించిన చిఱునగవుగలదై, దృష్టి వాలుచూపులుగలదై, నడక హావభావాది విలాసములుగలదై, మతి నానావిషయ

సంచారిణియై, వక్షఃస్థలము ముకుళించిన స్తనములుగలదై. యూరు మూలముగట్టి బిగువుగలదగుటచే విలక్షణ రతియో గ్యమై యొప్పుచున్నది.

ఇచ్చటఁ బుష్పధర్మమగు వికాసము నగవునందును, చేతన ధర్మమగు వశీకరణము చూపునందును, మూర్తద్రవ్య ధర్మమగు సముచ్చలనము విభ్రమమందును, మర్యాదాత్యాగ రూపమైన చేతనధర్మము మతియందును, పుష్పధర్మమగు ముకుళితత్వము స్తనములయందును, చేతనధర్మమగు నుద్ధుర త్వము జఘనమునందును, చేతనధర్మమగు మోదము యౌవ నోద్గమమునందును, బాధితములగుటచేత లక్షణామూలమున వికసితపదము వ్యాప్తిరూపార్థమును, వశితపదము స్వాధీనీకరణ రూపార్థమును, సముచ్చలితపదము పాదుర్భవరూపార్థమును, అపాస్త సంస్థాపదము అనేక విషయ సంచారరూపార్థమును, ముకుళితపదము ఉన్నతిరూపార్థమును, ఉద్ధురపదము విలక్షణ రతియోగ్య రూపార్థమును బోధించుచున్నవి. ఈలక్షణకు సౌర భము, యుక్తానురాగిత్వము, సకలమనోహారిత్వము మొదల గునవి వ్యంగ్యములు. ఈవ్యంగ్యములు సహృదయులకుఁ దక్క సామాన్యజనులకు గోచరింపకుండుటంబట్టి గూఢమనఁబడు చు న్నవి. కావున నీకావ్యము లక్షణామూలక గూఢవ్యంగ్య మని పించుకొనుచున్నది.

—♦ అగూఢవ్యంగ్యము ♦—

"శ్రీపరిచయాజ్జడా అపి భవంత్యభిజ్ఞా విదగ్ధచరితానామ్।
ఉపదిశతి కామినీనాం యౌవన మద ఏవ లలితాని॥"

తా॥ జడులును (అజ్ఞానులు) లక్ష్మీసంబంధమువలన విదగ్ధచరిత్రములు తెలిసిన వారగుచున్నారు. యువతులకు యౌవన మదమేగదా లలితములను [అంగములయొక్క సుకుమారాకార విన్యాసములను] ఉపదేశించుచున్నది.

ఇచ్చటఁ జేతన ధర్మమగు నుపదేశమచేతనమగు మదమునందు బాధితమగుటచే "ఆవిష్కరించుచున్నద"ను నర్థము ను లక్షణచే బోధించుచున్నది. ఈ లక్షణకు లలిత జ్ఞానము సులభముగాఁ గలుగుచున్నదను నర్థము వ్యంగ్యమగుచున్నది. ఈ యర్థము సహృదయులకేకాక సామాన్యులకుఁ గూడ గోచరించుటంజేసి యగూఢవ్యంగ్యమగు కావ్యమనఁ బడుచున్నది.

మొత్తమునకు లక్షణ చువ్యంగ్యము, గూఢవ్యంగ్యము అగూఢవ్యంగ్యమని మూఁడువిధములగుచున్నది. లక్షణకాశ్రయమగు శబ్దమే లాక్షణికము.

అభిధాలక్షణావ్యాపారములను నిరూపించిన యనంతరము వ్యంజనావ్యాపారము నిరూపింపఁబడుచున్నది.

"తత్రవ్యాపారో వ్యంజనాత్మకః"

తత్ర=లక్షణాప్రయోజనమునందు, వ్యాపారః=బోధనానిమిత్తముగ నాశ్రయించు నటువంటిశక్తి, వ్యంజనాత్మకః=వ్యంజనారూపమైనది.

అనఁగా లక్షణాస్థలమునందు లక్షణా ప్రవృత్తినిమిత్తమగు ప్రయోజనము ఏ వ్యాపారముచేత బోధింపఁబడుచున్నదో యావ్యాపారము వ్యంజనయనఁబడునని యభిప్రాయము. "గంగయందు ఘోషమను" నప్పుడు గంగాశబ్దము లక్షణచేఁ దీరమును బోధించునుగాని, లక్షణాప్రయోజన భూతములగు పావనత్వాదులను అభిధచేఁగాని, లక్షణచేఁగాని బోధింపఁజాలదు. వ్యాపారములేనిది యర్థప్రతీతి గలుగదు. గావున నీపావనత్వాది ప్రతీతికై యొక వ్యాపారముండవలయును. అదియే వ్యంజన మనఁబడును. ఈయర్థమే క్రిందికారికయందు వివరింపఁబడియున్నది.

"యస్య ప్రతీతి మాధాతుం లక్షణా సముపాస్యతే,
ఫలే శబ్దైక గమ్యేఽత్ర వ్యంజనాన్నాపరా క్రియా॥"

తా॥ ఏఫలమును దెలియఁజేయుటకై లక్షణనాశ్రయింతురో యాఫలమునుగూడ నాశబ్దమే బోధించుచున్నది గాని యాఫలమును బోధించుటకు నిమిత్తము వ్యంజనావ్యాపారము తప్ప మఱియెయ్యదియుఁ గాఁజాలదు.

ఇచ్చట అభిధగాని, లక్షణగాని, ప్రయోజనమునేల బోధింపఁ జాలదని ప్రశ్నయుదయించవచ్చును, గాని పావనత్వాది ప్రయోజనమునందు గంగాశబ్దమునకుఁ దీరమునందు లక్షణను జెప్పుటకు ప్రవాహరూపమగు ముఖ్యార్థమునకు బాధగలిగినట్లు, పావనత్వాదులను లక్షణచే బోధించుటకు

నట్టి ముఖ్యార్థబాధము, తత్సంబంధము, రూఢిలేక ప్రయోజనము ననులక్షణానిమిత్తము లెవ్వియు లేకుండుటచేతను, నవి యిం దు సరిపడవు. ఎట్లనఁగా గంగాశబ్దము ప్రవాహమునందు సంకేతితముగాని పావనత్వాదులయందుఁ గాదు. మఱి గంగాశబ్దము నకుఁ దీరము లక్ష్యముగాని ముఖ్యముగాదు. తీరమే ముఖ్యార్థ ము కానప్పుడు ముఖ్యార్థసంబంధము పావనత్వాదులయందె క్కడిది? పావనత్వాది ప్రయోజనము లక్ష్యమగునేని లక్షణా నిమిత్తమగు ప్రయోజనాంతరమేది? ఇట్లు ప్రయోజనముపైఁ బ్రయోజనమును గల్పింపనారంభించిన నెక్కడికి ముగింపు. అనవస్థాప్రసంగము సంభవించునుగదా? కావునఁ బ్రయోజన ప్రతీతికి అభిధాలక్షణలు సమర్థములు కాఁజాలవు.

తుదకుఁ బావనత్వాది ప్రయోజనప్రతీతి యవసరమ గుటచే నందు కభిధాలక్షణావ్యాపారము లసమర్థములగుటం బట్టి వ్యాపారాంతరము నొకదానిని దప్పక యంగీకరింపవలసి యున్నది. దానినే వ్యంజనము, ధ్వననము, ద్యోతనము అని చెప్పుదుమని తాత్పర్యము.

ఇట్లు తప్పని సరిగ నేర్పడిన యీవ్యంజనా వ్యాపార ము శబ్దగతము, అర్థగతము, అని రెండువిధములు. అందర్థగత ము మూఁడవయుల్లాసమున నిరూపింపఁ బడును. శబ్దగతము అభిధామూలము, లక్షణామూలము నని రెండు విధములు. "గంగయందు ఘోష" మిత్యాదులయందు నిరూపింపఁబడిన వ్యంజనము లక్షణామూలము.

## —♦ అభిధామూల వ్యంజనము ♦—

"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే,
సంయోగాద్యైరవాచ్యార్థ ధీకృద్వ్యాపృతి రంజనమ్॥"

తా॥ నానార్థకమగు శబ్దము ఒక యర్థమును బోధించి యర్థాంతరమును బోధింప శక్తిహీనముకాఁగా దానియందుఁగల యితరార్థమును బోధించు వ్యాపారమే యభిధామూల వ్యంజనమనఁబడును. అనఁగా అనేకార్థములుగల శబ్దము అభిధాశక్తిచేత మొదట నొక యర్థమును బోధించును. తరువాత నదేశక్తిచేత మఱియొక యర్థమును బోధింపఁజాలదు. సంయోగాదులచేతఁ గట్టివేయఁబడుటచే నభిధాశక్తి మఱియొక యర్థమునందుఁ బ్రవర్తింపదు. అనేకార్థక శబ్దములు ప్రయుక్తమైనప్పుడు సంయోగాదు లర్థవిశేషనిర్ణాయకము లగుచున్నవి.

## —♦ సంయోగాదులు ♦—

"సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా,
అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః
సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
శబ్దార్థ స్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః॥"

తా॥ అనేకార్థక శబ్దముల యర్థనిశ్చయము సందిగ్ధమైనప్పుడు సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధిత, అర్థము, ప్రకరణము, లింగము, అన్యశబ్దసన్నిధి, సామర్థ్యము, ఔచితి, దేశము, కాలము, వ్యక్తి స్వరాదులును, అవ

సరమైన అర్థవిశేషమును నిశ్చయించుటకుఁ గారణము లగు చున్నవి.

శబ్దార్థములకుఁగల ప్రసిద్ధసంబంధము, సంయోగము. అది లేకుండుట విప్రయోగము. ఒక్క దేశకాలములయందుం డుట సాహచర్యము. అది లేకుండుట విరోధిత. అర్థము, ఫల ము. ప్రకరణము, సందర్భము. లింగము, పరపక్షమునందు లేని ధర్మము. అసమస్తమగు సమానార్థక శబ్దముతోఁ గూడియుండు ట యన్యశబ్దసన్నిధి. సామర్థ్యము, నిమిత్తత్వము. ఔచితి, యో గ్యత. దేశవిశేషము, కాలవిశేషము, వ్యక్తి, స్త్రీ, పుంనపుం సకరూపమగు లింగము. స్వరాదులు, ఉదాత్తానుదాత్త స్వ రితస్వరములు మొదలగునవి.

"సశంఖచక్రుఁడు హరి" "అశంఖచక్రుఁడు హరి" అను నెడ హరిశబ్దము "యమానిలేంద్ర చంద్రార్క విష్ణుసింహాంశు వాజిషు, శుకాహికపిభేకేషు హరిర్నా కపిలేత్రిషు" అను నిఘంటువునుబట్టి నానార్థకమైనను, శంఖచక్రముల సంయో గ వియోగములనుబట్టి విష్ణువునే బోధించుచున్నది. "రామల క్ష్మణులు వచ్చుచున్నారు." అను స్థలమున రామశబ్దము "రామః పశువిశేషేస్యాత్ జామదగ్న్యే హలాయుధే, రాఘ వే చాసితే శ్వేతే మనోజ్ఞేఽపిచవాచ్యవత్॥ అను విశ్వకోశ మువలన నానార్థకమయినను, లక్ష్మణసాహచర్యముచేత దశ రథపుత్రుఁడగు రామునినే బోధించుచున్నది. "వారిగతి రా మార్జునులవలె నున్నది" అను నెడ రామశబ్దము విరోధమునం

బట్టి కార్తవీర్యార్జునుని విరోధియగు పరశురాముని బోధించును. ఇట్టివిధముగనే భవచ్ఛేదకుఁడగు స్థాణువును భజింపుము. 'దేవుఁడన్నియు నెఱుంగును.' 'మకరధ్వజుఁడు కోపించియున్నాఁడు.' 'పురారాతియగు దేవుఁడు.' 'మధువుచేఁ గోకిలము మదించినది.' 'నిన్ను దయితాముఖము రక్షించుఁగాక' ఇత్యాది వాక్యములయందుఁ గ్రమముగా స్థాణుశబ్దము సంసారధ్వంసరూప ఫలాంశమునుబట్టి యీశ్వరుని, దేవశబ్దము ప్రకరణమునుబట్టి రాజును, మకరధ్వజ శబ్దము కుపితత్వరూపలింగమునుబట్టి కాముని, దేవశబ్దము పురారాతిశబ్ద సాన్నిధ్యముచేత శంభువును, మధుశబ్దము కోకిల మాదన సామర్థ్యమును బట్టి వసంత ఋతువును, ముఖశబ్దము, ఔచిత్యమునుబట్టి సాంముఖ్యమును, బోధించుచున్నవి. ఇట్లే పరమేశ్వరుఁ డిచ్చటఁ బ్రకాశించును. "చిత్రభానువు వెలుఁగుచున్నాఁడు." "మిత్రము ప్రకాశించును." "మిత్రుఁడు ప్రకాశించును." మొదలగు వాక్యములు దేశకాలవ్యక్తుల కుదాహరణములగుట నూహించునది. ఈశబ్దములన్నియు నానార్థకములగుట, విశ్వకోశాది నానార్థక నిఘంటువులయందు స్పష్టము. విస్తరభీతిచేఁ బ్రతిపదమునకు నిఘంటువు చూపఁబడదయ్యె. స్వరమున కుదాహరణము కావ్యములయందు లేదు. కారికయందలి యాది పదముచే నభినయాదులుగూడ అర్థవిశేషమును బోధించునని యరయవలయును. "ఇంతేసి కన్నులు" "ఇంతింత స్తనములు" ఇత్యాదులయందు వీనికుదాహరణము నూహించునది.

ఇట్లు సంయోగాదులు శబ్దార్థమును నిశ్చయించి దాని యందభిధాశక్తిని గట్టివేయఁగా నర్థాంతరప్రతీతి మఱియొక వ్యాపారముచేఁ గలుగుచున్నది. ఇదియే వ్యంజనము. ఈవ్యాపారమభిధయే యనరాదు. అయ్యది సంయోగాదులచే నియంత్రింపఁబడుచున్నదని చెప్పఁబడియె. ముఖ్యార్థబాధాది లక్షణానిమిత్తత్రయమునం దొకటిగాని లేమింజేసి యిందు లక్షణావ్యాపారముచే నర్థాంతరము బోధింపఁబడుచున్నదని చెప్పఁజాలము. కావున నిందలి యర్థాంతర ప్రతీతినిఁ గలిగించునది వ్యంజనావ్యాపారమని యొప్పుకొనక తప్పదు. ఈవ్యంజనావ్యాపారము అభిధాశక్తి మూలమునఁ బ్రవర్తించినదగుటచే నభిధామూలక మనఁబడుచున్నది.

"భద్రాత్మనో దురధిరోహ తనోర్విశాల
వంశోన్నతేః కృతశిలీముఖ సంగ్రహస్య।
యస్యానుపప్లుతగతేః పరవారణస్య
దానాంబుసేక సుభగః సతతం కరోఽభూత్."

తా॥ ఇది యొక రాజవర్ణనపరమైన పద్యము. ఇందు విశేషణములు మొదలగునవి యభిధావ్యాపారముచే రాజసంబంధియగు నర్థమును బోధించి ప్రకరణ నియంత్రితము కాఁగాఁ బిమ్మట వ్యంజనావ్యాపారముచే భద్రగజపరమైన యర్థమును బోధించుచున్నవి. ఏరాజు శోభనమగు స్వరూపము లేక యంతఃకరణము గలవాఁడును, శత్రువులచేఁ దిరస్కరించఁబడ లేని

శరీరము గలవాఁడును, గొప్పవంశమునఁ బుట్టి విఖ్యాతిఁ జెందిన
వాఁడును, బాణములయందు దృఢమైన యభ్యాసముగలవాఁ
డును, ఎదురులేని నిశ్చయమైన జ్ఞానము గలవాఁడును, శత్రు
వుల నశింపఁజేయువాఁడును నగునో యారాజు చేయి దాన
జలముల తడుపుచే మనోహరమగునది యాయెను. అని రాజు
పరమైన యర్థము.

ఏ గజము భద్రజాతియందుఁ బుట్టినదియు, మిక్కిలి
యున్నతమగుటచే సులభముగ నెక్కుటకు వీలుగాని శరీరము
గలదియు, విస్తారమైన యెదురువలెఁ బొడవైనదియు, కుంభ
స్థలములోని మదము వాసనకుఁ దుమ్మెదలను లాగునదియు,
గంభీరమైన నడకగలదియు, శ్రేష్ఠమైనదియు నగునో యాగజ
ముయొక్క తుండము ఎల్లప్పుడు మదజలముల స్రావముచేత
మనోహరముగ నాయెను. అని భద్రగజపరమైన యర్థము.

ఇచ్చటఁ బ్రకృతుఁడగు రాజు వాచ్యుఁడు. అప్రకృత
మగు గజము ప్రతీయమానము. విశేషణములన్నియు నానార్థ
కములైనను బ్రకరణవశముచేత రాజపరమైన యర్థమును బో
ధించి విరమింపఁగా సహృదయులకుఁ గావ్యవాసనా బలము
వలన గజపరమైన యర్థము గోచరించుచున్నది. ఈయర్థమును
వ్యంజనావ్యాపారము తప్ప మఱియొకటి బోధింపఁజాలదని
నిరూపింపఁబడియె.

ఇట్లు "భద్రాత్మన" ఇత్యాది ప్రకృతాప్రకృతార్థము
లు స్ఫురించు స్థలములయందు అప్రకృతార్థము వ్యంజనా వ్యా

పారవిషయమగునేని అభిధామూలవ్యంజనమునకును, శ్లేషా లంకారమునకును భేదమేమి? అని యడుగుచో ఎచ్చట నా నార్థకములగు శబ్దములుండి నానార్థములయం దేకకాలముననే వక్తకుఁ దాత్పర్యమును, ప్రకరణాదులును, ప్రవర్తించునో, మఱి యెచ్చటఁ బ్రవర్తింపవో, యచ్చట శ్లేషాలంకారము. ఎచ్చటఁ బ్రకృతార్థము ప్రకరణాదులచే స్ఫురించి యనంతరము క్రమ ముగా నప్రకృతార్థము సహృదయులకు గోచరించునో యందు వ్యంజనయని గ్రహించునది. ఇట్లు వ్యంజనావ్యాపారమున కా శ్రయమగు శబ్దము వ్యంజకమని వ్యవహరింపఁ బడుచున్నది.

"భద్రాత్మన" యను పద్యమునందు శబ్దముమాత్రము వ్యంజకమా? శబ్దార్థములునా? శబ్దము మాత్రము వ్యంజక మందుమేని ఇది ధ్వనికావ్యమెట్లగును? ఎచ్చట శబ్దార్థము లప్ర ధానములై యితరార్థమును వ్యంజనావ్యాపారముచే బోధించు నో యది గదా ధ్వనికావ్యము. కాఁబట్టి పై పద్యమున శబ్దార్థ ములు వ్యంజకము లనవలసియుండఁగా శబ్దమే వ్యంజకమనుట యెట్లు అని ప్రశ్నించుపక్షమున నెచ్చట శబ్దము ప్రధానముగ వ్యంజకమై యర్థము సహకారిగా నుండునో యచ్చట శబ్దము వ్యంజకమనియు, నెచ్చట నర్థము ప్రధానముగ వ్యంజకమై శబ్దము సహకారిగా నుండునో యచ్చట అర్థము వ్యంజక మనియు, వివక్షితమును గ్రహింపవలయును. "ప్రాధాన్యేన వ్యపదేశాభవంతి" వ్యవహారములు ప్రాధాన్యమునుబట్టి కలుగుచున్నవను న్యాయ మిందుకు నిమిత్తము. పై పద్యము

నందు శబ్దము ప్రధానముగాను, అర్థము సహకారిగాను, వ్యం జకములగుటంబట్టి, శబ్దమునకు వ్యంజకత్వమును, ధ్వని కభిధా మూలత్వమును, నీకావ్యమునకు ధ్వని వ్యవహారమును, సంగ తములగుచున్నవని యభిప్రాయము.

—♦ గ ద్య. ♦—

ఇది శ్రీనిజామదేశీయ మహబూబునగర మండలాంతర్గత పెద్ద మందడి గ్రామవాసి భారద్వాజగోత్ర పవిత్ర కాండూరువంశ పయఃపారావార రాకాసుధాకర చింతకుంట రాఘవా చార్య ద్వితీయతనూజ, శ్రీపదపురవాస్తవ్య మహా మహోపాధ్యాయ శ్రీమాన్, కపిస్థలాభిజన, దేశికా చార్యాది గురువర ప్రసాదలబ్ధ సాహిత్యప్రబోధ సాహిత్యశిరోమణి రి ఉభయభాషాప్రవీణ పట్టసమంచిత, కడపమండల స్థానిక విద్యా శాఖాంధ్రపండిత, కాండూరు నరసింహా చార్య వివృతంబైన కావ్యప్రకాశం బునందు ద్వితీ యో ల్లా స ము సంపూర్ణము.

# కావ్యప్రకాశవివరణము.

## ప్రథమభాగము.



## —♦ తృతీయోల్లాసము. ♦—



ద్వితీయోల్లాసంబునఁ ద్రివిధములైన శబ్దములును, వాని యర్థములును, అర్థప్రవృత్తి నిమిత్తములును, ఉపాధిస్వరూపమును, అభిధాలక్షణా వ్యంజనాభేదములును, లక్షణాభేదములును, అభిధామూలక వ్యంజనాస్వరూపమును సవిమర్శముగ నిరూపింపఁబడియె. ప్రకృతము తృతీయోల్లాసంబున అర్థగతమైన వ్యంజనావ్యాపార స్వరూపమును వాని యుదాహరణములును నిరూపింపఁబడుచున్నవి.

వాచ్య, లక్ష్య, వ్యంగ్య భేదముచే మున్ను నిరూపింపఁబడిన యర్థముల కిప్పుడు వ్యంజకత్వము నిరూపింపఁబడుచున్నది. అనఁగా శబ్దగత వ్యంజనా నిరూపణానంతర మర్థగత వ్యంజన నిరూపింపఁబడు చున్నదని యభిప్రాయము.

### —♦ అర్థగత వ్యంగ్యార్థము బోధించు నిమిత్తములు. ♦—

"వక్తృబోద్ధవ్య కాకూనాం వాక్యవాచ్యాన్య సన్నిధేః।
ప్రస్తావదేశకాలాదే ర్వైశిష్ట్యాత్ప్రతిభాజుషామ్।
యోఽర్థస్యాన్యార్థధీహేతు ర్వ్యాపారో వ్యక్తిరేవసా."

తా॥ వ క్తృబోద్ధవ్యాది సంబంధ విశేషమువలన ఒక యర్థము మఱియొక యర్థమును బోధించుటకేది నిమిత్తమో యది వ్యంజనా వ్యాపారమే. అనఁగా వాచ్యార్థము నిరుక్త సంబంధ విశేషమునుబట్టి స్వగత వ్యంజనా వ్యాపారముచేతనే యర్థాంతరమును బోధించునని యభిప్రాయము. ఎవని వారర్థ మరయుటకు వాక్యముచ్చరించువాఁడు వక్త. వాక్యార్థమును గ్రహించువాఁడు బోద్ధవ్యుఁడు. వాక్యమునందు విశేషార్థబోధకమగు స్వరవిశేషము కాకువు. సాకాంక్షములయిన సుప్తిఙ్ పదముల సమూహము వాక్యము. సంకేతగోచరమగు నర్థము వాచ్యము. వక్త, బోద్ధవ్యుఁడు మొదలగువారికంటె నితరుల సామీప్య మన్యసన్నిధి. ప్రకరణము ప్రస్తావము. దేశవిశేషము, కాల విశేషము. అన్నియుఁ గ్రమముగా నుదాహరింపఁబడుచున్నవి.

—♦ వక్తృవైశిష్ట్యము ♦—

"అతిపృథులం జలకుంభం గృహీత్వా సమాగతాస్మి సఖి త్వరితమ్। శ్రమస్వేద సలిల నిః శ్వాస నిఃసహా విశ్రామ్యామి క్షణమ్॥"    ప్రా॥ ఛా॥

తా॥ నీరుఁదెచ్చు మార్గమున నదీతీరమునందలి తరుకుంజమున నొక పడఁతి యుపనాయకునితో రమించి రాఁగా, సంభోగ చిహ్నములంగని సంశయపడుచున్న సఖికిట్లనియె. ఓచెలీ! మిక్కిలి గొప్పకడవను మోసికొని త్వరఁగా వచ్చితి. శ్రమ వలనఁ జెమటయు, గసయుఁ బుట్టుచున్నవి. కాఁబట్టి కొంచెము విశ్రమించెదను.

ఇచ్చట నితరకారణములచే వ్యభిచారిణి యని యెఱుంగఁబడిన కామిని యిప్పుడు తన దొంగ సురతమును దాఁచుచున్నదని సహృదయులకు కామినీవాక్య సంబంధమునుబట్టి తెలియుచున్నది. అనఁగా శబ్దగతమైన యభిధావ్యాపారము. "యువతి గొప్పకడవను మోయుటచే శ్రమఁజెంది చెమటవెట్టి గస వెట్టుచు విశ్రమించెద" ననుచున్నదని బోధించి విరమింపఁగా అర్థగతమైన వ్యంజనావ్యాపారము చెప్పినటువంటి కామినీ వాక్యసంబంధ విశేషమునుబట్టి "ఈకామిని దొంగసురతమును దాఁచుచున్న" దను వ్యంగ్యార్థమును బోధించుచున్నదని తాత్పర్యము. ఇట్లే యన్ని యుదాహరణములయందు వివరణ మెఱుంగునది.

## —♦ బోద్ధవ్యవైశిష్ట్యము. ♦—

"ఔన్నిద్ర్యం దౌర్బల్యం చింతాలసత్వంసనిః శ్వసితమ్।
మమ మందభాగిన్యాః కృతే సఖిత్వామపి అహహాపరిభవతి"

ప్రా॥ ఛా।

తా॥ తన నాయకునితో రమించి వచ్చిన దూతికను గాంచి సంభోగచిహ్నములను గుర్తెఱింగిన నాయిక యిట్లనుచున్నది. ఓచెలీ! నిట్టూర్పును, నిద్రలేకుండుటయు, బలహీనతయు, చింతవలని జబ్బును, నిర్భాగ్యురాలనగు నానిమిత్తమున నిన్నుఁగూడఁ బీడించుచున్నవి. అకటా! యిది యెంత వింత.

ఇచ్చటఁ గామినీ వాక్యార్థమును గ్రహించునది దూతిక. గనుక బోద్ధవ్య యనఁబడుచున్నది. నాయికా వాక్యార్థమునకు

ర్ధవ్య దూతిక యగుటచే తత్సంబంధవిశేషమునుబట్టి సహృదయులకు నాయిక దూతీసంభోగమును సూచించుచున్నదని వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది.

—♦ కాకుస్వర వైశిష్ట్యము ♦—

"తథా భూతాం దృష్ట్వా నృపసదసి పాంచాల తనయాం,
వనే వ్యాధైః సార్థం సుచిరముషితం వల్కలధరైః।
విరాట స్యావాసే స్థితమనుచితారంభ నిభృతం
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు."

తా॥ వేణీసంహార నాటకమునందుఁ బ్రథమాంకమునఁ గౌరవులను నిగ్రహింపఁ బ్రయత్నింపని యుధిష్ఠిరుని నిందించు భీమసేనునిఁగూర్చి సహదేవుఁడు ఆర్యా! అన్నయ్య యొకవేళ దుఃఖించునేమో యని వచింప భీముఁడు "అన్నయ్యకు దుఃఖముగూడఁ దెలియునా?" యని మొదలిడి యిట్లు పలుకుచున్నాఁడు. అలనాఁడు రాజసభయందుఁ బాంచాలతనయ నవ్విధిఁగాంచి, యరణ్యమున నారచీరలు ధరించి వ్యాధులతోఁ జిరకాలము వసించి, విరాటుని మందిరమున ననుచితరీతిని రహస్యముగానుండి, దుఃఖించుచున్న నావిషయమున యన్నయ్య దుఃఖించునా? ఇప్పుడును కౌరవుల విషయమున కాదా?

ఇచ్చట "ఇప్పటికిని కౌరవుల విషయమునఁగాదా" యనునప్పుడు తోఁచునటువంటి కాకుస్వర విశేషసంబంధమునుబట్టి గురువగు యుధిష్ఠిరునకు నావిషయమున దుఃఖ మసంగతము; మఱి కౌరవుల విషయమున నది యుక్తమను వ్యంగ్యార్థము

సహృదయులకుఁ బ్రకాశించుచున్నది. ఇది వాచ్య సిద్ధ్యంగ గుణీభూత వ్యంగ్యమున కుదాహరణమని కొందఱందురుగాని యది పొరపాటు. ఇచ్చటఁ బ్రశ్నమాత్ర విశ్రాంతమైన కాకు స్వరముచే వాచ్యార్థము సిద్ధించిన పిదప వ్యంగ్యార్థము ప్రతీత మగుచున్నదిగాని, వ్యంగ్యార్థము స్ఫురించిన పిదప వాచ్యార్థము సిద్ధించుటలేదు.

## —◆ వాక్య వైశిష్ట్యము. ◆—

"తదా మమ గండస్థల నిమగ్నాం దృష్టిం నానైషీరన్యత్ర
ఇదానీం సైవాహం తౌచ కపోలౌ న సా దృష్టిః."

తా॥ నాయికాభీతుండై ప్రియతమ నాయికను సాక్షాత్తుగఁ జూడనోల్లక నాయికా కపోల ప్రతిబింబమునుఁ గాంచి సంతసించుచుఁ బ్రతిబింబము తొలఁగిన పిదపఁ జూపును మరలించిన నాయకునిఁ గనుఁగొని యతని వికారమైన చూపులచే నతని రహస్యము నెఱింగినదై నాయిక యతనింగూర్చి యిట్లు చెప్పుచున్నది. ఓప్రియా! అప్పుడు నాకపోలగతమైన దృష్టిని త్రిప్పకుంటివి. ఇప్పుడును నేనామె నే. ఈకపోలములవియే. అయినను మీచూపు అప్పటిది కాదు.

ఈపద్యమునందు "అప్పుడు" "ఇప్పుడు" అను పదద్వయముచేఁగూడిన వాక్యసంబంధముచేత నీవు నాముఖమునుఁ గాంచు నెపమున నాకపోలప్రతిబింబితమైన కామినినిఁ జూచుచుంటివి. ఇప్పుడామె దూరము సనఁగనే దృష్టిని మార్చితివి.

అకటా! యెంత ప్రచ్ఛన్నకాముకుఁడవోయీ! యను నర్థము వ్యంగ్యమగుచున్నది.

—♦ వాచ్యవైశిష్ట్యము. ♦—

"ఉద్దేశోఽయం సరసకదళీ శ్రేణి శోభాతిశాయీ,
కుంజోత్కర్షాంకురితరమణీ విభ్రమో నర్మదాయాః,
కించైతస్మిన్సురత సుహృద స్తన్వి తే వాంతి వాతాః,
యేషా మగ్రే సరతి కలితా కాండకోపో మనోభూః॥"

తా॥ నాయిక నుద్దేశించి సురతాభిలాషియగు కాముకుఁ డిట్లు బలుకుచున్నాఁడు. ఓకృశాంగీ! అనఁటితోఁపులచే నొప్పుచుండెడి యీనర్మదా తటప్రదేశము, లతానికుంజశోభితమై కామినుల సహజాలంకారమగు విభ్రమమును జూపుచున్నది. మఱియు నిందుఁ గోపోద్దీపితుఁడగు మన్మథుని మున్నిడికొని సురతమిత్రములగు వాయువులు వీచుచున్నవి.

ఇచ్చటఁ బద్యార్థమంతయుఁజేరి యీప్రదేశము సురతయోగ్యము. అందుకయి నీవిందుఁ బ్రవేశింపుమనియెడి కాముకుని యభిప్రాయమునుఁ బ్రకటించుచున్నది.

—♦ అన్యసన్నిధివైశిష్ట్యము ♦—

"నుదత్యనార్ద్రమనాః శ్వశ్రూరాం గృహభరే సకలే,
క్షణమాత్రం యది సంధ్యాయాం భవతి నవాభవతివిశ్రామః"
ప్రా। ఛా।

తా॥ గురుజన సన్నిధిని స్వాభిప్రాయము నుపనాయకునికిఁ దెలుప నవకాశము లేక యెదురింటి వనిత నుద్దేశించి

పలుకునట్లు నాయిక • యిట్లనుచుఁ దన సంకేతకాలమును సూచించుచున్నది. దయమాలిన మాయత్త నిరంతరము నాకింటి పనులనే చెప్పుచుండును. నాకు నిమేషమైన విశ్రాంతి దొరకుట యరుదు. దొరికినను సాయంకాల మొక నిమేషము దొరకునేమో.

ఇచ్చట గురుజనసాన్నిధ్యమునుబట్టి, కామినీవచనము ఉపనాయకునకు సాయంకాలము సంకేతసమయమని సూచించుచున్నదని సరసులకు గోచరించును.

—• ప్రకరణవైశిష్ట్యము •—

"శ్రూయతే సమాగమిష్యతి తవ ప్రియోఽద్య ప్రహరమాత్రేణ। ఏవమేవ కిమితి తిష్ఠసి తత్సఖి సజ్జయ కరణీయమ్॥"

పా॥ ఛా॥

తా॥ ఉపపతికడకుఁబోవ సమకట్టిన నాయికకు, దాని మగని రాక నెఱింగిన సఖి, జనులసమక్షమున దాని యభిసరణము నాఁపుటకై యిట్లు బలుకుచున్నది. ఓసీ! ప్రియసఖీ! ఇప్పుడే జాములోపల నీప్రియుఁడు వచ్చునని తెలియుచున్నది. ఇంకను నీవేల యూతని యన్నపానాదులకైన పనుల నాచరింపక యూఱకున్నదానవు? ఇఁకేఁ గార్యముల సిద్ధపఱుపుము.

ఇచ్చటఁ బ్రకరణ సంబంధమునుబట్టి బ్రకరణజ్ఞులగు సామాజికులకు రహస్యము నెఱింగినసఖి ఇప్పుడే జాములోపల నీపతి రాఁగలఁడను పత్యాగమనవార్తచేత నుపపతికడకు నాయికాభిసరణమును వారించుచున్నదని స్ఫురించుచున్నది.

—♦ దేశ వైశిష్ట్యము ♦—

"అన్యత్రయూయం కుసుమావచాయం కురుధ్వమత్రాస్మి కరోమి సఖ్యః। నాహం హిందూరం భ్రమితుం సమర్థా ప్రసీద తాయం రచితోంజలిర్వః॥"

తా॥ సఖివేషముం దాల్చినట్టి తన యుపనాయకునితో వచ్చిన సఖినిం గాంచి నాయిక చెలులతో నిట్లనుచున్నది. ఓ చెలులారా! మీరిచ్చటినుండి కొంచెము దూరము పోయి పువ్వులఁగోయుఁడు. నేనిక్కడనే కోసెదను. దవ్వుల కేఁగఁజాలను. ఇదిగో మీకంజలి యొనర్చుచున్నదానను. మన్నింపుఁడు.

ఇచ్చట దేశసంబంధమునుబట్టి యిది విజనప్రదేశము. సఖులు వేఱుకడ కేఁగుచున్నారు. కనుక నుపపతినిఁ బ్రచ్ఛన్న వేషము ధరించి రమ్మనుమని నాయిక సఖికి సూచించుచున్నట్లు సరసులు గ్రహించుచున్నారు.

—♦ కాల వైశిష్ట్యము. ♦—

"గురుజన పరవశ! ప్రియ! కింభణామి తవ మందభాగినీ అహాకమ్। అద్యప్రవాసం వ్రజసి వ్రజ, స్వయమేవ శ్రోష్యసి కరణీయమ్॥"

ప్రా॥ ఛా॥

తా॥ దేశాంతరమున కరుగఁ బ్రయత్నించు నాయకు నుద్దేశించి నాయిక యిట్లు పలుకుచున్నది. ఓయీ! గురుజన పరవశుండవగు ప్రియా! అదృష్టహీనురాలనగు నేను నీకేమిం జెప్పుదును. ఈవసంతర్తువునందుఁ బ్రవాసమున కేఁగుదువా? ఏఁగుము. కరణీయమును నీవే యెఱుంగుదువు.

ఇచ్చట గురుజన, పరవశ, ప్రియ శబ్దములు సాభిప్రాయములు. గురుజనశబ్దము బరువైనవారని యర్థమిచ్చుచు నేమియుఁ దెలియనివారని తెల్పుచున్నది. పరశబ్దము శత్రువులను నర్థమిచ్చుచు దేశాంతరమరిగినవారు సహిత మిరవుల కరుదెంచుచుండ నీవసంతసమయమునఁ బ్రియుని బరదేశమున కనుపుచుండుటచే గురుజనులు శత్రుప్రాయులను తాత్పర్యమునుఁ దెల్పుచున్నది. 'ప్రియా!' యను సంబోధనము దుఃఖాతిశయసూచకము. మఱి యిచ్చట ముఖ్యముగా వసంతర్తు రూపకాలసంబంధమునుబట్టి నీవు ప్రవాసమున కరిగిన నేను జీవింపనను కాముకి యుద్దేశ్యము సహృదయులకు వ్యంగ్యమగుచున్నది.

సూత్రములోని యాది పదముచేతఁ జేష్టాదులనుబట్టియు వాచ్యార్థ మర్థాంతర వ్యంజకమగుచున్నదని యేర్పడుచున్నది.

—♦ చేష్టా వై శిష్ట్యము. ♦—

"ద్వారోపాంతనిరంతరే మయి తయా సౌందర్యసారశ్రియా,
ప్రోల్లాస్యోరుయుగం పరస్పరసమాసక్తం సమాసాదితమ్,
ఆనీతం పురతః శిరోంశుకమధః క్షిప్తే చలే లోచనే
వాచ స్తత్ర నివారితం ప్రసరణం సంకోచితే దోర్లతే॥"

తా॥ ప్రియ చేష్టలాచరించిన నాయికాభావమును తన్నుఁ గుఱించినదిగానే నిశ్చయించుకొని నాయకుఁడు తన ప్రియ

సఖునకిట్లుదెలుపుచున్నాఁడు. నెచ్చెళీ! నేను వాకిటి దగ్గఱకుఁ బోవఁగానే సౌందర్యపరిధానమైన కాంతిగల యానాయిక తన రెండుతొడలను విడఁదీసి ముడుచుకొనెను. తలమీఁది వస్త్ర మును ముందుకు లాగుకొనియె. అనంతరము చంచలలోచన ములను గ్రిందికి వాల్చెను. ఆసమయమున మౌనము వహిం చెను. పిదప భుజలతల నొకదానితో నొకటిఁగూర్చెను.

ఇచ్చట నాయిక నాయకుని ద్వారముకడఁ గాంచిన తోడనే తొడలను విడఁదీసి ముడుచుకొనె ననుటవలన నేను నీకు విపరీత సురతము నిచ్చెదననియు, తలమీఁది వస్త్రమును ముందుకు లాగుటవలన రహస్యముగా రమ్మనియు, కన్నులనుఁ గ్రిందికి వ్రాల్చుటవలన సూర్యుఁడస్తమించిన తరువాత సంకేత సమయమనియు, మాటలను జాలించి మౌనము వహించుట వలన చప్పుడులేని సమయమునఁ జప్పుడుగాకుండ రావలయు ననియు, బాహువుల నొకదానితో నొకటిఁ గలుపుటవలన నీవు వచ్చినతోడనే నీరాకకు బహుమానముగా నాలింగన మొసఁగెదననియు, నాయిక తన చేష్టలచే సూచించినట్లు వ్యం గ్యము సహృదయులకు స్ఫురించుచున్నది.

ఇవిగాక యనేక భేదములు సంభవింపవచ్చును. కుశా గ్రబుద్ధు లాయాసందర్భముల నూహింతురని విస్తరభీతిచే విర మించితి. శబ్దము వ్యంజకమగునప్పు డర్థమును, అర్థము వ్యంజక మగునప్పుడు శబ్దమును సహకారిగా నుండునని ముందే నిరూ పింపఁబడియె.

—• గద్య. •—

ఇతి శ్రీనిజామదేశీయ మహబూబునగర మండలాంతర్గత పెద్ద
మందడి గ్రామవాసి భారద్వాజగోత్ర పవిత్ర కాండూరువంశ
పయఃపారావార రాకాసుధాకర చింతకుంట రాఘవా
చార్య ద్వితీయతనూజ, శ్రీపదపురవాస్తవ్య మహా
మహోపాధ్యాయ శ్రీమాన్, కపిస్థలాభిజన, దేశికా
చార్యాది గురువర ప్రసాదలబ్ధ సాహిత్యప్రబోధ
సాహిత్యశిరోమణి ఓ ఉభయభాషాప్రవీణ
పట్టసమంచిత, కడపమండల స్థానిక విద్యా
శాఖాంధ్రపండిత, కాండూరు నరసింహా
చార్య వివృతం బైన కావ్యప్రకాశం
బునందు తృతీయో
ల్లాసము
సంపూర్ణము.

# కావ్యప్రకాశవివరణము.

## ప్రథమభాగము.



## చతుర్థోల్లాసము.



తృతీయోల్లాసమున అర్థగతమైన వ్యంజకత్వము సోదాహరణంబుగ నిరూపింపఁబడియె. శబ్దార్థస్వరూప నిరూపణానంతరము తత్సంబంధి దోషగుణాలంకారాదులే నిరూపింపవలసియుండ ధర్మిస్వరూప నిరూపణానంతరము ధర్మస్వరూపము స్పష్టము గాఁగలదను హేతువుచే నీయుల్లాసమునఁ గావ్యభేదములు నిరూపింపఁబడుచున్నవి.

ధ్వనికావ్యము పూర్వమే తెల్పఁబడియె. అందలి ధ్వని లక్షణామూలము, అభిధామూలమని రెండువిధములు. అందు మొదటిది అవివక్షితవాచ్యమనియు, రెండవది వివక్షితాన్యపరవాచ్యమనియుఁ జెప్పఁబడును. అవివక్షిత వాచ్యధ్వనియందలి వాచ్యము అర్థాంతర సంక్రమితము, అత్యంత తిరస్కృతమని రెండువిధములు. "అవివక్షితవాచ్యో య స్తత్ర వాచ్యం భవే ద్ధ్వనౌ। అర్థాంతరే సంక్రమిత మత్యంతం వా తిరస్కృతమ్॥ అను సూత్రమున కిదియే యర్థము. కవి యభిప్రాయమునకు విషయముకానిది యవివక్షితము. స్వస్వరూపముతో నుపయోగపడక యితరార్థపరిణతమగు వాచ్యార్థ మర్థాంతర సం

క్రమితము. వాచ్యార్థము బొత్తుగాఁ గవియుక్తి ముగాక విడువఁబడునేని అత్యంతతిరస్కృత వా

—♦ అర్థాంతరసంక్రమితము. ♦—

"త్వామస్మి వచ్మివిదుషాం సమవాయోఽ
ఆత్మీయాం మతి మాస్థాయ స్థితి మత్ర విధే

తా॥ విద్వత్సభ కరుగుచుండు నొక
యాప్తుఁ డిట్లు చెప్పుచున్నాఁడు. ఓయీ! అ లగు విద్వాంసులగోష్ఠి యుండుఁగలదు. బుద్ధిగలి డవై మెలంగుమని నేను నీకుఁ జెప్పుచున్నాను.

ఇచ్చటఁ గవికి వివక్షితము ఉపదేశము గాదు. కాఁబట్టి 'చెప్పుచున్నాను' అనునది యుప దేశించుచున్నా' నను నర్థాంతరమునందుఁ బరిణ

—♦ అత్యంత తిరస్కృతవాచ్యము.

"ఉపకృతం బహు తత్ర కిముచ్యతే సుజనతా తాపరమ్। విదధదీదృశమేవ సదా సఖే సుఖితవ దాం శతమ్॥

తా॥ ఒకఁడు నానావిధములఁ దన కం వానింగూర్చి యిట్లు పలుకుచున్నాఁడు. ఓయీ నీవెంత సుజనుఁడవు సుమా. నీవొనర్చిన యుప వచ్చును. కలకాలమిట్లే యుపకారపరుఁడవై ములు మనుము.

అపకారి నుద్దేశించి పలుకునప్పుడు కవి కెప్పటికి నుపకారాదులు వివక్షితములు కాఁజాలవు. కావున నిందలి మిత్ర ఉపకారాది శబ్దము లత్యంత తిరస్కృతవాచ్యములై మిత్రశబ్దము శత్రువును, ఉపకారశబ్ద మపకారమును బోధించుచున్నవి. ఇందుచే నీవత్యంతాపకారివను నర్థము వ్యంగ్యమగుచున్నది.

## —♦ వివక్షితాన్యపరవాచ్యధ్వని. ♦—

వాచ్యార్థము కవి యభిప్రాయవిషయమై వ్యంగ్యార్థమున కంగముగానుండునేని వివక్షితాన్యపర వాచ్యమనఁబడును. వివక్షితాన్యపర వాచ్యధ్వని యలక్ష్యక్రమవ్యంగ్యము, సంలక్ష్యక్రమవ్యంగ్యమని రెండు విధములు. వాచ్యార్థమునకును, వ్యంగ్యార్థమునకును ప్రతీతియందుఁ బౌర్వాపర్యక్రమము తోఁచనిది యలక్ష్యక్రమవ్యంగ్యము. వాచ్యవ్యంగ్యములకుఁ బ్రతీతి పౌర్వాపర్యక్రమము తోఁచునది సంలక్ష్యక్రమవ్యంగ్యము.

విభావానుభావ వ్యభిచారులకును, వానిచే వ్యంగ్యమగు రసమునకును, బౌర్వాపర్యక్రమ ముండినను క్షణికమగుటంజేసి యది స్ఫురింపదనియేగాని వ్యంగ్య వ్యంజకములకు బొత్తుగాఁ గ్రమములేదని యభిప్రాయముగాదు. అనఁగా అసంలక్ష్యక్రమమనఁగా నేమర్థము? వాచ్యార్థమును, వ్యంగ్యార్థమును నొక్కసారి స్ఫురించుటచేఁ గ్రమము లేనిదనియా? వాచ్యార్థము ముందు తోఁచనిది వ్యంగ్యార్థమెట్లు స్ఫురించును? వాచ్యార్థ ప్రతీత్యనంతరమే వ్యంగ్యార్థము స్ఫురించునందువేని

చుటంబట్టి కల్పనాభారమే మిగులుచున్నది. కొంతకాలమువఱ కుఁ గావ్యములు చేయలేనివాఁడు వ్యుత్పత్త్యభ్యాసములు గలిగిన పిదపఁ బ్రతిభ యుదయించి కావ్యములు చేయుచుండుటఁ బట్టి కేవలాదృష్టమే కారణమనుటకు వలనుపడదు అని వివరించిరి.

ఇందెవరి మత మెంతవఱకు సమంజసమో విజ్ఞులూహింతురు గాక. ఈ యిరువురి వివరణమునందును గావ్యదృష్టి వేఱు. కవితాదృష్టి వేఱు. సమగ్రలక్షణ సంపన్నమగు కావ్యము మమ్మటోపాధ్యాయుల దృష్టికి విషయము. సరసభావనా బలమున మొగ్గ తొడిగిన యొకవాక్యమైనను రసతరంగితము కవితావిలసితమని జగన్నాథ పండితులయాశయము. శాస్త్ర లక్షణ లక్షితమైన మహాకావ్యము నిర్మించుటయే కవికృత్యమను ప్రాచీనులమతము నట్లుంచి ఖండకావ్యముల విరివిగ వెలయించు నేఁటి యభినవకవితామండలిలోఁ జేరిన మనకు జగన్నాథుల యాశయమే హృదయంగమముగాఁ గన్పడును.

## —•) కా వ్య స్వ రూ ప ము. (•—

కావ్యోత్పత్తి నిమిత్తములను విమర్శించిన యనంతరము కావ్యస్వరూపము నిరూపింపఁబడు చున్నది." తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి" అని మమ్మటుని కావ్యలక్షణము. దోషశూన్యములును, ఏదో యొక్కచోట నలంకార విరహితము లయినను గుణ సహితములునగు శబ్దా

యది యసంలక్ష్యక్రమ మెట్లగును? ఇది మొదలగు ప్రశ్నములు కొన్ని యిందుఁ గలుగుచున్నవి. అందు కిది సమాధానము. వాచ్యార్థ ప్రతీతిలేనిది వ్యంగ్యార్థము స్ఫురింపకుండుట నిశ్చయమే. అసంలక్ష్యక్రమమనిన వాచ్యవ్యంగ్యములకుఁ బౌర్వాపర్యక్రమము లేకుండుట యని మాయర్థముగాదు. క్రమముండినను నాక్రమము సంలక్ష్యక్రమ వ్యంగ్యమునందు స్పష్టముగాఁ దోఁచునట్లు ఇచ్చటఁ దోఁచక వాచ్యార్థప్రతీతి కలిగి కలుగకమునుపే శీఘ్రముగ వ్యంగ్యార్థము ప్రతీతమగుచుఁ గ్రమము మరుగువడుచున్నది. గావున అసంలక్ష్యక్రమ మనఁబడుచున్నదని యభిప్రాయము.

శృంగారాది రసములును, రత్యాది భావములును, రసాభాస భావాభాస భావశాంత్యాదులును, అలక్ష్యక్రమ వ్యంగ్యధ్వనికి విషయములు. ఇవి యుపమాదులవలెఁ గావ్యముల కలంకారములుగాక యలంకార్యములై యుండునని "రసభావ తదాభాస భావశాంత్యాది రక్రమః। భిన్నో రసాద్యలంకారా దలంకార్యతయా స్థితః॥" అను సూత్రము తెలుపుచున్నది. కావ్యములయందు రసము ప్రధానముగా నుండునేని యలంకార్యమనియు, ఇతర వాక్యార్థమునకుఁగాని, యితర రసాదులకుఁగాని, యంగముగా నుండునేని రసవదాద్యలంకారములనియు, వ్యవహరింపఁబడునని ముందే తెల్పఁబడియె.

ప్రసంగవశమున రసభావాదులు వరుసఁగా నిరూపింపఁబడుచున్నవి. లోకమునందు రత్యాదులకెవ్వి కారణములు

గాను, కార్యములుగాను, సహకారికారణములుగాను నున్న వో యవ్వి నాట్య కావ్యములయందు వరుసగ విభావములు, అనుభావములు, వ్యభిచారిభావములు అని చెప్పఁబడుచున్నవి. ఇట్టి విభావాదులచేత వ్యంజనా వ్యాపారముద్వారా స్థాయిభావము అనుభవ విషయముగాఁ జేయఁబడి రసమనఁబడుచున్నది. ఇవ్విషయమునే "కారణాన్యథకార్యాణి సహకారీణి యానిచ, రత్యాదేః స్థాయినోలోకే తానిచే న్నాట్యకావ్యయోః। విభావా అనుభావా స్తత్ కథ్యంతే వ్యభిచారిణః। వ్యక్తః స తైర్విభావాద్యైః స్థాయీభావో రసఃస్మృతః॥" అను కారికలు తెలుపుచున్నవి. చిరకాలమునుండి మనస్సునం దెడతెగక సంస్కారరూపముగ సంక్రమించియుండు చిత్తవృత్తి విశేషమే భావము.

ఈరసవిషయమునం దనేక యభిప్రాయభేదములు గలవు. "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" అని భరతుని మూలసూత్రము. దీనికి సాధారణముగా విభావానుభావ వ్యభిచారుల సంబంధమువలన రసము ప్రకాశించుచున్నదని యర్థమేర్పడుచున్నది. దీని నాలంకారికు లిట్లు వివరించుచున్నారు.

ఆలంబన కారణములనియు, ఉద్దీపన కారణములనియు విభావములు రెండు విధములు. రసమునకు నాయికా నాయకు లాలంబన విభావములు. ఉద్యానవన చంద్రికా చందనాదు లుద్దీపన విభావములు. అట్టి విభావములతో రసము జనితమై, కటాక్షభుజాక్షేపాదులనెడి యనుభావములచేఁ బ్రతీతియోగ్య

ముగఁ జేయఁబడి సహకారికారణరూపమగు నిర్వేదాది వ్యభి
చారిభావములచేఁ బోషింపఁబడి ముఖ్యవృత్తిచే రామాదులం
దును, తద్రూపానుసంధానముచే నటునియందును, ప్రతీయ
మానమగుచున్నది. అనఁగా సర్పము లేకున్నను రజ్జు దర్శన
మాత్రమున సర్పభ్రాంతిచే నెట్లు భీతియుదయించునో యట్లే
రామానుకారి నటునియందు సీతా విషయకానురాగరూపమైన
రతి లేకున్నను నాట్యనైపుణ్యమున నందుండునట్లు తోఁచుచు
సహృదయులకుఁ జమత్కారకారియై రసమనఁబడుచున్నది.
ఇట్లు నటునియందు రత్యారోపమే రసనిష్పత్తి”యని భట్టలోల్ల
ట ప్రభృతుల వివరణము. వీరి మతమున భరతసూత్రము నం
దలి సంయోగపదమునకు, జన్యజనకభావ, గమ్యగమకభావ,
పోష్యపోషకభావరూపమైన సంబంధమనియు, నిష్పత్తిపదము
నకు ఉత్పత్తి, అభివ్యక్తి, పుష్టి యనియు అర్థము.

రస మనుకార్యులయిన రామాదులయందు నిష్పన్నమ
గునా? సామాజికులయందా? రామాదులయందు నిష్పన్నమ
గునందువేని సామాజికులకెట్లు చమత్కారముదయించును?
కార్యకారణములకు § సామానాధికరణ్య మనుభవసిద్ధమగు
టచే * వైయధికరణ్యమెట్లు సంగతమగును? సామాజికుల
యందే రసము నిష్పన్నమగుపక్షమున “అనుకార్య రామాదుల

---

§ కారణమును, కార్యమును ఒక్కచోటనే యుండుట సామానాధి
కరణ్యము.

* కార్యకారణములు వేఱువేఱు స్థలములయందుండుట వైయధికరణ్యము.

యందు ముఖ్యవృత్తితో నిష్పన్నమయి తదారోపానుసంధాన వశమున నటునియందుఁ బ్రతీయమానమగు"నను మాట యెట్లు సరిపడును? కావున నీవివరణము సరికాదు.

లోకమునందు "రాముఁడే వీఁడు" "వీఁడే రాముఁడు" అను ప్రతీతిని సమ్యక్ప్రతీతి యనియు, ఉత్తరకాలమున బాధ జ్ఞానముండునపుడు గలుగు "వీఁడు రాముఁడు" అను ప్రతీతిని మిథ్యాప్రతీతి యనియు, "వీఁడు రాముఁడా? కాఁడా?" అను ప్రతీతిని సంశయప్రతీతి యనియు, "వీఁడు రామసదృశుఁడు" అను ప్రతీతిని సాదృశ్య ప్రతీతియనియుఁ, జెప్పుదురు. సామాజికులకు నటునియం దిట్టి ప్రతీతులు తోఁచునేని రసనిష్పత్తి కవకాశముండదు. కాఁబట్టి సామాజికులకు నటునియందు అతని నాట్యనైపుణ్యవశమునఁ బూర్వోక్త ప్రతీతులకు విలక్షణముగఁ § చిత్రతురగాది ప్రతీతివలె "వీఁడు రాముఁడు" అను ప్రతీతియే గలుగును. అందువలన నటుఁ డభ్యాసబలమునను, శిక్షాపాటవమునను, అభినయించెడి విభావానుభావ వ్యభిచారులు వాస్తవములుగాక కృత్రిమములే యైనను, సామాజికులు వాస్తవములుగానే గ్రహింతురు. ఇట్లు విభావాదుల గమ్యగమక భావసంబంధమువలన నటునియం దనుమీయమానమై, నటగతముగాకున్నను దద్గతముగ సంభావ్యమానమై, సంస్కారబల

§ చిత్తరువునందు వ్రాయఁబడిన గుఱ్ఱము మొదలగు ప్రతిమలనుఁ గాంచి నిజముగ నియ్యవి గుఱ్ఱము మొదలగునవియే యని గ్రహించుట చిత్రతురగాది ప్రతీతి.

ముచే సామాజికుల కనుభవగోచరమగు రతియే రసమనఁబడును. అనఁగా దూరమునుండి ధూళి వ్యాప్తమైన దేశమును గాంచి ధూమభ్రమచే నెట్లు వహ్నిగలదని సాధించెదమో యట్లే నటుఁడు తనవిగాకున్నను, తనవిగా నభినయించెడి విభావాదులచేఁ దన్నియతమైన రతి యనుమీయమానమై సామాజికులకాస్వాదమును గలిగించుచు, రసమనఁబడుచున్నది. ఇట్లు నటునియందు రత్యనుమానమే రసనిష్పత్తి యని శ్రీశంకుకుఁడు వివరించెను. ఇతని మతమునందు సూత్రములోని సంయోగపదమునకు అనుమాప్యానుమాపక భావసంబంధమనియు, నిష్పత్తి పదమునకు అనుమితి యనియు అర్థము.

ప్రత్యక్షజ్ఞానముదక్క నమమిత్యాదులు చమత్కారమును బుట్టింపఁజాలవను లోకప్రసిద్ధినిబట్టి ముందీరత్యనుమానము చమత్కారజనకము కాఁజాలదు. మఱియు సామాజికునకు నటునియందు రత్యనుమానము లేకయే రసాస్వాద మనుభవసిద్ధము. కావున భరతసూత్రమునకుఁ బైరీతిని వ్యాఖ్యానముచేయుట యసంగతము. రసప్రతీతియైనను, తదుత్పత్తియైనను, తదభివ్యక్తియైనను, ఉదాసీన రామాది నాయకగతముగఁగాని, నటగతముగఁగాని స్వగతముగఁగాని కలుగుటలేదు. కావ్యనాట్యములయం దభిధావ్యాపారముతప్ప రెండు వ్యాపారాంతరములు గలవు. వానినే భావకత్వ భోజకత్వ వ్యాపారములందురు. విభావాది సాధారణీకరణమే భావకత్వము. విభావాదులును, రత్యాదులును, నేదో యొకరికి మాత్రము సంబం

ధించియుండినను, నట్టి వ్యక్తివిశేషసంబంధముతోఁ జేరకుండఁ జేయుటయే సాధారణీకరణము. ఇట్లు కావ్యనాట్యములయం దభిధావ్యాపారమునకు రెండవదియగు నీభావకత్వ వ్యాపారముచేత భావ్యమానమైన స్థాయిభావము, భోజకత్వ వ్యాపార సాహాయ్యమున సహృదయులచే నాస్వాదింపఁబడుచు రసమనఁ బడుచున్నదనియు, ఇంక మూఁడవదియగు భోజకత్వవ్యాపారము సత్త్వోద్రేక ప్రకాశానన్ద సంవిద్విశ్రాంతిస తత్త్వము అనఁగా రజస్తమోగుణభిన్నమగు సత్త్వగుణము ఇతరగుణముల నణఁచి కలిగించు ప్రకాశానన్దమయమైన జ్ఞానవిశ్రాంతికి (బ్రహ్మానందమునకు) సమానమైనదనియు, భట్టనాయకులు వివరించిరి. వీరి మతమున సూత్రములోని సంయోగపదమునకు భోజ్యభోజక భావసంబంధమనియు, నిష్పత్తిపదమునకు భుక్తి (భోగము) యనియు నర్థము.

కావ్యనాట్యములయం దభిధావ్యాపారముకంటె వేఱుగ రెండు వ్యాపారములను గల్పించుటకుఁ బ్రమాణము లేదు. వ్యంజనావ్యాపారమే భోజకత్వమని చెప్పినను, అధికముగ మఱియొక భోధకత్వవ్యాపారమును గల్పించుట బరువే గదా? ఇంకను పైవివరణమురీతిని రసాస్వాదము గలుగుటయు ననుభవ విరుద్ధము. లోకమున స్త్రీ, చందన చంద్రికాదు లభ్యాసవంతులకు స్థాయిభావానుమితినిఁ గూర్చి కారణములగునో యట్టి ప్రమదాది లౌకికకారణములే కావ్యనాట్యములయం దలౌకిక విభావాదులనఁబడుచున్నవి. అట్టి విభావాదులు లోక

మునందు దోకానోక పురుషునికి మాత్రము సంబంధించినవైనను, అనఁగా సీతాదులు రామునకును, శకుంతలాదులు దుష్యంతున కుమాత్రమే సంబంధించినవైనను, అవి కావ్యనాట్యముల యందు "ఈవిభావాదులు నావి" అనిగాని, "యివి యొక యుదాసీన పురుషునివని" కాని, "యివి నాశత్రువని" కాని, "యివి నావి కావని" కాని, సంబంధవిశేష స్వీకార పరిహార ములతోఁ దోఁచక సాధారణముగ నాయా సామాజికులకుఁ దోఁచుచున్నవి. ఇట్టి విభావాదులచే నభివ్యక్తమైనదియు, సా మాజికాత్మలయందుఁ బూర్వమే సంస్కారరూపమున సంక్రమించియుండెడిదియు నగు, రత్యాది స్థాయిభావము, రాముఁడు మొదలగు కొందఱు పురుషులకు మాత్రము సంబంధించియుం డియు సాధారణీకరణోపాయ బలమువలన వారికట్లు దోఁచక కేవలానందాత్మకమై విభావాది జీవితపర్యంతము పానకరసన్యా యముతో నాస్వాదింపఁబడుచు ముందుఁ బరిస్ఫురించుదాని వలెను, సర్వాంగవ్యాపనము చేయుదానివలెను, స్వవిషయ ములైన విభావాదులకంటె నితరముల నన్నింటినిఁ గప్పివేయు చు బ్రహ్మాస్వాద మనుభవింపఁ జేయుదానివలె నుండి యలౌ కిక చమత్కారకారియైన శృంగారాది రసమనఁబడుచున్నది. అనఁగా లోకమునందు సీతాదికారణములవలన రామాదుల యం దనుమితమైనరతి, సహృదయుల హృదయములయందు సంస్కారరూపమున నిలిచియుండి కొంతకాలమునకుఁ గావ్య నాట్యములయందు రామాది వ్యక్తివిశేషములకు సంబంధించి నట్లు ప్రతిపాదింపఁబడినను భావకత్వబలముచేఁ దత్తద్వ్యక్తి

విశేషసంబంధిగఁ గన్పట్టక సాధారణమ్ముగ నాయికాత్వాదిరూపమునఁ బ్రతీతములైన విభావాదులచే నభివ్యంజితమై సామాజికుల కాస్వాదముఁ గలిగించుచున్నది. ఇట్టి యాస్వాదమే రసనిష్పత్తి యనఁబడునని యభినవగుప్తపాదులు వివరించిరి. ఇతని మతమునందు సూత్రములోని సంయోగపదమునకు వ్యంగ్య వ్యంజక భావసంబంధమనియు, నిష్పత్తిపదమునకు అభివ్యక్తి యనియు నర్థము. ఈమతమే సర్వసమ్మతమైనట్లు తోఁచుచున్నది.

ఈసందర్భమున మఱికొంత వివరణమవసరమై యున్నది. రసనిష్పత్తినిఁగూర్చి ప్రాచీనాధునాతన పండితులు పలువురు పలువిధములఁ జర్చించియున్నారు. అందుఁ గొందఱు నాటక ప్రదర్శనమున రసము కథానాయకగతమనియుఁ, గొందఱు నటగతమనియుఁ, మఱికొందఱు సామాజికగతమనియు నిపుణముగఁ జర్చింతురు. రసము లౌకికాలౌకికానందమయమగు సుకుమారభావము. దీనిని సులభముగా నిరూపించుటలో శాస్త్రమార్గము కఠినము. తేఁట తెలుఁగు మాటలు చాలవు. విభావాదులచే స్వాదుత్వమును బొందింపఁబడిన స్థాయిభావము రసమని ప్రౌఢసంకేతము. ఎచ్చట రసనిష్పత్తి కావలయునన్నను బూర్వోక్తసామగ్రి యవసరము. నాటక ప్రదర్శనమున నీ రసనిష్పత్తిఁ గూర్చి చర్చించినచోఁ దత్స్వరూపము సుగమము కాఁగలదు.

రసము జనించుటకు విభావాది సామగ్రి ప్రధానము గదా? రసము సామాజికగతమగుటకుఁ గాని, నటగతమగు

కుఁగాని, నాటకమునందు ఆవిభావాదులేవి? రామాయణ ప్రదర్శనమునందు నాయాసామగ్రిచేత రసాలంబనత్వము రామాదులకుఁ జెల్లుఁగాక. నటసామాజికుల కెట్లు చెల్లును? నటునకు రసాస్వాదన మున్నదా? లేదా? రసాస్వాదలోలుపుఁడగు నటున కభినయపాటవము కొఱఁతవడును గాదా? రసవిజ్ఞానము, రసానుభవ సామర్థ్యములేని నటుఁడు నాటకము నెట్లు లభినయింపఁగలఁడు? సభాస్థానముననుండి చూచుచుండు సామాజికునకు నటుఁ డభినయించు రామచరిత్రమును జూచుచున్నపుడు ఉద్దీపన విభావనాది సామగ్రిలేనిచోట రసనిష్పత్తి యెట్లుసిద్ధించును? ఈకొలఁదిగాఁ బ్రశ్నము లనేకములు పుట్టుచున్నవి. ఆచర్చకు దిగినచో సూక్ష్మసూక్ష్మతర భేదములచే విషయము విపులమై గ్రంథము విస్తృతమగును.

మనస్సునఁ దోఁచిన సంకల్పము (లౌకికముగాని యలౌకికముగాని) తగిన కారణములచేఁ బెంపొంది, ప్రతికూల పరిణామములచే దూరమైనను, ప్రత్యాశచే దృఢపడి భాగ్యము ఫలించినపుడు గలుగు చిత్తనిర్వృతియే రసము. తదనుభవమే రసానుభవము. సంకల్పము ఫలించుటలోఁగల సామీప్యమును బట్టి యంకురితపల్లవితాది దశలు గలుగుచుండును. ఆసంకల్పమితరములచే నభిభూతమగునపుడు రసాభాసమగుచుండును. సంకల్పము సంపూర్ణముగా ఫలించినచో సంపూర్ణ రసవికాసమును, సంపూర్ణరసానుభవమును (ఆనందము) గలుగుచుండును. ఈయర్థమునే "రసోవై సః" అను శ్రుతిమొదలు "సరసా

లాపములు" "సరసాలోకనములు" "సరసపరిమళములు" "సరసాహారములు" మొదలగు లౌకిక వ్యవహారము వఱకుంగల యంతయు రూఢిమూలముఁ జేయుచున్నది.

రసలోలుపుఁడగు వాని యౌచిత్యంబట్టి రసపాకము భిన్నమగుచున్నది. విషయములచేఁ గొట్టుపడని చిత్తవృత్తిగలవారికిఁ బ్రపంచమంతయు రసమయము. "నానృషిః కురుతే కావ్యమ్॥" అనుటలో నీయంశమెంతయు గర్భితముగాను, విపులముగాను, నిరూపింపఁబడియున్నది. విరుద్ధధర్మములుగల యీ ప్రపంచమునంతటిని రసమయముగా సృజించు మహాకవి ఋషిగాకుండునా? నాటక ప్రదర్శనమున సామాజికుఁడన్నపుడు నాటకశాలలోని స్తంభమువలె గోడవలెనున్న యొకవ్యక్తికాక వివేచనాశక్తిగల యొక పురుషుఁడని తెలిసికొనవలెను. నాటకశాలకుఁ బోవునపుడే వాని హృదయమున నొక సంకల్పము (పాట, ఆఁట, వేషము, చరిత్రము, నీతి, మొదలగువాని యౌచిత్యము చూచి యానందింపవలెనని) జనించును. కథ పరిచితముకావచ్చును. అపరిచితమైనను గావచ్చును. పరిచితమైనచో నౌచిత్యము సుగ్రాహ్యమై రసాస్వాదనము సుకరమగును. నటకుని చతుర్విధాభినయములతో నభిమత విషయము ఔచిత్యమునఁ దులదూఁగుచుఁ బ్రదర్శింపఁబడఁగా నతఁడు తన్మయుఁడై రసపారవశ్యమునందును. అపుడు రసనిష్పత్తి సామాజికగతమగును. రసమున కాలంబనము సామాజికుఁడుగను, నటాభినీత చతుర్విధాభినయములు అనుభావసాత్త్వికాదులుగను, నిర్వే

యింపఁబడుచున్నవి. మఱియు సామాజికుని ప్రపంచవిజ్ఞాన వైభవమునుబట్టి రసము స్వచ్ఛముగా, సుకుమారముగా గ్రహింపఁబడి యమృతమువంటిదో, తేనెవంటిదో యగును.

సహృదయ హృదయనాళములు వీణాతంత్రులవంటివి. రాగాలాపమూర్ఛనా విశేషాదులంబట్టి వైణికుఁడాయా స్వర స్థానములను స్పృశింపఁగనే మనోహరమగు గానామృతము వెడలును. అది రసమయము. ఆనందమయము. సుసంస్కృత ములగు నాతంత్రులకు స్పర్శనిమిత్తముగా మధురశబ్దబ్రహ్మము ధ్వనించు వైదగ్ధ్యము రసికవేద్యము. మఱియు సున్నితమగు విపంచిక మలయమారుతాస్ఫాలనమునఁగూడ రాగాలాపముఁ జేయునని పెద్దల యనుభవసూక్తి. ("రణద్భిరాఘట్టన యానభః స్వతః పృథగ్విభిన్న శ్రుతిమండలైః స్వరైః। స్ఫుటీభవద్గ్రామ విశేషమూర్ఛనా మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః మాఘుఁడు) అటులనే రసిక హృదయములును నిసర్గముగను, ననుభవమునను, విజ్ఞానమునను, సంస్కృతములైయుండి నటుని యభినయ కౌశలమున ద్రవించి రసమయములగుచున్నవి. కను కనే రసము సామాజికగతమనుట సుస్పష్టము.

నటునికి రసానుభవమున్నదా? యని యొక ప్రశ్నము. ఇందు నటగత రసానుభవము వేఱు. అతని సంకల్పము సభ్య రంజనము. ఆసంకల్పము పెంపొందుటకు సుశిక్షితములైన చతుర్విధాభినయ ప్రయోగములు, సముచిత సంవిధానముల నుత్సాహముఁగొల్పుటయు, సభ్యుల మోమునఁ దాండవించు

తృప్తిరేఖలును, ఉద్దీపన విభావనాది కారణములై సభ్యుల యభినందన ప్రశంసనలతో నతని రసానుభవము పూర్ణమగును. గాని, కథానాయకుఁడే తానుగా, తద్గత సుఖదుఃఖాదులఁ దా ననుభవించుచున్నట్లుగా రసతన్మయుఁడగునేని చేయవలసినది మఱచి తాను వేఱొక నాటక మాడుచుండువాఁడగును. నిక్క ముగఁ గథానాయకుఁడే యితఁడను భావమును సామాజికుల కుఁ గలిగించుఁగాక. యది యభినయకౌశలమున నుత్కృష్ట కోటి యనవచ్చునేగాని రసపారవశ్యమనరాదు. నటుఁడు రస జ్ఞుఁడుగను, లౌకిక శాస్త్రీయానుభవ బలముగలవాఁడుగను, తప్పక యుండవలయును. సముచితముగ, హృదయంగమముగ రసము నభినయించువాఁడు గావలయునుగాని రసము ననుభ వించువాఁడు గాఁగూడదు.

రసము కథానాయకగతమనుట యుక్తిసహముగాదు. ఎన్నఁడో గడిచిన కథయు, నాఁటి విభావానుభావాదులును నిప్పుడు లేవు. కథానాయకుని దివ్యచరిత్రము నటాభినయము నకొక వన్నెఁగూర్చి సామాజికానందమున కొక యమూల్య కారణమగును.

కథాసంవిధానమును, పాత్రముల చేరికను, నటవర్గముల యభినయచాతురిని, సామాజికుల రసగ్రహణపారీణతను, సువి హితముగ నేర్పఱిచి తానే యన్నిరూపములెత్తి నాటకప్రదర్శ నమునంతయు రసమయముగ నిర్వహించు మహాకవికిఁగూడ రసానుభవమున్నదా? లేదా? యని చర్చింపవచ్చును. బ్రహ్మ

తాను సృజించిన ప్రపంచముఁజూచి యానందింపవచ్చును, గాని యానందమయుఁడగు నప్పుడు సృష్టి నెక్కడిది? ఇంతకుఁ దేలినదేమనఁగా హృదయముయొక్క యభిమతాస్వాదనతృప్తి రసమనియు, దాని ననుభవించుట రసాస్వాదమనియు, అయ్యది ప్రతివ్యక్తి భిన్నమనియు, నలువుర చేరికచే నట్టి రసోత్పత్తి కలుగుచున్నను, వానిలో యథోచితముగ నాలంబన విభావనాది స్థానములఁబొంది యాయాపాత్రములు రసాస్వాదకారణములగుచున్నవనియు, సహృదయులు నిపుణముగా గ్రహించి రసనిష్పత్తిఁ జేయుదురనియుఁ దెలియవలయును.

నిరుక్తభరతసూత్రమునకు మఱికొన్ని వివరణములుండి నట్లు రసగంగాధరమున నిరూపింపఁబడి యున్నవి. గాని యవి యన్నియు నెక్కువ వివరణమును సహింపవని విడిచితిని.

ఒక్కొక్క రసమునకును విభావానుభావ వ్యభిచారి భావములు వేఱువేఱుగా నుండును. వానివాని కనుగుణములగు విభావాదులచేతనే రసనిష్పత్తి గలుగును. కాఁబట్టి యాయా రసోచితములైన విభావాదులను బ్రత్యేకముగాఁ జెప్పవలసియుండ సూత్రమునందు సామాన్యముగ "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అని నిరూపించుట యెట్లు సంగతమగునని ప్రశ్న యుదయింప వచ్చును గాని, వ్యాఘ్రాది విభావములు భయానక రసమునకువలె, వీరాద్భుత రౌద్రములకును, అశ్రుపాతము మొదలగు అనుభావములు శృంగారరసమునకు వలెఁ గరుణ భయానక రసములకును, క్రమముగ విభా

వాసించులగుట వలనను, ఆయా విభావాదులు తత్తద్రసనియత ములు కాకుండుట వలనను, "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అను సూత్రమునందును, "విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః, ఆనీయమానః స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః॥" అనుకారికయందును విభావాదులు వేఱువేఱుగ నిరూపింపఁబడక సామాన్యముగఁ జెప్పఁబడియున్నవి. వ్యాఘ్రాదులు భీరుజనులకు భయమును గలిగించుట యనుభవసిద్ధమైనట్లే వీరపురుషుల కుత్సాహమును, నూతనప్రేక్షకులకు విస్మయమును, సంహతబంధువులకుఁ గ్రోధమును గలిగించుట యనుభవసిద్ధము. కాఁబట్టి యనియతమైన యిట్టి విభావాదులను బ్రత్యేకముగ నిరూపించుటకంటె సామాన్యముగఁ జేర్చి చెప్పుటయే యుత్తమము.

రసప్రతీతికి విభావాదులు అన్నియుఁగూడి నిమిత్తములగునా? ప్రత్యేకముగనా? అన్నియుఁగూడి నిమిత్తమగునందు వేని, ఎచ్చట విభావములు మాత్రముండి అనుభావాదులు లేకుండునో, యెచ్చట అనుభావములుమాత్రముండి విభావవ్యభిచారిభావములు లేకుండునో యచ్చట రసప్రతీతి యెట్లు గలుగును? విభావాదులు రసనిష్పత్తికిఁ బ్రత్యేకముగ నిమిత్తమగు నేని సూత్రములయందన్నిటిని సామాన్యముగఁ జేర్చి చెప్పుట యెట్లు? అని ప్రశ్నముదయించుచో, రసనిష్పత్తికి విభావానుభావ వ్యభిచారిభావములు మిళితములై మూఁడును నిమిత్తమగుననియు, ఒక్కొక్కచోట విభావములుగాని, అనుభా

వములుగాని, వ్యభిచారులుగాని, మాత్రముండిన నితరభావ ములనాక్షేపించుకొని రసనిష్పత్తిం గావించుననియు, సమాధానము నెఱుంగునది.

## కేవల విభావములు.

"వియదలి మలినాంబుగర్భ మేఘం మధుకరకోకిల కూజి... ...శాం(శ్రీః) ధరణిరభినవాంకురాం కటంకా ప్రణతిపరేదయి... ప్రసీదముగ్ధే॥"

తా॥ ప్రణయకుపితయగు నాయికను గాంచి సఖియిట్లు ...నుచున్నది. ఓముగ్ధా! ఆకాశము తుమ్మెదలవంటి నల్లని మేఘ ములతో నిండియున్నది. దిగంతములకాంతి తుమ్మెదలయు, కో కిలములయు, ధ్వనులచే వ్యాప్తమైయున్నది. భూమి పాషాణ మయమయములగు నస్త్రములవంటి నూతనాంకురములతోం గూడియున్నది. కావునం బ్రణామమాచరింపం బూనిన నీప్రియు నిపైం బ్రసన్నురాలవగుము. ఇంక నీకోపము నాంపుకొనుట దుర్లభము.

ఇచ్చట ముగ్ధాదయిత మేఘాదిరూపమైన యాలంబనో ద్దీపన విభావములుతప్ప ఇతర భావములు కన్పట్టవు.

## కేవలానుభావములు.

"పరిమృదిత మృణాళీ మ్లానమంగం ప్రవృత్తిః
కథ మపి పరివార ప్రార్థనాభిః క్రియాసు,
కలయతిచ హిమాంశో ర్నిష్కలంకస్య లక్ష్మీ
మభినవ కరిదంత చ్ఛేదకాంతః కపోలః॥"

తా॥ మాలతీమాధవమున మకరందునిఁ గుఱించి మాధవుఁడు మాలతి యవస్థను వర్ణించుచున్నాఁడు. ఈమాలతి యంగములు బాగుగా నలఁపఁబడిన తామరతూండ్లవలె వాడి యున్నవి. శరీరధారణ మాత్రోపయోగములయిన పనులయందును బ్రవృత్తి, పరిజనుల బహువిధ ప్రార్థనలచేతఁ గలుగుచున్నది. క్రొత్తయేనుఁగు దంతపు ముక్కవలె మనోహరమైన కపోలము కలంకశూన్యుఁడయిన చంద్రుని శోభను ధరించుచున్నది. అనఁగా భవద్విరహాతిశయమువలన మాలతి యంగములన్నియు వాడి మిక్కిలి కృశించి పనులు చేయలేక యున్నవి. చెంపలు తెల్లఁబాఱి యున్నవని తాత్పర్యము.

ఇచ్చట అంగమ్లాన, విషయాభిలాషరాహిత్య, పాండుతా, క్షామత్వములను ననుభావములుతక్క నితర భావములు లేవు.

—♦ కేవల వ్యభిచారులు. ♦—

"దూరాదుత్సుక మాగతే వివలితం సంభాషిణి స్ఫారితం,
సంశ్లిష్యత్యరుణం గృహీతవసనే కిం చాంచిత భ్రూలతమ్,
మానిన్యాశ్చరణానతి వ్యతికరే బాష్పాంబు పూర్ణేక్షణం,
చక్షుర్జాతమహో ప్రపంచ చతురం జాతాగసి ప్రేయసి॥"

తా॥ మానినీ తిరస్కృతుఁడగు నాయకుఁడు కాంతను బ్రసాదింపక యరిగి మరలరాఁగా నతనింగాంచి యభిమానమును వహించిన ముద్దియ నేత్రక్రియ వర్ణింపఁబడుచున్నది. అపరాధ మొనరించిన ప్రియుని విషయమున మానినీ నేత్రము ప్రపంచ చతురమాయెను. (అనఁగా నానావిధములైన వ్యాపారములు

చేయ సమర్థమాయెనన్ని భావము.) ఎట్లనఁగా, ప్రియుఁడు దూరంబునఁ గన్పట్టిన వెంటనే "ఇందు వచ్చునా? మఱి యొం డైనఁ బోవునా? యను సంశయముచేత నుత్కంఠితముగాను, అతఁడు సమీపించుచుండఁగా "నోహో యితఁడు నాయౌత్సుక్యము నెఱిఁగినట్లున్న" దని లజ్జచేత సంకుచితముగాను, అతఁడు మాటలాడఁగా సంతోషముచేత వికసితముగాను, ఆలింగనాపరుఁడగుచుండ, నెఱ్ఱఁబాఱినదియు, మఱి వస్త్రమును గ్రహింపుచుండ బొమ ముడిగలదిగాను, పరిణామమాచరింప ననుగ్రహము గలుగుటచే నశ్రుపూర్ణముగాను నాయెనని పూర్వముతో సంబంధము. ప్రియునిమీఁది కోపముచేత నభిమానమును, అనురాగముచేతఁ బ్రియునిని విడువఁజాలక తత్తదనుగుణక్రియల నాచరించెనని తాత్పర్యము.

ఇచ్చట ఔత్సుక్యము, వ్రీడ, మొదలగు వ్యభిచారి భావములుతప్ప విభావములుగాని, అనుభావములుగాని కన్పట్టవు. అయినను మున్నుపపాదింపఁబడినట్లు విభావములు అనుభావ వ్యభిచారులను, అనుభావములు విభావ వ్యభిచారులను, వ్యభిచారిభావములు. విభావానుభావములను ఆక్షేపించుకొని రసనిష్పత్తికిఁ గారణమగుచున్నవి గాని కేవలము లెప్పటికిఁ గాఁజాలవు. అని యెఱుంగవలయు.

## —◆ రసవిశేషములు. ◆—

రసస్వరూప నిరూపణానంతరము రసవిశేషముల నిరూపించుట యావశ్యకమగుటచే నిరూపింపఁబడుచున్నవి.

"శృంగారహాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞాశ్చే త్యష్టౌనాట్యే రసాః స్మృతాః"

అభినయాత్మకములయిన కావ్యములయందు శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము ననియెనిమిది రసములుగలవని కారికాభిప్రాయము. అభినయాత్మక కావ్యములయందనుటచే శ్రవ్యకావ్యములయందుఁ దొమ్మిదవరసము మఱియొకటి యున్నదని తోఁచెడిని. అదియ శాంతరసము. శాంతరసము శమప్రధానము గావున, అభినయాత్మకమై, స్వవిరోధి గీతవాద్యాదులుగల నాట్యములయందు సంభవించదు. శాంతరసము శమప్రధానమగుటను సారబోధిన్యాదులు స్పష్టపఱుచుచున్నవి. "నయత్రదుఃఖం నసుఖం, నచింతా, నద్వేషరాగౌ, నకదాచిదిచ్ఛా,। రసః ప్రశాంతః కథితోమునీంద్రైః సర్వేషు భావేషు శమప్రధానః॥" ఏరసమునందు సుఖదుఃఖములును, చింతయు ద్వేషరాగములును, ఇచ్ఛయుఁ గలుగవో యదియే శమప్రధానమైన శాంతరసమనఁబడుచున్నదని యభిప్రాయము.

శాంతరసము నాట్యములయందు సంభవించదనుట విమర్శించఁదగినది. అనుభవమును గప్పిపుచ్చ నెవ్వరు సాహసింతురు? కావునఁ గావ్యప్రకాశికయందు మమ్మటుఁడు "శాంతోఽపి నవమోరసః" శాంతమనెడి తొమ్మిదవ రసముగూడ నున్నదని దృశ్యశ్రవ్య కావ్య సాధారణముగాఁ జెప్పియుండుట చేతను, "అష్టావేవ రసానాట్యే ష్వితి కేచి దచూచుదన్, తద

చారు యతః కం చిన్నరసం స్వదతేనటః" కొందఱు నాట్యము లయం దెనిమిదే రసములున్నవనిరి గాని నటుఁడేరసము నాస్వా దింపకుండుటఁబట్టి యది సరిపడదనెడి సంగీతరత్నాకర ప్రమా ణమువలనను, నాట్యములయం దెనిమిది రసములనెడి కావ్య ప్రకాశికావచనము నుపలక్షణముగా గ్రహించి నాట్యముల యందును శాంతరసమున్నదని యంగీకరించుచున్నారు.

శాంతరసము నాట్యములయందు సంభవించదనువారి యభిప్రాయమేమి? శమరహితుండయిన నటుఁడు శమసాధ్య మైన శాంతము నభినయింపలేఁడనియా? అట్లయిన రసాభివ్యక్తి యెవ్వరియందుఁ గలుగును? నటునియందా? సామాజికుల యందా? నటునియందుఁ గలుగుచో సామాజికులకు దర్శనాది ప్రవృత్తి యెట్లు సంభవించును? సామాజికులయందగునేని వారు శమవంతులగుటచే శాంతరసమేల సంభవించదు? నటుఁడు శమవంతుఁడు గాకుండుటచే శాంతరసాభినయ మసా ధ్యమనుటయుఁ బొరపాటు. వానియందుఁ దక్కుంగల రసముల నభినయింప భయక్రోధాదులు మాత్రమెక్కడివి? వానియందు భయక్రోధాదులు లేమింజేసి వాస్తవమైన వధబంధాది కార్య ములు గలుగకుండినను శిక్షాభ్యాసబలమునుబట్టి కృత్రిమమైన తత్కార్యంబులు సంభవించునని యుక్తినిఁ గల్పించిన నాయుక్తి శాంతరసవిషయమున నేల యన్వయింపదో యూహింపఁజా లము. కావున సంగీతరత్నాకరాదుల ననుసరించి నాట్యముల యందు శాంతరసము నంగీకరించుటే యుక్తము.

రసమన నెట్టిది? కేవల సుఖాత్మకమా? దుఃఖాత్మకమా? కేవల సుఖాత్మకమనుచోఁ గరుణాదులు రసము లెట్లగును? సుఖాత్మకములైన రసములనుండి దుఃఖకార్యములైన యశ్రుపాతాదులు గలుగక సుఖకార్యములయిన హర్షాదులే గలుగవలయును. గనుక కరుణాదులకు రసత్వము చెప్పుటయెట్లు? కరుణాదులు రసములు కాకుండుచోఁ గరుణాది ప్రధానములైన కావ్యములయందు సహృదయులకు దర్శనశ్రవణాది ప్రవృత్తియెలగలుగును? అని కొందఱు ప్రశ్నింతురు. గాని, కరుణాదులు లౌకికముగ దుఃఖమయములే యైనను, గావ్యములయందు అలౌకిక నిరతిశయానంద ముత్కటమగుటవలన వానియందు సుఖాత్మకత్వముండునని లాక్షణికులు రసములన్నియు సుఖాత్మకములే యని యంగీకరించుచున్నట్లు తెలియుచున్నది.

ఇచ్చట లాక్షణికుల యభిప్రాయమేమి? అన్నిరసముల వలనను సామాజికులకు సుఖాంశమే యాస్వాద విషయమగుచున్నదనియా? లౌకికముగ సుఖదుఃఖాది నానారూపముల గోచరించినను, గావ్యములయందన్నియు సుఖరూపముతో గోచరించుననియా? కరుణాదిరసమును సామాజికులు సుఖరూపముతో నాస్వాదించుటగాని, వారికయ్యది సుఖాత్మకముగ గోచరించుటగాని, యనుభవవిరుద్ధమే గదా? ఈరెండింటిని మించిన సుఖాత్మకత్వము వానియందు మఱేముండును. రసములు సుఖమయములనక సుఖదుఃఖాత్మకములనుటచే వీరికిఁ గలుగు బాధయేమో తెలియకున్నది. రసమనఁగా ఆస్వాదము. ఆస్వా

దము సుఖరూపము అనునట్టి రసశబ్దార్థభ్రమము వీరి నింత దూర మాకర్షించి కరుణాదులయందును నిరతిశయానంద ముత్కటమై యుండుటచే సుఖాత్మకత్వమున్న దని చెప్పునంతటి వారినిఁగాఁ జేసినదని తోఁచెడిని. ఆయుత్కటమైన యానందాంశ మేమూల నడఁగియున్నదో సరసులకు గోచరించదు. సామాన్య నాయికా నాయకాది భావముచేఁ దన్మయత్వమును జెందిన సామాజికులకుఁ గలుగు సుఖదుఃఖాస్వాదమే రసమని నిర్వచించితిమి గదా? ఇట్టి యాస్వాదము కేవల సుఖమయమే గావలయునని యేమి నియమము? కరుణాదులయందు సామాజికులకుఁ దన్మయీభవనయోగ్యతను సంపాదించు నటాది చమత్కృతిని గూర్చి యుదయించు హర్షాదులనుబట్టి కడపట సుఖాంశము భాసించుఁగాక. అయ్యది సామాజికుఁడు తన్మయయత్వమును జెంది జొటజొట కన్నీరుఁగార్చుచు దుఃఖపరవశుండై యున్నప్పు డెక్కడిది? ఇట్టిదియేగదా రసాస్వాదము. నటాది చమత్కృతినిఁగూర్చి కలిగిన సుఖాంశము శ్లాఘాపాకృతముగాని, రసాస్వాదముగాదు. ఒక యింతి భర్తృపుత్రాదులఁ గోల్పోయి దిక్కుమాలి యడవినిఁ బెడిదంపుటిడుమలఁ బడుచుండెనన్న యంశమును నటుఁడు చాతుర్యమున నభినయించునపుడు సహృదయుల కుదయించునది యలౌకికసుఖమా? అది తన్మయీభవనకార్యమా? సరసహృదయుల ధర్మమా? సాక్షాత్తుగ అనుభవింపఁబడు సుఖదుఃఖములు లౌకికములనియు, అవి కావ్యగతములై నటాభినయమునకు విషయమైనప్పుడు అలౌ

కికములనియుఁ జెప్పుట బాగు. గాని లౌకికముగ ననుభవించిన దుఃఖము నటాభినీతమై సామాజికాస్వాద విషయమైనప్పుడు అలౌకికసుఖమగుననుట యుక్త్యసహము. రసానుభవము దుఃఖరూపమైనప్పుడు రసమనఁబడు కరుణాదులకు సుఖాత్మకత్వమెట్లు? కాఁబట్టి పైపైనఁ దోఁచునటువంటి రసశబ్దార్థమునుబట్టి రసమనఁగా కేవల సుఖాత్మకమని చెప్పి కరుణాదులయందును, అలౌకిక నిరతిశయానన్దము ఉత్కటమగుటచే సుఖాత్మకత్వముండునని సవరించుకొనుటకంటె తన్మయీభవనమును జెందిన సామాజికాను లనుభవించు నాస్వాదవిశేషము రసము. అయ్యది తత్తత్స్థాయీభావముల ననుసరించి సుఖరూపముగాను దుఃఖరూపముగాను నుండును. సామాజిక ప్రవృత్తికిఁ గావ్యగతమైనట్టియు, నటగతమైనట్టియు, చమత్కృతి కారణమని చెప్పుట యెంతయు హృదయంగమము. సహృదయులకు సుఖాంశము ప్రవృత్తిహేతువగునట్లు దుఃఖాంశముగూడఁ బ్రవృత్తి హేతువే. నడువీధిలో గొప్ప యాపదచే గోల జరుగుచున్నప్పుడు కఠినచిత్తుండగు పాపాత్ముఁడుదక్క "ఇదియేమి? ఎవరికేమి యాపద సంభవించెను. దానికిఁ బరిహారమేమి?" అని విచారింపక మనకేమి సంబంధమని తప్పించుకొనిపోవు సజ్జనుండుండునా? అందులోఁ బ్రవేశించినవాఁడు అక్కడి కష్టమునో సుఖమునో చూచి యార్ద్రచిత్తుఁడై యావేగము ననుభవింపక కనులకు గంతగట్టుకొని వలదను వాఁడెవఁడు? ఇఁకఁ గవిచే లోకోత్తరముగ వర్ణితములైన కరుణాది ప్రధానకావ్యముల

యందు సామాజికులకు సుఖాత్మకత్వము లేనిది ప్రవృత్తి పొసఁగదని యెట్లు చెప్పఁగలము? అట్లుగుకాని మమ్మటుఁడు నిర్వచించిన రసస్వరూపమున కభిప్రాయమేమి? స్థాయిభావము కేవలానందాత్మకమై విభావాది జీవితపర్యంతము పానకరసన్యాయముతో నాస్వాదింపఁబడుచు, స్వవిషయములైన విభావాదుల కంటె నితరముల నన్నింటిని గప్పివేయుచు, బ్రహ్మాస్వాదము ననుభవింపఁ జేయువానివలె నుండి, యలౌకిక చమత్కారకారి యగుచు, శృంగారాది రసమనఁబడుచున్నదని గదా యితని నిర్వచనము. రసములన్నిటియందు ఆనందాంశము స్ఫురింపనిది యిట్టి సామాన్యలక్షణ మెవరు గల్పింతురు? అనిర్వచనీయమైన యానందాంశమన్నిటియందును స్ఫురించుటచేతనే యిట్టి సర్వసాధారణమైన లక్షణమును గల్పించియుండవలెను. అది యెట్లు?

ఎంతటి యార్ద్రచిత్తుఁడైనను సామాజికుఁడు నాటకరంగమునందు, నాయికానాయకు లనుభవించిన లౌకికసుఖదుఃఖాదులను తన్మయావస్థయందుఁ గూడఁ దనవిగా ననుభవింపఁ జాలఁడనియు, తన్మయీభవనముచే నాత్మయందు సుఖదుఃఖభావావేగము గలిగినను, భావకల్పితములైన యప్పటి యలౌకిక సుఖదుఃఖాదులు లౌకిక సుఖదుఃఖతాదాత్మ్యమును బొందఁ జాలవనియు, లౌకికములయిన సుఖదుఃఖాదులు కావ్యగతములై నంతమాత్రముననే చమత్కృతిజనకతామహిమ నొందుననియు, శోకాదులెంత యుద్బుద్ధములైనను, సామాజిక హృదయములయందుఁ గావ్యచమత్కృతి, నటచమత్కృతి, గీత, వాది

త్రాది, సహకృతముగ నానందాంశమే ప్రధానముగ నిలుచుననియు, కావ్యగతమైన యిట్టి మహిమనే యలౌకికమందురనియు, విశ్వశ్రేయోరూపములైన కావ్యములయందు సామాజిక ప్రవృత్తిహేతువుగఁ గడపటఁ జమత్కృతిరూపమైన యానందాంశమే మిగులుననియు, అదియు కావ్యాత్మభూతముగు రసమనియు నెంచి "రససాధారణ మానందాత్మక"మని చెప్పుట యాలాక్షణికాగ్రేసరుని యభిప్రాయమగునేని మిక్కిలి సంతసము.

## ——♦ శృంగార రసము ♦——

అందు శృంగారము సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము నని రెండు విధములు. మొదటిది పరస్పరాలోకనాలింగనాధరపాన చుంబనాది భేదములచే అనంతమగుటంజేసి యొక్కవిధముగనే పరిగణింపఁబడుచున్నది. మఱియు నిది నాయికారబ్ధము, నాయకారబ్ధమునని రెండు విధములు.

## ——♦ నాయికారబ్ధసంభోగ శృంగారము. ♦——

"శూన్యంవాసగృహం విలోక్యశయనా దుత్థాయకించిచ్ఛనై
ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్,
విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్యగండస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలాచిరం చుంబితా॥"

(అమరుకశతకము.)

తా॥ ఇందు ముగ్ధనాయిక వర్ణింపఁబడియున్నది. శయన

మునుండి కొంచెము మెల్లఁగ లేచి శయనగృహము నిర్జనమగుట యెఱింగి మరల నిద్రించు నెపంబు నొందియున్న పతిముఖమును జాలసేపు నిరీక్షించి సవిశ్వాసంబుగ గండస్థలపరిచుంబన మొనర్చి, యది గగుర్పొడుచుటం గాంచి సిగ్గుచే మోము వంచుకొనియున్న బాలను బ్రియుఁడు ముఖంబునఁ జిఱునవ్వు చిలుకఁ జిరకాలము చుంబన మొనర్చెను. అనఁగా నొక్కగదియందుఁ బ్రేయసీ ప్రియు లిద్దఱు శయనించియుండిరి. ప్రియుఁడు మెల్లఁగ లేచి చూచి శయనగృహమున నెవ్వరు లేకుండుట యెఱింగెను. గాని సఖులు గూఢముగ నుండియుందురను సంశయముచే మరల నిద్రించువానివలె శయనించియుండెను. అప్పుడా ముగ్ధ పతిముఖమును జక్కఁగా వీక్షించి నిద్రించుచున్నాఁడని భ్రమించి కపోల పరిచుంబనముఁ గావించెను. అంతటఁ బతి మేలుకువతో నుండుటఁబట్టి యతని గండభాగములు పులకితములాయెను. దానిం గాంచి యాబాల లజ్జావనతవదనయై యుండఁ బ్రియుఁడు సంతోషపరవశుఁడై నవ్వుచుఁ జిరము ప్రియాపరిచుంబన మొనర్చెనని తాత్పర్యము.

ఇందలి శృంగారము నాయికచే నారంభింపఁబడినది. దీనికి నాయకుఁ డాలంబనము. శూన్యగృహ నాయక నిద్రాదులు ఉద్దీపనములు. ముఖనిరీక్షణ చుంబనాదు లనుభావములు. లజ్జాదులు వ్యభిచారులు. ఇవన్నియుఁగూడి నాయక విషయమున నుద్రిక్తమైయొప్పు నాయికాగత రతిస్థాయిభావమును చర్వణా విషయముగఁ జేయుచున్నవి.

—♦ నాయకారబ్ధశృంగారము. ♦—

"త్వం ముగ్ధాక్షి! వినైవ కంచులికయా ధత్సేమనోహారిణీమ్
లక్ష్మీమిత్యభిధాయిని. ప్రియతమే తద్వీటికా సంస్పృశి,
శయ్యోపాంత నివిష్టసస్మితసఖీ నేత్రోత్సవానందితో
నిర్యాతః శనకై రలీ కవచనోపన్యాస మాలీజనః."

తా॥ నాయికను గుచోపపీడముగఁ గౌఁగలించి సుఖింపఁ దలఁచి ఆలింగనాదుల కంతరాయమును గలిగించు కంచుకమును విడఁదీయఁ బ్రవృత్తుఁడగు నాయకుఁడు వర్ణింపఁబడుచున్నాఁడు. అందమైన కనులుగలదానా! నీవు కంచుకము లేకయే మనోహరమైన కాంతిని దాల్చెదవు. అని పలుకుచుఁ బ్రియతముఁడు రవికె ముడిని ముట్టుచుండ, శయనసమీపంబునఁ గూర్చుండియున్న నాయిక నవ్వుచు సఖీజనమును గడకంటి చూపులచే నానందింపఁజేయ సఖిజనము తిన్నఁగాఁ గార్యాంతరవ్యాజమున వెడలిపోయెను. అనఁగా ఒకనాయకుఁడు తన ప్రేయసినిఁ గంచుకవిహీనముగఁ గౌఁగలించి యానందింపనెంచి నాయికతో "ఓసీ! ముగ్ధాక్షీ! నీవు కంచుకము లేకున్నను మనోహరవే" యని రవికెముడి విడఁదీయఁబోఁగా నాయిక నవ్వుచు సఖులంగాంచి కనుసైగలతో చూచితిరా! యితని దుండగము. మీరందఱుండియు నెంతటి కార్యమునకుఁ గడఁగుచున్నాఁడని తెలియఁజేయ వారా నాయికానాయకుల చిత్తముల నెఱింగి సంతుష్టచిత్తలై చిలుకకుఁ బలుకులు నేర్పవలయునని కొందఱును, చకోరినిఁ జంద్రికాపానమునకు విడువవలయు

నని మఱికొందఱును వెడలిపోయిరని తాత్పర్యము.

ఇచ్చట శృంగారము నాయకునిచే నారంభింపఁబడుచు న్నది. నాయకగతమైన రతికి ముగ్ధాక్షియాలంబనము. నయన సౌందర్యాంగ శోభాదు లుద్దీపనములు. ఆభాషణ కంచుక స్ప ర్శము లనుభావములు. ఉత్కంఠాదులు వ్యభిచారులు. ఇవ న్నియుఁగూడి నాయకగతమైన రతినిఁ జర్వణావిషయముగఁ జేయుచున్నవి.

రతి నాయికానాయకులకు సాధారణమై యుండినను, నాయికాగతమైన రతి చర్వణావిషయమగునేని నాయికారబ్ధ మనియు, నాయకగతమైన రతి చర్వణావిషయమగునేని నాయ కారబ్ధమనియు వ్యవహారము. ఈరెండువిధములయిన శృంగార ములోను, "పూర్వంరక్తాభవేన్నారీ పుమాన్పశ్చాత్తదింగితైః" (మొదట స్త్రీ ప్రేమించవలెను. అనంతరము పురుషుఁడు దాని చేష్టాదులనుబట్టి యనురక్తుఁడు గావలయును.) అను ప్రమాణ మువలన మొదట నాయికారబ్ధ శృంగారమును వర్ణించుటయే యుత్తమము. యుక్తము. చమత్కృతిజనకము.

—♦ విప్రలంభ శృంగారము ♦—

ఇది యభిలాషవిప్రలంభము, విరహవిప్రలంభము, ఈ ర్ష్యావిప్రలంభము, ప్రవాసవిప్రలంభము, శాపవిప్రలంభము నని యైదువిధములు. పరస్పరము సంబంధము కలుగని నాయి కానాయకు లొండొరులు సమాగమమును గోరుటయే యభి లాష. ఒక్కచోటనుండినను నాయికానాయకులలో నొక్కరి

కనురాగములేకపోవుట విరహము. అభిమానమూలకముగఁ గలుగు విప్రలంభము ఈర్ష్య. అనురక్తులగు నాయికానాయకులు కార్యాంతరవశమున దేశాంతరగతులగుట ప్రవాసము. ఇంతకాలము నీవు పత్నీవియుక్తుఁడవగుదువను సిద్ధపురుషాది వాగ్విశేషము శాపము.

—♦ అభిలాష విప్రలంభ శృంగారము. ♦—

"ప్రేమార్ద్రాః ప్రణయస్పృశః పరిచయా దుద్గాఢరాగోదయాః
తాస్తాముగ్ధదృశో నిసర్గమధురా శ్చేష్టాభవేయుర్మయి,
యా స్వంతఃకరణస్య బాహ్యకరణ వ్యాపారరోధీ క్షణా
దాశంసా పరికల్పితాస్వపి భవత్యానంద సాంద్రో లయః॥"

తా॥ మాలతీమాధవమునందు మాలతీప్రాప్తికొఱకు స్మశాన సాధనప్రవృత్తుఁడగు మాధవుని యభిలాషవర్ణనము. ప్రేమార్ద్రములును, ప్రణయముగలవియు, పరిచయమువలన దిట్టమైన రాగముగలవియు, స్వభావముచేతనే మధురములైనట్టివియు నగు నాముగ్ధాక్షియయిన మాలతియొక్క యాయా శృంగారచేష్టలు మరల నాయందుఁగలుగునా? ఆశృంగారచేష్టలు క్షణకాలము తలంపఁబడినంతమాత్రముననే, మనస్సునకు బాహ్యేంద్రియ వ్యాపారము నడ్డగించు నానందసాంద్రమయిన తన్మయత్వమును గలిగించుచున్నవిగదా యని తాత్పర్యము.

ఇచ్చట మాధవగతమైన రతికి మాలతి యాలంబనము. ఆమె విలాసానుస్మరణ ముద్దీపనము. ఆశంస యనుభావము.

ఆశంసా వ్యంగ్యమైన యౌత్కంఠవ్యభిచారి. మాధవుఁడు మాలతీశృంగారచేష్టలు మరల నాయందుఁ గలుగునా? యని యాశంసించుటఁబట్టి యిది యభిలాష విప్రలంభశృంగారమనఁబడుచున్నది.

—♦ విరహ విప్రలంభశృంగారము ♦—

"అన్యత్రవ్రజతీతికాఖలుకథా నాప్యస్యతాదృక్ సుహృత్,
యోమాంనేచ్ఛతి నాగతశ్చహాహాహాకోయంవిధేఃప్రక్రమః
ఇత్యల్పేతర కల్పనాకవలిత స్వాంతా నిశాంతాంతరే
బాలావృత్తవివర్తనవ్యతికరా నాప్నోతి నిద్రాంనిశి॥"

తా॥ నాయకుఁడు సంకేతమొనర్చి గురులజ్జాదికారణాంతరముచే రాత్రికి రాకపోఁగా వితర్కించు విరహోత్కంఠిత నాయికావర్ణనము. నాప్రియుఁడు నాయికాంతర గృహమునకు వెళ్లుననుప్రవాదముగూడ వట్టిది. అట్లు నాయికాంతరగృహంబునకుఁ బిలుచుకొని వెళ్లు మిత్రుఁడును లేఁడు. ఇతఁడు నన్నుఁ బ్రేమింపఁడా? ఏలొకో రాకున్నవాఁడు. అక్కటా! ఎన్నఁడు ననుభవింపని యీవిధిప్రయత్నము నేమందును. అని యిన్విధములైన బహువిధ వితర్కములచే వ్యాప్తచిత్తయై బాల, శయనగృహంబునందు చిత్తస్వాస్థ్యములేక యిటునటు పరివర్తనముసల్పుచు (మాటిమాటికి శయ్యయందుఁబడి పొరలుచు) రాత్రియందు నిద్రింపకున్నది. అని తాత్పర్యము.

ఇచ్చట వచ్చెదనని రాకపోయిన నాయకుఁడు ఆలంబన విభావము. రాకపోవుట మొదలగునవి యుద్దీపనములు.

శయ్యపైఁ బొరలుట మొదలగునవి యనుభావములు. విస్మయము వ్యభిచారి. ఇవి యన్నియుఁగూడి రతినిఁ జర్వణావిషయముగఁ జేయుచున్నవి. ఇది పత్యనాగమ ప్రవృత్తమైనది గావున విరహా విప్రలంభ మనఁబడుచున్నది.

—♦ ఈర్ష్యా విప్రలంభము ♦—

"సా పత్యుః ప్రథమాపరాధసమయే సఖ్యోపదేశంవినా
నోజానాతి సవిభ్రమాంగవలనా వక్రోక్తిసంసూచనమ్,
స్వచ్ఛైరచ్ఛకపోలమూలగలితైః పర్యస్తనేత్రోత్పలా,
బాలా కేవలమేవరోదితి లుఠల్లోలాలకైరశ్రుభిః॥"

(అమరుకశతకము)

తా॥ ఒకతె క్రొత్తఁగా పెండ్లియాడిన తన ప్రేయసి దుఃఖమును సహింపలేనిదై యావృత్తాంతము మఱియొకతెకుఁ జెప్పుచున్నది. ఆచిన్నది మగని మొదటియపరాధసమయమునందు, చెలియల స్నేహపూర్వకోపదేశము లేమిఁజేసి విలాసముగ బొమముడి మొదలగు నంగచాలనముచేతను, పోటుమాటలచేతను, గోపమును సూచింప నెఱుంగకున్నది. ఊరక బిక్కటి చూపులు చూచుచు, నిర్మలమైన చెక్కులవెంబడి కన్నీరు గార్చుచు నేడ్చుచున్నది. అని తాత్పర్యము.

ఇచ్చట మగఁడు ఆలంబనము. పరస్త్రీగమనరూపమైన యపరాధము ఉద్దీపనము. రోదనాదు లనుభావములు. రోదనమూలమునఁ దోఁచునటువంటి యసూయ వ్యభిచారి. ఇవన్నియుఁగూడి రతిస్థాయినిఁ జర్వణావిషయముఁ గావించుచున్నవి.

ఇది పత్యపరాధప్రయుక్తమైనది గావున నీర్ష్యావిప్రలంభమనఁ బడుచున్నది.

## ——♦ ప్రవాసవిప్రలంభము. ♦——

"ప్రస్థానంవలయైఃకృతం ప్రియసఖైరస్రైరజస్రంగతమ్,
ధృత్యా న క్షణ మాసితం వ్యవసితం చిత్తేనగంతుంపురః,
యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వే సమంప్రస్థితాః,
గంతవ్యేసతిజీవిత! ప్రియసుహృత్సార్థః కిముత్యజ్యతే॥"

(అమరుక శతకము.)

తా॥ ఒకనాయిక తన జీవితమునుగూర్చి విసుఁగుతోఁ బలుకుచున్నది. ఓజీవితమా! ప్రియతముఁడు ప్రవాసమునకు వెడలఁ దలంచుచుండఁగనే నీస్నేహితులందఱుకూడ బయలు దేరిరి. నీవును వారితోఁడ వెడలవలసియుండఁగా నేలస్నేహిత బృందమును విడుచుచున్నావు? ఏయే స్నేహితులు బయలు దేరిరి? వలయములు చేతులనుండి జాఱెను. కనులనుండి కన్నీ రురాలెను. ధైర్యము క్షణకాలముగూడ నిలువలేదు. చిత్తము ముందు నడువనారంభించెను. అనఁగా ప్రియుఁడు దేశాంతరము నకు వెళ్లనున్నాఁడని తెలియఁగనే నాయికకు విరహదుఃఖము చేత శరీరము కృశించి వలయములు జాఱెననియు, కన్నీరు గారెననియు, హృదయము తహతహపడసాగెననియు, చిత్తము నకు నిలుకడలేకపోయెననియు, జీవితముమాత్ర మవశిష్టమై యున్నదనియు తాత్పర్యము.

ఇచ్చట నాయికాగత రతికి ప్రియతముఁ డాలంబనము.

అతని ప్రణయాదు లుద్దీపనములు. శరీరము కృశించుట మొద లగునవి యనుభావములు. వీనిమూలమునఁ దోఁచెడి చింతాదులు వ్యభిచారులు.

—♦ శాపవిప్రలంభము. ♦—

"త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైశ్శిలాయా
మాత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్,
అస్రైస్తావన్ముహురుపచితై ర్దృష్టిరాలుప్యతే మే
క్రూరస్తస్మిన్నపి నసహతే సంగమం నౌకృతాంతః॥"

(మేఘదూతము)

తా॥ కుబేరుని శాపముచే రామగిర్యాశ్రమము నాశ్రయించియుండిన యక్షరాజు, మేఘునిద్వారా ప్రియురాలికిఁ జెప్పిపుచ్చు సందేశము, ఓప్రియా! నిన్ను ధాతురాగములచే రాతియందు ప్రణయకోపముచేఁ గూడియున్నట్లు వ్రాసి నేను నీ చరణములమీఁదఁ బడఁగోరునంతలో మాటిమాటికి ఉబుకుచున్నట్టి కన్నీటిచే చూపు కప్పివేయఁబడుచున్నది. క్రూరమైన దైవము మనకు చిత్రమునందుఁగూడ సంబంధమును సహింపలేకున్నది. కష్టా! అని తాత్పర్యము.

ఇచ్చట నాయకగత రతికి నాయిక యాలంబనము. నాయికా ప్రణయకోపాదు లుద్దీపనములు. చరణపాతేచ్ఛాదులు అనుభావములు. దైవమును గుఱించిన యసూయ వ్యభిచారిభావము.

కొందఱు ఈభేదములు స్పష్టమైనవిగావని విప్రలంభ

శృంగారము నొకవిధముగనే పరిగణించుచున్నారు. రతి సంభోగ కాల సంబంధియైన సంభోగశృంగారమనియు, విరహాకాలసంబంధియైన విప్రలంభశృంగారమనియు, వారి యభిప్రాయము.

విప్రలంభమును విన్నకోట పెద్దన వేఱువిధముగ వివరించెను.

క॥ లలితశ్రవణాలోకన
కలహాసూయాప్రవాస, కలనలచేతన్
గలిగెడి దశావిశేషము
చెలువారఁగ విప్రలంభ, శృంగారమగున్."

సీ॥ అదియుఁ జక్షుఃప్రీతి, యన నంత జిత్త
సంగంబునా మఱియు, సంకల్పమనఁగ,
నటఁ బ్రలాపంబునా, నవలజాగరమన
నటుమీఁదఁ గార్శ్య సమాఖ్యమనఁగ,
వెండియు విషయ విద్వేషంబునా దప్ర
సంత్యక్తమనఁగ, సంజ్వరమనంగ
నున్మాదమనఁగ మూ, ర్ఛోపగమంబన
మరణంబునానిట్లు, మానినులకు
తే॥ ననుగతద్వాదశావస్థమై తనర్చుఁ
జదియదశలంద్రు కొందఱు, ప్రౌఢజనులు."

(కావ్యాలంకారచూడామణి)

ఇట్టి సూక్ష్మసూక్ష్మేతర భేదములయందును, అవస్థల యందును విరహాకాలావచ్ఛిన్న రతిత్వ మనుగతము గావున విప్ర

లంభశృంగారత్వము నిర్వివాదమని సర్వము సమంజసము. భేద-
ములును, అవస్థలును, విరహకాలావచ్ఛిన్న రతి కుపోద్బలకము
లగుటచే విప్రలంభము భిన్నభిన్నముగ నిరూపింపఁబడియున్నది.

—♦ హాస్యరసము. ♦—

"ఆకుంచ్య పాణి మశుచిం మమమూర్ధ్ని వేశ్యా
మన్త్రాంభసాం ప్రతిపదం పృషతైః పవిత్రే
తారస్వనం ప్రథితథూత్క్రమదాత్ప్రహారం
హాహాహతోఽహ మితిరోదితి విష్ణుశర్మా."

తా॥ విష్ణుశర్మయను వైదికుని పరిహాసము. విష్ణుశర్మ
"మంత్రజలపరిపూరితంబైన నాతలయందు వేశ్య యపవిత్రమైన
తన చేతిని బిగఁబట్టి తారస్వనముగను, థూత్కారసహితము
గను, నెంత్రవేటు వేసెను. అబ్బబ్బా చచ్చితిసుమా." యని
యేడ్చుచున్నాఁడు. అని తాత్పర్యము.

ఇందు హాసస్థాయిభావమునకు విష్ణుశర్మ యాలంబనము.
రోదన ముద్దీపనము. స్మితాదు లనుభావములు. చూపఱుల
యావేగచాపలాదులు వ్యభిచారిభావములు. ఇవన్నియు సా
మాజికగతమైన హాసస్థాయిభావమును జర్వణావిషయముగఁ
జేయుచున్నవి. ఇయ్యది యుత్తమ మధ్యమాధమ భేదములను
బట్టి యాఱువిధములుగ జగన్నాథాదులచే నిరూపింపఁబడి
యున్నది.

"ఉత్తమానాం మధ్యమానాం నీచానామప్యసౌభవేత్
త్ర్యవస్థఃకథిత స్తస్య షడ్భేదాః సంతిచాపరే,

స్మితంచ హసితంప్రోక్త ముత్తమే పురుషేబుధైః,
భవేద్విహసితంచోప హసితం మధ్యమే నరే,
నీచేఽపహసితంచాతి హసితం పరికీర్తితమ్॥"

"క॥ స్మితమును హసితమునను నీ
ద్వితయము నుత్తమమునాఁగ, దీపించుఁదగన్,
స్మితముమవికాసి కపోలము
మితదర్శిత రదనమైన, మెఱయుహసితమై."

"క॥ విహసితమును బ్రహసితము
న్మహి రెండును మధ్యమములు, మదిఁబరికింపన్,
విహసితము మృదులనినదము,
బ్రహసితము శిరంప్రకంప, పరిమితమరయన్."

"క॥ అపహసితము నతిహసితము
నెపుడును నధమంబులనఁగ, నెపాఱు శిర
శ్చపలము సస్రుయుతంబును,
నపహసితము, మేనుగదల, నతిహసితమగున్.॥

కావ్యాలంకారచూడామణి.

—♦ కరుణరసము. ♦—

"హామాత స్త్వరితాసి కుత్రకిమిదం హాదేవతాః క్వాశిషః
ధిక్ప్రాణాన్ పతితోఽశని ర్హుతవహ స్తేఽంగేషు దగ్ధేదృశౌ,
ఇత్థంఘర్ఘర మధ్యరుద్ధకరుణాః పౌరాంగనానాం గిరః
చిత్రస్థానపి రోదయంతి శతధా కుర్వంతిభిత్తీరపి."

తా॥ ప్రలాపవర్ణనము. ఓతల్లీ! ఎచ్చటికేఁ ద్వరపడుచు

న్నావు? అక్కటా! యేమి యాకస్మికోత్పాతము. ఛీ! దేవత లెందుకు? బ్రాహ్మణాశీర్వాదము లిప్పు డెందుఁబోయె. ఇంక నీప్రాణము లేల. అమ్మా! నీయంగములయం దశనితుల్యమైన యగ్నిపడి నీకన్నులు మండుచున్నదిగదే యని విలపించుచున్న పౌరాంగనారోదన ధ్వనులు తోడిబడుచుఁ గరుణముగలవై చిత్రప్రతిమల నేడ్పించుటయగాక గోడలనుసహితము బ్రద్దలు చేయుచున్నవి అని తాత్పర్యము.

ఇందు శోకస్థాయిభావమునకు మృతనాయిక యాలంబనము. దాని దహనాదులుద్దీపనములు. రోదన మనుభావము. దైన్య, గ్లాని, మూర్ఛాదులు వ్యభిచారులు.

## —♦ రౌద్రరసము. ♦—

"కృతమనుమతం దృష్టం వా యై రిదం గురుపాతకం
మనుజ పశుభిర్నిర్మర్యాదై ర్భవద్భిరుదాయుధైః,
నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినాం
అయమహామసృఙ్మేదో మాంసైః కరోమి దిశాంబలిమ్॥"

వేణీసంహారము.

తా॥ ద్రోణాచార్యులను వధించిన యనంతరము క్రుద్ధుండయిన యశ్వత్థామ యర్జునాదులంగూర్చి పలుకువచనము. గురువైన ద్రోణాచార్యులను జంపుటచేఁ గలిగిన యీమహాపాతకము, మనుజపశువులును, మర్యాదహీనులును, ఆయుధపాణులును నయిన యేమీచేతఁజేయించఁబడి యనుమతించఁబడి చూడఁబడెనో యట్టి మిమ్ము ఈ నేను నరకరిపువైన కృష్ణుని

తోను, భీమార్జునులతోను, మట్టుపెట్టి మీరక్తముచేతను, అసృక్కుచేతను, మాంసముచేతను, దిక్కులకు బలిపెట్టుచున్నాను. చూడుఁడని తాత్పర్యము. (ఇచ్చట మనుజపశువుల నుటవలన బలిపెట్టుటకుఁ దగినవారనియు, ఆయుధపాణులను టవలన నివారించుటకు శక్తులయ్యు నట్లాచరింపక పోవుటచే మిక్కిలి దండనార్హులనియుఁ, దోఁచుచున్నది.

ఇచ్చట అపకారులయిన యర్జునాదు లాలంబనవిభావములు. తండ్రినిఁ జంపుటయు, సాయుధపాణులగుటయు. నుద్దీపన విభావములు. అర్జునాదులను సంహరింపఁ గావించిన యశ్వత్థామ ప్రతిజ్ఞ యనుభావము. నేనొక్కఁడనే యందఱను మడియించెద ననుటచేఁ దోఁచెడి గర్వము వ్యభిచారిభావము. (ఈభావము 'అయమహ' మను నేకవచనప్రయోగముచే నేర్పడుచున్నది.) అశ్వత్థామ గతమైన క్రోధము స్థాయిభావము. వీనిచే సామాజికుల హృదయములందుఁ గ్రోధప్రకృతికమైన రౌద్రరసము చర్వణావిషయముగఁ జేయఁబడుచున్నది.

## —♦ వీరరసము. ♦—

"క్షుద్రాః సంత్రాసమేతే విజహతహరయః క్షుణ్ణశక్రేభకుంభా,
యుష్మద్దేహేషులజ్జాం దధతి పరమమీ సాయకానిష్పతంతః,
సౌమిత్రే! తిష్ఠపాత్రం త్వమసి నహిరుషాం నన్వహం మేఘనాదః
కించిద్భ్రూభంగలీలా నియమితజలధిం రామ మన్వేషయామి."

హనుమన్నాటకము.

తా॥ ఇంద్రజిత్తుని వచనము. మిక్కిలి నీచులయిన వానరులారా! మీరు భయమును వీడుఁడు. ఇంద్రుని వాహనమగు నైరావతముయొక్క కుంభస్థలమునుఁ బొడిచేసిన యీనా బాణములు రామునుద్దేశించి విడువఁబడినవయ్యు దైవవశముచే మీదేహములపైఁ బడుచు మిక్కిలి లజ్జనొందుచున్నవి. ఓరీ! సౌమిత్రీ! నీవూరకుండుము. నాకోపమునకు నీవుగాదు విషయము. నేను మేఘనాదుఁడనుగానా? ఇంచుక భ్రూభంగ లీలామాత్రముచేత సముద్రుని వశపఱచుకొనిన రాముని నేను వెదకుచున్నాను. (అతఁడెంతటి పరాక్రమశాలియో కనుఁగొందమని వెదకుచున్నానని భావము.)

ఇచ్చట ఇంద్రజిత్తుని యుత్సాహము స్థాయిభావము. రాముఁడాలంబనము. అతని సముద్రవశీకరణ ముద్దీపనము. క్షుద్రులయిన వానరులయందలి యుపేక్షయు, పరాక్రమశాలియగు రామునియందలి స్పర్ధయు అనుభావములు. ఐరావత కుంభములనుఁ జూర్ణమొనర్చిన బాణములు లజ్జనొందుచున్నవనుటచేఁ దోఁచెడి గర్వము వ్యభిచారి. ఇవన్నియు సామాజిక హృదయములందు ఉత్సాహప్రకృతికమైన వీరరసము నాస్వాదవిషయముగఁ జేయుచున్నవి.

కొందఱు వీరరసమును, యుద్ధవీరము, దానవీరము, దయావీరము, ధర్మవీరము, అని నాలుగువిధములుగా విభజించి యింద్రజిదాదులు యుద్ధవీరులనియు, బలిచక్రవర్త్యాదులు దానవీరులనియు, జీమూతవాహనాదులు దయావీరులనియు,

యుధిష్ఠిరాదులు ధర్మవీరులనియు నుదాహరించుచున్నారు. గాని కేవల వీరశబ్దము ప్రసిద్ధముగా యుద్ధవీరమును బోధించునట్లు ఇతరభేదములను బోధింపఁజాలదు. ఈభేదములు సంగతములని యంగీకరించుపక్షమునఁ బలాయన వీరాదిభేదముల సహిత మంగీకరింపవలయును. అప్పుడు వీరరసభేదములకుఁ మదిలేకపోవును. కాఁబట్టి దానాద్యుత్సాహము లనుభావములని యంగీకరింపవలయునేగాని వీరరసభేదములుగా నంగీకరింపఁ గూడదని కొందఱి యనుమతము.

—♦ భయానకరసము. ♦—

"గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనేబద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతనభియా భూయసా పూర్వకాయమ్,
దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి."

శాకుంతలము

తా॥ వేఁటకరిగిన దుష్యంతుఁడు మృగమును జంపుటకై రథమును బఱుపునపుడు సూతునితో నిట్లుపలికెను. సూతా! చూడుము. ఈమృగ మధికముగా నెగురుచుఁ బఱువిడుచుండుటచేతఁ బెక్కుసారు లాకసమునందును, గొంచెముగా భూమియందును బోవుచున్నది. ముమ్మాఱు మెడనుద్రిప్పి యందము తిశయింప నరదమువంకఁ జూచుచున్నది. బాణము పడునన్న భయముచే వెనుకటిభాగమును బూర్వకాయమునఁ జేర్చుకొను

చున్నది. శ్రమముచేఁ దెఱువఁబడిన నోటినుండి దారిపొడవు నను సగము నమలిన దర్భాంకురములు జాఱిపడుచున్నవి. అని తాత్పర్యము.

ఇచ్చట మృగగతమైన భయము స్థాయిభావము. వెన్నంటివచ్చెడి రథమాలంబనము. వెన్నంటుటయు, శరపతన భయము నుద్దీపనములు. గ్రీవాభంగమును, బలాయనము నను భావములు. శంకా, త్రాస, శ్రమాదులు వ్యభిచారులు.

—♦ బీభత్సరసము. ♦—

"ఉత్కృత్యోత్కృత్యకృత్తిం ప్రథమమదపృథూత్సేధభూయాంసిమాంసా
న్యంసస్ఫిక్ పృష్ఠపిండాద్యవయవసులభాన్యుగ్రపూతీనిజగ్ధ్వా
ఆర్తః పర్యస్తనేత్రః ప్రకటితదశనః ప్రేతరంకః కరంకా
దంకస్థాదస్థిసంస్థం స్థపుటగతమపి క్రవ్యమవ్యగ్రమత్తి॥"

తా॥ స్మశానమునందలి పీనుఁగునుదిను ప్రేతరంకము (పెద్దబోద) నుఁ జూచి చెప్పుమాట. ప్రేతరంకము మొదటఁ జర్మమును బొడిచి పొడిచి తర్వాత బాగుగా బలిసియుండుటచే నధికమైనట్టియు, భుజములు, తొడలమొదళ్లు, పిక్కపై భాగములు, మొదలగు నవయవములయందుఁ జులకఁగా దొరుకు నట్టియు, అసహ్యమై దుర్గంధపూరితమైనట్టియు, మాంసమును దిని యాఁకలిచేఁ బీడితమై నలువైపులఁ జూపులనిగిడించుచుఁ బండ్లుదెఱచుచు శవముయొక్క యుత్సంగభాగమునందలి యె మ్ముల కంటుకొనియున్న మిట్టపల్లములలోని మాంసమును

దినుచున్నదని తాత్పర్యము.

ఇచ్చట శవముగాని, ప్రేతరంకముగాని యాలంబనము. పొడిచి పొడిచి మాంసముఁదినుట యుద్దీపనము. దానినిగాంచు పురుషుని మొగము త్రిప్పుట, విదిలించుకొనుట, ముక్కుమూసికొనుట మున్నగునవి యనుభావములు. ఉద్వేగాదులు వ్యభిచారులు. జుగుప్స స్థాయిభావము. వీనిచే సామాజికహృదయమునందు జుగుప్సాప్రకృతికమైన భీభత్సరసము వ్యంగ్యమగుచున్నది.

## —♦ అద్భుతరసము. ♦—

"చిత్రం మహానేష బతావతారః
క్వకాంతిరేషా భినవైవ భంగిః,
లోకోత్తరం ధైర్యమహోప్రభావః
కాప్యాకృతి ర్నూతన ఏషసర్గః."

తా॥ వామనునిఁగాంచి బలిచక్రవర్తి పలుకు వచనము. మాహాత్మ్యసంపన్నుఁడైన యీపురుషుఁడు లోకోత్తరమైన వస్తువు. ఇతఁడు సదాచారప్రవర్తకుఁడు. ఇతనియందుఁ గన్పట్టెడు నీకాంతి మఱియెందుఁగలదు? ఇతనిరీతి మిక్కిలి క్రొత్తది. ధైర్యము లోకాతీతము. సామర్థ్యము లోకాతిశాయి. ఆకారమునుగూర్చి చెప్పనేటికి. ఇతని సృష్టియే నూతనము. బాపురే అని తాత్పర్యము.

ఇచ్చట విస్మయము స్థాయిభావము. వామనుఁడా లంబనము. కాంతియు, గుణాతిశయాదులు నుద్దీపనములు.

స్తుత్యాదు లనుభావములు. మతి, ధృతి, హర్షాదులు వ్యభిచారులు.

—♦ స్థాయిభావము. ♦—

"తే॥ ఆత్మసంభావిత విభావ కానుభావ
సాత్త్వికవ్యభిచారి సంజ్ఞలఁ దనర్చు
భావములచేత సువ్యక్త భంగులైన
వాని రసికులు స్థాయిభావంబులండ్రు."

శా। చూ।

మఱియు, "విరుద్ధా అవిరుద్ధావా యంతిరోధాతు మక్షమాః, ఆనందాద్భుత కందోఽసౌ భావఃస్థాయీతి సంజ్ఞితః." విరుద్ధములును, అవిరుద్ధములునగు విభావానుభావ వ్యభిచారులచేఁ దిరస్కరింపఁబడనిదై యద్భుతానందాంకుర రూపమగు మనోవికారవిశేషమే స్థాయిభావము. కొందఱు "విభావానుభావ వ్యభిచారి భిన్నత్వేసతి రసాభి వ్యంజకత్వమ్ భావత్వమ్." విభావాది భిన్నమై రసవ్యంజకమగునది భావమని స్థాయీభావలక్షణమును జెప్పుదురు. గాని రసవ్యంజకత విభావాదులయందును నుండుటచే నాలక్షణమంత సరిపడునది గాదు.

—♦ స్థాయిభావ భేదములు. ♦—

స్థాయిభావము, రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అని యెనిమిది విధములు. తొమ్మిదవదగు శాంతరసమునకు శమము స్థాయిభావము.

## —♦ వ్యభిచారి భావము. ♦—

"విశేషాదాభిముఖ్యేన చరణాద్వ్యభిచారిణః
స్థాయిన్యున్మగ్ననిర్మగ్నాః త్రయస్త్రింశచ్చ తద్భిదాః."

స్థిరమగు స్థాయిభావమునందు రసానుగుణ్యముగ సంభవించునవియై, జలబుద్బుదముంబోలె క్షణకాలముననే పుట్టుచు అడఁగుచు నుండెడివి వ్యభిచారిభావములు. "తే॥ స్థాయిభావంబునందు నిత్యత్వముడిగి, వ్యభిచరించుచు నబ్ధిభంగాళివోలె, నోలఁబొడముచు నుడుగుచునుంటఁజేసి, యెసఁగు సంచారిభావంబు లెఱుఁగవలయు." (కా॥ చూ) వ్యభిచారిభావములే సంచారిభావము లనఁబడుచుండును.

ఈవ్యభిచారి భావములు ముప్పదిమూఁడు విధములు.

సీ॥ "గ్లాని నిర్వేద శంకా మదా సూయలు
నాలస్యదైన్య శ్రమాహ్వయములు
స్మృతిమోహ చపలతా చింతలును
విషాదసుప్తి విబోధ కౌత్సుక్యములును
నావేగ గర్వ హర్షామర్ష నిద్రలు
మత్యపస్మారకోన్మాదములును
త్రాసోగ్రతాజడతా వితర్కంబులు
నవహిత్థ ధృతి మరణాభిధములు
తే॥ వ్యాధియును వ్రీడయును నన వరుసఁగృతుల
సాగు ముప్పదిమూఁడు సంచారిభావ

చయము వానినెఱుంగక జరుగదండు)
రస వివేచన చాతుర్య రంజనంబు."

కా। చూ।

(1) ఆధివ్యాధుల మూలమునఁ గలుగు బలహానివలనఁ బుట్టి యంగవైకల్యమునకును, నేత్ర భ్రమణాదులకును, నిమిత్తమగు దుఃఖవిశేషము గ్లాని.

(2) నీచపురుషులయందు ఆక్రోశము, అధిక్షేపము, వ్యాధి, తాడనము, దారిద్ర్యము, ఇష్టవిరహము, పరుల సంపద్దర్శనము మొదలగువానిచేతను, ఉత్తమపురుషులయందుఁ దిరస్కారాదులచేతను గలిగి, యేడ్పు, నిట్టూర్పు, దీనత్వము మొదలగువానికిఁ గారణమై విషయద్వేషమను పేరుగల చిత్తవికారమే నిర్వేదము.

(3) "నాకేమి యనిష్టము రానున్నదోగదా" యనెడి మనోవికారము శంక.

(4) మద్యపానాదులవలనఁ బుట్టి, యుల్లాసమను పేరుగలిగి నిద్ర, హాసము మొదలగువానినిఁ బుట్టించు చిత్తవికారము మదము.

(5) పరోత్కర్ష దర్శనాదులవలనఁ బుట్టి పరనిందాదులకుఁ గారణమగునట్టి చిత్తవృత్తి యసూయ.

(6) మితిమీఱి భుజించుటచేతను, గర్భముచేతను, వ్యాధిచేతను, శ్రమముచేతను బుట్టి చిత్తమును బనులుసేయ నొల్లనీయకుండుట యాలస్యము.

(7) దుఃఖ దార్రిద్ర్యాపరాధములవలనఁ బుట్టి తానప కృష్టుఁడ నెడి భాషణమునకు నిమిత్తమగు చిత్తవృత్తివిశేషము దైన్యము.

(8) అనేకములయిన శరీర కర్మములచేఁ గలిగి, నిట్టూర్పు విడుచుట, అవయవముల నొత్తుకొనుట, నిద్రించుట మొదలగువానిని బుట్టించు దుఃఖవిశేషము శ్రమము.

(9) సంస్కారమువలనఁ గలిగెడి జ్ఞానము స్మృతి.

(10) భయవియోగాదులవలనఁ బుట్టి వస్తుతత్త్వమును నిరూపింపఁజాలని చిత్తవృత్తి మోహము.

(11) అమర్షమువలనఁ గలిగి పరుషవచనాదులకు హేతువగు చిత్తవృత్తి చపలత.

(12) ఇష్టము నెఱవేఱకుండుట వలనను, అనిష్టము సంభవించుటవలనను బుట్టి, ధ్యానమునకుఁ బర్యాయముగ మారి, భూమిని గీరుట, మొగము వంచుకొనుట, మొదలగు వానిని గలిగించు చిత్తవృత్తి చింత.

(13) మనోరథము సిద్ధించక పోవుటచేతను, రాజ గుర్వాదులయం దపరాధముచేతను, గలిగెడి యనుతాపము విషాదము.

(14) నిద్రాదిభావములనుండి పుట్టిన జ్ఞానము సుప్తము. [స్వప్నము.]

(15) నిద్రానంతరము గలిగెడి జ్ఞానము విబోధము.

(16) ఇది నాకిప్పుడే కావలయునను కోరిక యౌత్సుక్యము.

(17) అతిశయితమైన యనర్థముచేఁ గలిగి సంభ్రమ మను పేరుగల చిత్తవృత్తి యావేగము.

[18] రూపము, ధనము, విద్య మొదలగునవి తన కుండుటవలనఁ దాను గొప్పవాఁడనని తలంచుచు నితరులను బరిహసించుట గర్వము.

[19] ఇష్టప్రాప్తి యనిష్టనివృత్తివలనఁ గలుగు సుఖ విశేషము హర్షము.

[20] పరకృత తిరస్కారాది బహ్వపరాధములవలనఁ బుట్టి, నోరు దెరువకుండుట, పెడసుమాటలాడుట మొదలగువానిని బుట్టించు చిత్తవృత్తి యమర్షము.

[21] శ్రమాదులవలనఁ జిత్తము ముకుళించుట (జ్ఞాన వికాస శూన్యమగుట) నిద్ర.

[22] శాస్త్రాదులను జర్చించుటవలనఁ గలిగిన యర్థ నిర్ధారణము మతి.

[23] విరహము, శోకము, భయము, జుగుప్స మొదలగువాని యాధిక్యమువలనను, గ్రహావేశమువలనను బుట్టిన వ్యాధి విశేషము అపస్మారము.

[24] విరహము, గొప్పయాపద, పరమానందము మొదలగువానిచేఁ బుట్టిన ఒక వస్తువునందు వేఱొక వస్తుజ్ఞానము ఉన్మాదము.

(25) భీరువునకు భయంకరమైన మృగాదులఁ గాంచుటవలనఁ గాని, పిడుగుశబ్దమును వినుటవలనఁగాని, కలుగు చిత్త

•వికారము త్రాసము.

[26] అవమానమువలనఁ బుట్టి 'వీని కేమి చేయుదునా' యనునట్టి చిత్తవికారము ఉగ్రత.

[27] చింతచేతను, ఉత్కంఠచేతను, భయవిరహాముల చేతను, ఇష్టానిష్టదర్శన శ్రవణములచేతను, గలిగి ముఖ్యముగాఁ జేయవలసినట్టి పనినిగూర్చి యేమియుఁ దోఁచకుండునట్టి చిత్తవృత్తి జడత.

[28] సందేహాదులకుఁ బిమ్మటఁ గలిగెడి యూహా వితర్కము.

[29] లోభ, శోక, భయాదులవలనఁ గలుగు నుపద్రవములకు నివారణహేతువగు చిత్తవృత్తి విశేషము ధృతి.

[30] రోగాదులవలనఁ గలిగి నిజమైన మరణముగాక మూర్ఛారూపమైన మరణ పూర్వావస్థ మరణము.

[31] రోగము, విరహము, మొదలగువానిచేఁ గలుగు మనస్తాపము వ్యాధి.

[32] స్త్రీలకుఁ బురుషదర్శనాదుల వలనను, బురుషులకుఁ బ్రతిజ్ఞాభంగ పరాభవాదుల వలనను, గలిగి వైవర్ణ్యాధోముఖత్వాది హేతువగు చిత్తవృత్తి వ్రీడ.

[33] హర్షాద్యనుభావములను దాఁచుటకై వ్రీడాదుల వలనఁ గలిగిన చిత్తవృత్తి యవహిత్థ.

—♦ శాంతరసము ♦—

"అహౌవా, హారేవా, కుసుమశయనేవా, దృషదివా

మణౌవా, లోష్ఠేవా, బలవతిరిపౌవా, సుహృదివా,
తృణేవా, స్త్రైణేవా, మమ సమదృశోయాంతి దివసాః
క్వచిత్పుణ్యారణ్యే శివ! శివ! శివేతి ప్రలపతః."

తా॥ ఒకానొక విరక్తుని వచనము. ఒకానొక పుణ్యారణ్యంబుననుండి, సర్పమునందుఁగాని, హారమునందుఁగాని, పుష్పశయ్యాయందుఁగాని, శిలయందుఁగాని, రత్నమునందుఁగాని, లోష్టమునందుఁగాని, బలవచ్ఛత్రువునందుఁగాని, స్నేహితుని యందుఁగాని, తృణమునందుగాని స్త్రీసమూహమునందుఁగాని, సమదర్శినై, శివ! శివ! శివా! యని ప్రలపించుచుండు నాకు దినములు గడుచుచున్నవని తాత్పర్యము.

ఇచ్చట మిథ్యాభూతముగ భావనావిషయమైన జగత్తు ఆలంబనము. తపోవనాదు లుద్దీపనములు. సర్పాదులయందు సమదర్శిత్వ మనుభావము. మతి, ధృతి, హర్షములు వ్యభిచారులు. ఇవన్నియు విరక్త పురుషగత నిర్వేదమును సామాజికుల కుఁ జర్వణావిషయముగఁ జేయుచు శాంతరసమనిపించుచున్నవి.

—♦ భావము ♦—

రసనిరూపణానంతరము భావము నిరూపింపఁబడుచున్నది.

"రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః, భావఃప్రోక్తః"

నాయికానాయక విషయములగుచు రసప్రతీతి పర్యంతము పరిపుష్టములుగాక యపుష్టములైయొప్పు దేవాదివిషయకములైన రత్యాదులును, రసాంగముగాక ప్రధానముగ వ్యంగ్యము వ్యభిచారిభావమును, భావమనఁబడుచున్నది.

—♦ దేవవిషయకరతి ♦—

"కంఠకోణ వినివిష్టమీశ! తే కాలకూటమపి మే మహామృతమ్।
అప్యుపాత్తమమృతం భవద్వపుర్భేదవృత్తి యది మేనరోచతే."

తా॥ పరమేశ్వరస్తోత్రము. ఓయీశ్వరా! నీకంఠైక దేశలగ్నమై తద్రూపముగఁ బరిణతమైన కాలకూటవిషమే నాకు మహామృతముగాని యమృతస్వరూపుఁడయిన చంద్రుని శిరమున ధరించియు భిన్నవృత్తియగుటచే నీమేను నాకు రుచింపకున్నదని తాత్పర్యము.

ఇందు ఈశ్వరవిషయకమైన భక్తుని రతి తన విభావాదులచే వ్యక్తమై భావముగనే తోఁచుచున్నది. గాని రసముగఁ దోఁపదు. నాయికానాయక విషయకముగాక యీశ్వర విషయకమగుటయే యిందుకు నిమిత్తము. ఇట్లే మునివిషయక రత్యాదుల నుదాహరించుకొనునది.

—♦ ప్రధాన వ్యంగ్యవ్యభిచారి. ♦—

"జానేకోపపరాఙ్ముఖీ ప్రియతమా స్వప్నేఽద్యదృష్టామయా
మా మాం సం స్పృశపాణినేతి రుదతీ గంతుం ప్రవృత్తాపురః
నోయావత్పరిరభ్యచాటుశతకై రాశ్వాసయామి ప్రియామ్
భ్రాతస్తావదహం శఠేన విధినా నిద్రా దరిద్రీకృతః."

ఒకానొక ప్రియావియుక్తుఁడు మిత్రునకుఁజెప్పు వచనము. ఓయీ! భ్రాత! నేఁటికి నేను స్వప్నమునందు కోపముచేఁదలను ద్రిప్పి నన్నుఁ జేతముట్టకుమని యేడ్చుచు ముందుఁబోవ నుంకించు నాప్రియతమనుగాంచి యనేక ప్రియభాషణములచే

నాశ్వాసపఱిచి కౌఁగిలింపఁబోవునంతలో నీ విధి నన్ను నిదా
దరిద్రినిఁజేసెను. [మేలుకొలిపెను.] అక్కటా! యితఁడెంతటి
శఠుండు చూచితివా? యని తాత్పర్యము.

ఇందు విధిని గూర్చిన యసూయ ప్రధానముగఁ దోఁ
చుచున్నది. కావున నీయసూయ వ్యభిచారి యనఁబడక భావ
మనఁబడుచున్నది. కొందఱు నాయికాలంబనమై తత్కోపోద్దీ
పితమైన విప్రలంభశృంగార మిందుఁ బ్రధానమని తలంతురు
గాని యిచ్చట శఠపదముచేత నసూయకుఁ బ్రధానప్రతీతి గల
దని వారెఱుంగవలయును.

—♦ రసాభాస భావాభాసములు. ♦—

"తదాభాసా అనౌచిత్య ప్రవర్తితాః" మున్ను నిరూపిం
పఁబడిన రసములుగాని, భావములుగాని, యనౌచిత్య ప్రవర్తిత
ములగునేని [అనఁగా నాయా రసముల కనుగుణముగ నిరూ
పింపఁ బడకుండునేని] రసాభాస భావాభాసము లనఁబడుచు
న్నవి. దేశ, కాల, జాతి, వర్ణాశ్రమ వయోవస్థల నానావిధం
బగు నిజ్జగంబున ద్రవ్యగుణ క్రియాదులకు లోకశాస్త్రప్రసిద్ధమైన
యౌచిత్య మెద్దిగలదో యవ్విధముగఁ బ్రవర్తింప కుండుటయే
యనౌచిత్యము.

"అనౌచిత్యాదృతేనాన్య ద్రసభంగస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోప నిషత్పరా."

అనౌచిత్యముతప్ప రసభంగమునకు మఱియొక కారణ
ముండదు. రసమునకుఁ బ్రసిద్ధౌచిత్యముగల ప్రబంధము పరమ

కును, విరోధము లేదు.

ఇట్లుండ నొక్కయెడ శృంగార భీభత్సములనుగాని, వాని యంగములనుగాని వర్ణించుట యనౌచిత్యమే యగును గదా? అయినను రసపోషమును గలిగించు ననౌచిత్యమును మాత్ర మంగీకరింపక తప్పదు. శృంగారకరుణములలో నొక దాని కొకదాని నంగముగా వర్ణించిన దోషముండదని యిందే ముందు స్పష్టపడఁగలదు. మఱియు,

"ఏకత్రైవానురాగశ్చ తిర్యక్ మ్లేచ్ఛగతోఽపిచ,
యోషితో బహ్వాసక్తిశ్చ రసాభాస స్త్రిధామతః."

నాయికానాయకులలో నొకరికే యనురాగముండుటయు, నాయికానురాగము తిర్యగ్జంతు మ్లేచ్ఛగతమగుటయు, నాయిక బహు పురుషాసక్తయగుటయు, రసాభాసములు. ఈ మూఁడును రసభంగహేతువులగుటచే ననౌచిత్యము.

—♦ రసాభాసము. ♦—

"స్తుమః కిం వామాక్షి! క్షణమపి వినాయాం నరమసే,
విలేభే కః ప్రాణాన్ రణమఖముఖే యం మృగయసే,
సులగ్నే కో జాతః శశిముఖి! యమాలింగసి బలాత్,
తపశ్శ్రీః కస్యైషా మదననగరి! ధ్యాయసితుయమ్॥"

తా॥ ఇయ్యది వారకామినిని గూర్చిన యొక కాముకోక్తియని కొందఱును అనౌచిత్యప్రకటనార్థమై పరకాంతను గుఱించిన కాముకోక్తియని మఱికొందఱును జెప్పుదురు. "ఓ వామాక్షీ! ఏపురుషునిని నీవు క్షణకాలము విడిచి సంతసిం

పహో యతనిని మేమేమని పొగడుదుము. యుద్ధరంగమున మొట్టమొదటఁ బ్రాణములు విడిచి నీచే వెదకఁబడు నతఁడెవఁడు? ఓచంద్రవదన! శుభలగ్నసంజాతుఁడై నీచే బలాత్కారముగఁ గౌఁగలింపఁబడుచున్న యతఁడెవఁడు? ఓమదనరాజధాని! తపస్సంపన్నుఁడై నీవు మిక్కిలి ధ్యానించుచున్న యాపురుషుఁడెవఁడు?" అని తాత్పర్యము.

ఇందు రమణ, అన్వేషణ, ఆలింగనరూపములయిన కాముక విషయ వ్యాపారములు కాముకి కనేక జారగతమైన యభిలాషమును బోధించుచున్నవి. గావున నియ్యది బహుపురుషాసక్తిరూపమైన శృంగార రసాభాసము.

## భావాభాసము.

"రాకాసుధాకరముఖీ తరళాయతాక్షీ
సాస్మేరయౌవన తరంగిత విభ్రమాంగీ
తత్కిం కరోమి విదధే కథ మత్ర మైత్రీం
తత్స్వీకృతి వ్యతికరే క ఇవాభ్యుపాయః."

తా॥ సీత నుద్దేశించి రావణుని వచనము. ఆసీత పున్నమనాఁటి చందురునిబోలు మోము గలదియు, చంచలములును, దీర్ఘములునైన నేత్రములుగలదియునై, కొంచెముగా వికసించిన యౌవనముచే నంగవిలాసములు గలదియై యొప్పుచున్నది. నేనీపెను బొంద నేమి యుపాయమొనర్తును. ఆమెయందు నాకెట్లు నెయ్యము చేకూరును? "ఇతఁడు నావాఁడని" యాయింతిచే ననిపించుకొన నెద్ది మార్గము? అని తాత్పర్యము.

ఇందు "ఆదౌవాచ్యస్త్రియోరాగః పశ్చాత్పుంసస్త. దింగితైః॥ ముందు స్త్రీ ప్రేమింప ననంతరము పురుషుఁడను రక్తుఁడు గావలయున"ని యౌచిత్యముండఁగా అననురక్తయైన సీతా విషయకమైన రావణుని చింత భావాభాసమగుచున్నది. ఇందు వ్యభిచారియైన చింత ప్రధానముగ వ్యంగ్యమగుటచే నిది భావాభాసమే. ఇట్లే రసాంతరాభాస భావాంతరాభాసముల నూహించునది.

—♦ భావశాంత్యాదులు. ♦—

రస, భావ, తదాభాస నిరూపణానంతరము క్రమప్రాప్తములయిన భావశాంత్యాదులు వివరింపఁబడుచున్నవి.

ఒక భావము గలుగుచుండఁగా మున్నున్న భావమడంగుట భావశాంతి. మఱియొక భావము గలుగుట భావోదయము. భావములలో నొకటి యడఁగుచు నొకటి పొడముచు నుండుట భావసంధి. అనేక భావములు కలియుట భావశబలత. వీనికిఁ గ్రమముగా నుదాహరణములు.

—♦ భావశాంతి. ♦—

"తస్యాః సాంద్రవిలేపనస్తనతట ప్రశ్లేష ముద్రాంకితమ్,
కిం వక్షశ్చ రణానతి వ్యతికర వ్యాజేన గోపాయ్యతే
ఇత్యుక్తేక్వత దిత్యుదీర్యసహసా తత్సం ప్రమార్ష్టుం మయా,
సాశ్లిష్టారభసేన తత్సుఖవశా త్తన్వ్యాచ తద్విస్మృతమ్॥"

అమరుకశతకము.

తా॥ ధృష్టనాయకుఁడు ఖండిత స్వనాయికకుఁ గలిగిన

కోపమును, దచ్ఛాంతి ప్రకారమును, స్వమిత్రునకుఁ దెలుపు చున్నాఁడు. స్నేహితుఁడా! "రోమ్ము ఆనాసవతియొక్క చందనసిక్తమైన స్తనప్రదేశ సంబంధముచే ముద్రితమైయున్నది. పాదప్రణామవ్యాజమున నేల దానిని దాఁచుచున్నావు?" అని ఖండిత నాయిక పలుకఁగా, నేను అది యెక్కడనని వెంటనే దానిని దుడిచివేయ నాకాంతను సంభ్రమముతోఁ గౌఁగిలించితి. తత్క్షణమే యాకామిని సుఖవిశేషమువలన నాకోపమును మఱచిపోయెను. అని తాత్పర్యము.

ఇందు ఖండిత నాయికకుఁ బ్రథమము కోపము గలిగి మరల ప్రసాదముదయించెను. ఇచ్చటఁ గోపాభావరూపమైన భావశాంతియందే చమత్కారిత గలదు. గావున నిది భావశాంతి యనఁబడును. ఎచ్చట దేనివలనఁ జమత్కార ముదయించునో దానినిబట్టియే వ్యవహారము లోకప్రసిద్ధము.

—♦ భావోదయము. ♦—

"ఏకస్మిన్శయనే విపక్షరమణీ నామగ్రహే ముగ్ధయా,
సద్యఃకోపపరిగ్రహగ్లపితయా చాటూనికుర్వన్నపి,
ఆవేగా దవధీరితః ప్రియతమస్తూష్ణీం స్థిత స్తత్క్షణాం,
మాభూత్సుప్త ఇవేత్యమందవలిత గ్రీవం పునర్వీక్షితః॥"

తా॥ నాయికానాయకులొక్క శయ్యయందుఁ బరుండియుండ నాయకుఁడు సపత్నీనామగ్రహణ మొనరించెను. తత్క్షణమే నాయిక ప్రణయకుపితయై దుఃఖించుచుండెను. అప్పుడు ప్రియుఁడు ప్రమాదమువలన సవతిపేరెత్తితిఁ గాని, యాసక్తి

వలనఁ గాదని మెన్ని చాటూక్తులు బలికియుఁ గోపావేగముచే నాయికా తిరస్కృతుఁడై యూఱకుండె. నాయిక మనసు నిలుపలేక 'ఇతఁడు నిద్రించునేమో' యని మెడఁద్రిప్పి చూచెనని తాత్పర్యము.

ఇచ్చట ముందు నాయికకుఁ గోపముదయించి మరల తచ్ఛాంతిపూర్వకమైన సురత విషయ కౌత్సుక్య ముదయించు చున్నది. అదియు చమత్కారకారి గావున నియ్యది భావోదయ మనఁబడును.

—♦ భావసంధి. ♦—

"ఉత్సిక్తస్య తపః పరాక్రమనిధే రభ్యాగమాదేకతః,
సత్సంగ ప్రియతా చ వీరరభసోత్ఫాలశ్చమాం కర్షతః,
వైదేహీ పరిరంభ ఏష చ ముహుశ్చైతన్య మామీలయన్
ఆనందీ హరిచందనేందు శిశిరః స్నిగ్ధోరుణద్ధ్యన్యతః"

మహావీరచరిత నాటకము.

తా॥ సీతాలింగన తత్పరుఁడగు శ్రీరాముఁడు పరశు రామాగమన సమయమునఁ జెప్పు మాట. తపఃపరాక్రమము లకు నిధియై యహంకృతుఁడై యున్న యీపరశురాముని రాక వలన సత్సంగప్రీతియు, వీరరసోత్సాహాతిశయమును, నొక ప్రక్క నన్ను లాగుచున్నవి. ఈసీతాలింగనము మాటిమాటికి జ్ఞానమును విషయాంతర వ్యావృత్తముగఁ జేయుచు, హరిచం దన చంద్రులరీతిని శీతలమై స్నిగ్ధమై యానందింపఁజేయుచు నొక ప్రక్క నన్నడ్డగించుచున్నదని తాత్పర్యము.

ఇచ్చటఁ బూర్వార్ధమునఁ బరశురాముని రాకనుగూర్చిన రూదరాతిశయముచే గమ్యమైన త్వరావిశేషమును, ఉత్తరార్ధమున సీతాలింగనవిషయకమైన హర్షమును సమకాలమే చమత్కృతిజనకములగుచున్నవి గావున నావేగహర్షములకు భావసంధి యనఁబడును.

## —♦ భావశబలత. ♦—

"క్వాకార్యం, శశలక్ష్మణః క్వచకులం, భూయోపి దృశ్యేతసా,
దోషాణాం ప్రశమాయనః శ్రుతమహో, కోపేపికాంతం ముఖం,
కింవక్ష్యంత్యపకల్మషాః కృతధియః, స్వప్నేపి సాదుర్లభా,
చేతః!స్వాస్థ్యముపైహి, కః ఖలుయువా ధన్యోఽధరంధాస్యతి॥"

విక్రమోర్వశీయము.

తా॥ పురూరవసుఁ డూర్వసినిఁగాంచి చెప్పెడి వచనము. అకార్యమెక్కడ, చంద్రవంశ మెక్కడ. ఆభామిని మరల గనఁబడునా? దోషములు పోఁగొట్టుకొనుటకు గదా మనచదువులు. అక్కటా! కోపమునందుఁగూడ నాకాంత మోమెంత రమణీయమై యున్నది. సత్పురుషు లేమందురోసుమా. ఆ యింతి స్వప్నమునందైన దుర్లభయే, చిత్తమా! స్థిరపడుము. ఏయువకుఁడు ఆకలికి యధరామృతమును గ్రోలునోగదా. అతఁడెంత ధన్యుఁడు. అని తాత్పర్యము.

ఇచ్చటఁ బురూరవసున కూర్వశియందు మోహమును, చంద్రవంశసంభూతున కది యకార్యమనుభావనయు, మరల నూర్వశీవిషయకమైన యనురాగమును జ్ఞానబలిమిచేఁ దచ్ఛాం

తియుఁ, గ్రమముగా వర్ణింపఁబడియున్నవి. ఇట్లు మున్ముందుఁ బుట్టిన భావముల నణఁగించుచు నుత్తరోత్తరభావములు చమత్కారజనకములగుటంబట్టి భావశబలత యిందు వర్ణింపఁబడియున్నది. అందు మొదటిభావము శాంతరససంచారియైన వితర్కము. దాని నడంచుచు శృంగార సంచార్యౌత్సుక్య ముదయించెను. మరల దానినడంచుచు శాంతరససంచారి మతి గలిగెను. దానికి బాధకముగ శృంగారసంచారి స్మరణము పొడమెను. దానికి బాధకముగ శాంతసంచారి శంకయు, దానికి బాధకముగ శృంగారసంచారి దైన్యమును, దానికి బాధకముగ శాంతసంచారి ధృతియు, దానికి బాధకముగ శృంగార సంచారి చింతయుఁ, గ్రమముగాఁ బొడముచున్నవి. గావున నిందు వితర్కౌత్సుక్య, మతి, స్మరణ, శంకా, దైన్య ధృతి చింతలకు శబలత్వ మరయవలయును.

## —♦ భావప్రాధాన్యము. ♦—

కావ్యములయందు రసమే ముఖ్యమైనను, రాజానుగత వివాహప్రవృత్త భృత్యునివలె [భృత్యుఁడు తన వివాహసమయమున నెట్లు రాజుచే ననుగమింపఁబడునో యట్లు] నొకప్పుడు భావశాంత్యాదులును, బ్రాధాన్యమును బొందుచున్నవి. అనఁగా, ఎచ్చట విభావాదులచే వ్యంగ్యమైన స్థాయీభావాంశ ముత్కృష్టమై యాస్వాదమును గలిగించునో, యందు రసధ్వని యనియు, ఎచ్చట వ్యభిచారిభావ ముత్కృష్టమై యాస్వాదమును గలిగించునో యందు భావధ్వని యనియు నిష్కర్షము.

### — సంలక్ష్యక్రమ వ్యంగ్యము. —

అసంలక్ష్యక్రమ వ్యంగ్యములయిన రస, భావ, తదాభాస, తచ్ఛాంత్యాదులు వివరింపఁబడిన యనంతరము సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని నిరూపింపఁబడుచున్నది.

"అనుస్వానాభ సంలక్ష్యక్రమ వ్యంగ్యస్థితిస్తుయః,
శబ్దార్థోభయశక్త్యుత్థః త్రిధాసకథితోధ్వనిః॥"

అనుస్వానాభ సంలక్ష్యక్రమ వ్యంగ్యస్థితియైన (అనఁగా ఘంటను వాదించునప్పుడెట్లు శబ్దము తెరతెరలుగా మ్రోఁగుచుండునో యట్లు వ్యంజకశబ్దమునకును దదర్థమునకును గలుగు ప్రతీతియందుఁ బౌర్వాపర్యక్రమము స్పష్టముగాఁ గన్పట్టునదియైన) సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము, శబ్దార్థోభయశక్తిమూలము నని మూఁడువిధములు. అందు,

### — శబ్దశక్తిమూలధ్వని. —

అలంకారముగాని, అలంకారములేక వస్తుమాత్రముగాని, యెచ్చట శబ్దమువలనఁ బ్రధానముగను, (చమత్కారజనకముగను,) వ్యంగ్యములగుచున్నవో యదియ శబ్దశక్తిమూలమైన సంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని యనఁబడును. అది శబ్దశక్తిమూలాలంకారధ్వని యనియు, శబ్దశక్తిమూల వస్తుధ్వని యనియు, రెండువిధములుగాఁ జెప్పఁబడును.

### — శబ్దశక్తి మూలాలంకారధ్వని. —

"ఉల్లాస్యకాల కరవాల మహాంబువాహం

దేవేన యేన జరఠోర్జిత గర్జితేన
నిర్వాపితః సకల ఏవ రణోంపూరాణాం
ధారాజలై స్త్రిజగతి జ్వలతి ప్రతాపః॥"

తా॥ ఇచ్చట రాజవర్ణనపరమైన యర్థమొకటియు, మేఘవర్ణనపరమైన యర్థమొకటియుఁ గలదు. రాజవర్ణనపరమైన యర్థము ప్రాకరణికము. మేఘవర్ణనపరమైన యర్థము అప్రాకరణికము. అందు,

"కఠోరముగ సింహనాద మొనర్చెడి రాజు వైరిసంహారకమైన ఖడ్గమునందు ధారాజలప్రసరణము నతిశయితముగాను, తీక్ష్ణముగాను నొనర్చి ముల్లోకమునందుఁ బ్రసిద్ధిఁజెంది శత్రువుల ప్రతాపవహ్నినంతయు యుద్ధమునందు ఖడ్గధారాజలములతోఁ జల్లార్చె" నని ప్రాకరణికార్థ తాత్పర్యము.

"మేఘాధిపతియైన యింద్రుఁడు గంభీరమయిన గర్జనతోఁగన్పట్టెడి వర్షర్తుసూచకమైన బాలమేఘమును వెల్లడిచేసి రణంము (అగ్గి మొదలగు వానియందు నీరు పోయునప్పుడు గలిగెడి చిటచిటశబ్దము) గలుగునట్లుగా ధారారూపమైన వర్షజలముతో ముజ్జగంబునఁగల జలశత్రువులయిన తేజస్సుల వేడిమినంతయుఁ జల్లార్చె" నని యప్రాకరణికార్థ తాత్పర్యము.

అభిధాశక్తి ప్రాకరణికార్థమును బోధించి సంయోగాదులచే నియంత్రితముకాఁగా అప్రాకరణికార్థమును వ్యంజనాశక్తియే బోధించునని మున్నే నిరూపింపఁబడియె. కావున నిందు రాజపరమైన యర్థమును అభిధాశక్తియు, మేఘపరమైన యర్థ

మును వ్యంజనాశక్తియు బోధించుచున్నవి. అనంతరము వా చ్యార్థమునకును, వ్యంగ్యార్థమునకును, అసంబద్ధత్వము గలుగఁ గూడదని ప్రాకరణికా ప్రాకరణికార్థములకు ఉపమానోప మేయభావము కల్పింపఁబడుచున్నది. ఇదియు వ్యంజనాగమ్య మే. మఱియు నిందు వస్తురూపమయిన యప్రాకరణికార్థము వ్యంగ్యమే యయినను, వ్యంగ్యమగు నుపమానోపమేయ భా వమే చమత్కారి గావున శబ్దశక్తిమూలాలంకారధ్వని యనియే దీనిని వ్యవహరింపవలయునని ప్రాచీనుల యభిప్రాయము. గాని నవీనులు, ఇచ్చట ద్వితీయార్థముగూడ వాచ్యమేగాని వ్యంగ్య ముగాదనియు, నేదేని యొకచోటఁ బ్రాకరణికా ప్రాకరణికార్థ ములకుఁ గల్పించెడి యుపమానోపమేయభావము మాత్రమే వ్యంగ్యమనియు, ఉపపాదించెదరు. ఇవ్విషయమునఁగల ప్రా చీన నవీనోపపాదనల నిందుఁ గొంచెము వివరింతము.

## —♦ ప్రాచీనులు. ♦—

"అనేకార్థకమైన శబ్దమును వినినవెంటనే సంకేతజ్ఞాన మన్నింటియందును సమానమగుటవలన అర్థములన్నియు మన స్సునకుఁ బొడకట్టుచున్నవి. అనంతరమీ శబ్దమునకే యర్థము నందుఁ దాత్పర్యమని సందియముగలుగఁ దాత్పర్య నిర్ణాయక ములయిన ప్రకరణాదులఁ బరికించు పురుషునకుఁ దన్నిర్ణయమే ర్పడుచున్నది. తాత్పర్య నిశ్చయముగల పదజ్ఞానమువలన నేర్ప డిన మొదటి పదార్థోపస్థితికి వలెనే, "పదార్థోపస్థితే రనంతర మన్వయబోధః" పదార్థము లన్నియు బోధపడిన యనంతరము

అన్వయబోధము గలుగునను న్యాయముంబట్టి, నానార్థకశబ్ద మునకు రెండవపదార్థోపస్థితియు నేల విషయముకాఁగూడదని పురుషునకు సంశయము గలుగుచున్నది. ఆ సంశయమును దొలఁగించుటకై ప్రకరణాది జ్ఞానమును, దానికి సంబంధించిన తాత్పర్యనిర్ణయమును, రెండవ పదార్థోపస్థితికిఁ బ్రతిబంధకములని చెప్పవలెను. ఇట్లు ప్రతిబంధకత్వము కల్పింపకుండిన శాబ్దబోధముగూడ నానార్థవిషయకము గావలసియుండును. కావుననే "అనవచ్ఛేదే విశేషస్మృతి హేతవః" అని చెప్పఁబడియున్నది. ఏకార్థమాత్రవిషయకమైన జ్ఞానము విశేషస్మృతి యనియు, తాత్పర్యసందేహ మనవచ్ఛేదమనియుఁ జెప్పఁబడును. అందువలననే "సురభిమాంసమును భక్షించుచున్నాఁడు." ఇత్యాది వాక్యములనుండి గవాది పదార్థముల కుపస్థితిలేనందున రెండవ యర్థము స్ఫురింపఁజాలదు. కాఁబట్టి యట్టి స్థలములయందు అనివార్యముగాఁ దోఁచునటువంటి ద్వితీయార్థప్రతీతి తప్పక వ్యంజనా వ్యాపారవిషయమే యని చెప్పవలయును.

మొదట ఒక యర్థ మొకశక్తిచేతఁ బ్రతీతముకాఁగా రెండవ యర్థముగూడ రెండ శక్తిచేతనే యుపస్థితమగుచున్నది. ఇందుకై వ్యంజనావ్యాపార మనవసరమనియు రెండవ యర్థము వ్యంజనాగమ్యము గాదనియుఁ, బ్రశ్నింపవచ్చును. గాని ప్రతిబంధకమయిన ప్రకరణాది జ్ఞానముండు నంతవఱకది పొసఁగదు. ప్రతిబంధకజ్ఞాన ముండినను రెండవ యర్థము రెండవ శబ్దశక్తి చేతనే స్ఫురించునందువా యవాఁకరణికార్థముగూడఁ బ్రాకరణి

కార్థోపస్థితియుండే విషయము గావలసియుండును. అది యసమ్మతముగదా? అట్లయినఁ బ్రకరణాదిజ్ఞానము పదార్థోపస్థితి సామాన్యమునకుఁ బ్రతిబంధకమగుటవలన రెండవయర్థము వ్యంజనావ్యాపారముచేత మాత్ర మెట్లు ప్రతీతమగును? అని ప్రశ్నింపవచ్చును గాని, యయ్యది ధర్మిగ్రాహకమానముచేత అప్రాకరణికార్థోపస్థాపకముగనే కల్పింపఁబడుచున్నది. (ధర్మిగ్రాహకమానమనఁగా, ధర్మికల్పనముతోఁగూడ తత్సంబంధి ధర్మకల్పనము చేయునట్టి ప్రమాణము. వ్యంజనా కల్పనతోఁగూడ ద్వితీయార్థబోధకత్వరూప ధర్మముగూడఁ గల్పింపఁ బడునని యర్థము.) కావునఁ బైయాశంక నిరాధారము. వీని నన్నింటిని మనస్సునందుంచుకొనియే "అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే। సంయోగాద్యైరవాచ్యార్థ ధీకృద్వ్యాపృతిరంజనమ్॥" అని చెప్పఁబడియున్నది. ఇతరార్థమును స్ఫురింపకుండఁ జేయుటయే నియంత్రణమని ప్రాచీనాలంకారికులలోఁ గొందఱనుచున్నారు.

మఱికొందఱు నానార్థకశబ్దములనుండి గలుగు శాబ్దబోధమునందుఁ దాత్పర్య నిర్ణయ హేతుత్వమును అవశ్యము కల్పింపవలసి యుండుటచేత మొదట శబ్దమునుండి నానార్థములు స్ఫురించినను, తాత్పర్య హేతువులగు ప్రకరణాదులచేఁ దాత్పర్యనిర్ణయము సంభవింప నేయర్థమునందుఁ దాత్పర్యముండునో యాయర్థముననే యన్వయ బోధము గలుగుచున్నది. గాని, యితరార్థమునకుఁ గలుగదను పద్ధతి నంగీకరింతు మేని,

ఏకార్థమాత్ర విషయక స్మృతి నపేక్షించుటగాని, మఱియొక యర్థము తోఁచకుండఁ బ్రకరణాదులకుఁ బ్రతిబంధకత్వమును గల్పించుటగాని, యనవసరము. ఇఁక నానార్థకస్థలమునఁ బ్రకరణాది జ్ఞానాధీనమైన తాత్పర్యనిర్ణయముచేతఁ బ్రాకరణికార్థమునకు శాబ్దబోధము గలిగిన పిదప అదేశబ్దమునుండి తాత్పర్య విషయముకానట్టి మఱియొక యర్థమునకు శాబ్దబోధము గలుగుచున్నదిగదా? అది యేశబ్దవ్యాపారముచేత సాధింపఁబడును? వ్యంజనా వ్యాపారముచేతనేగదా? ఇది యభిధా వ్యాపారవిషయమనుట వెఱ్ఱిమాట. అభిధావ్యాపారముచేత నేర్పడిన యర్థమునకు శాబ్దబోధము గలుగుటనుగూర్చి తాత్పర్యనిర్ణయముండవలయును. అది యీరెండవ యర్థవిషయమున నెక్కడిది. వ్యంజనాగమ్యమైన యర్థమునకు శాబ్దబోధము గలుగవలయుననినఁ దాత్పర్యనిర్ణయ మపేక్షింపఁబడదు. అట్లు ప్రకరణాది జ్ఞానము ఇతరార్థోపస్థితికిఁ బ్రతిబంధకము కానప్పుడు సంయోగాదులచేత ననేకార్థకశబ్దమునకు వాచకత్వము నియంత్రింపఁబడునని చెప్పుట యెట్లు సంగతమగును? ఏకార్థమాత్రవిషయక స్మృతి శాబ్దబోధమునం దపేక్షింపఁ బడకుండునేని "విశేషస్మృతి హేతవః" అని చెప్పు ప్రాచీనుల యభిప్రాయ మెట్లుసరిపడును?

చెప్పెదు వినుము. స్మృతిశబ్దమునకు నిశ్చయమనియు, విశేషస్మృతి యనినఁ దాత్పర్యనిర్ణయమనియు, సంయోగాదులచేత వాచకతా నియంత్రణమనిన, ఏకార్థమాత్రవిషయక తాత్పర్యనిశ్చయమును గలిగించుచు, శాబ్దబోధమున కనుకూల

ముగా నుండుటయనియు, గ్రహింపవలయును. తాత్పర్యమున కు విషయముకానిదే యవాచ్యార్థము. ఇట్లు అర్థమును గ్రహించుచో ప్రాచీనగ్రంథాదుల కసంగతి యుండదని చెప్పుదురు.

మఱికొందఱు ప్రకృతార్థము బోధపడిన తరువాత నట్టి పదజ్ఞానము నశించుటచేత వ్యంజనావాది సహితమర్థాంతరము నెట్లు సులభముగ నుపపాదింపఁగలఁడు? అని శంకింతురు. అందుకుఁ గొందఱు ప్రథమార్థబోధానంతరము పదజ్ఞానము నశించినను, అర్థబోధకమైన వ్యాపారము ఉండుటవలన నర్థాంతర ప్రతీతికి బాధకముండదని పలుకుచున్నారు. మఱికొందఱు అర్థప్రతీతియందు శక్యతావచ్ఛేదకము వలెనే పదముగూడ విశేషణరూపముతో గోచరించుచుండుటవలనఁ బ్రాథమిక, శక్యార్థబోధమే పదజ్ఞానమని చెప్పుచున్నారు. అనఁగా మొదటి యర్థము తోఁచునపుడు ఆప్రతీతియందు శక్యతావచ్ఛేదకమును, బదజ్ఞానమును, విశేషణరూపముగ గోచరించుటచేత నాప్రతీతి పదజ్ఞానరూప మగుచున్నదనియు, అట్టి పదజ్ఞానము నశింపకుండుటచేత రెండవ యర్థము బోధపడుటకు బాధకముండదనియు. వీరి యభిప్రాయము. పదము నావృత్తిచేసికొనుచోఁ బదజ్ఞానము సులభమని యింకొకని యభిప్రాయము.

మొత్తమునకు నానార్థక స్థలమునందు శబ్దము పరివృత్తిని సహింపదు. కాఁబట్టి యాదలి యనురణనీయమైన వ్యంజనము శబ్దశక్తిమూలమని ధ్వనికారు ననుసరించు ప్రాచీనుల యభిప్రాయమై యున్నది.

—♦ నవీనులు. ♦—

నానార్థకశబ్దమునుండి యనేకార్థములు గోచరించినను, ప్రకరణాది జ్ఞానాధీనమైన తాత్పర్యజ్ఞానమహిమచేతఁ గావలసిన యర్థమునకు మాత్రము శాబ్దబోధము గలుగుచుండ నిందునకై శాబ్దబోధమునందు ఏకార్థమాత్ర విషయకమయిన యుపస్థితి యపేక్షింపఁబడుచున్నదనుట సారములేని మాట. అది గాక ద్వితీయార్థమునుగూడఁ దెలియఁజేయు పదజ్ఞానముండుట వలన రెండవ యర్థముగూడ స్ఫురించుచుండఁగా నొక్క యర్థము మాత్రమే యుపస్థితము కావలెనని కోరుటకుఁ బ్రమాణమేమి? ప్రకరణాది జ్ఞానమును, దదధీనమైన తాత్పర్యజ్ఞానమును, ప్రతిబంధకముగా నుండుటవలన రెండవ యర్థము స్ఫురింపదందువా? సంస్కారమును, దముద్బోధకము నుండునపుడు ఎచ్చటఁగాని స్మృతికిఁ బ్రతిబంధకత్వము కనఁబడుటలేదు. కాఁబట్టి నీవట్లు చెప్పుట యుక్తముగాదు. ఇచ్చట మాత్రము స్మృతికిఁ బ్రతిబధ్య ప్రతిబంధకభావము కల్పించుకొందుమనుటయు సరిపడదు. అట్టి కల్పనము నిష్ఫలమగుటయేగాక యనుభవ విరుద్ధముగూడ నగును. అది యేలాగనిన,

నానార్థములకు సంబంధించిన శక్తినిఁగూర్చి దృఢమగు సంస్కారముగల మానవులకుఁ బ్రకరణాది జ్ఞానముండినను, "పయోరమణీయ" మ్మిత్యాది వాక్యమునుండి మొట్టమొదట రెండర్థములకుఁ బ్రతీతి కలుగుట యెల్లరకుఁ దెలిసినదే. కావుననే "పయోరమణీయ" మను వాక్యమును అకస్మాత్తుగ వినిన

ప్రకరణజ్ఞులు ప్రకరణజ్ఞానములేని మూర్ఖులకు ఈవాక్యమున కుఁ బాలయందే తాత్పర్యముగాని జలమునందుఁ గాదని వక్త యొక్క తాత్పర్యమును దెలియఁజేయుచున్నారు. అనేకార్థక శబ్దములనుండి గలిగెడి రెండవ యర్థప్రతీతికిఁ బ్రకరణజ్ఞానము ప్రతిబంధకమే యగునెడల ఏల ప్రకరణజ్ఞులు జలతాత్పర్యమును నిషేధింతురు? జలమునందు శబ్దమునకుఁ దాత్పర్యమే లేదుగదా. కాఁబట్టి ప్రకరణాది జ్ఞానము రెండవయర్థము తోఁచుట కడ్డుప డుననుట వెఱ్ఱిమాట.

మఱియుఁ బ్రకరణాదిజ్ఞానముచేతఁ బ్రాకరణికార్థము తాత్పర్యవిషయముగ నిర్ణీతముకాఁగా దానికి శాబ్దబోధము గలిగిన తరువాతఁ దాత్పర్యవిషయము కానట్టి మఱియొక యర్థ ము స్ఫురించుచు నది వ్యంజనావ్యాపారమునకు విషయమగుచు న్నదని చెప్పుచున్నావుగదా? అదేమి నానార్థస్థలమునం దంతట వ్యంజనావ్యాపార ముల్లసించునా? లేక యేదో యొక్కయెడ మాత్రమేనా? ఇందు మొదటిపక్షము సంగీకరింపుమేని యిట్లు ప్రాకరణికా ప్రాకరణికార్థముల కంతట శాబ్దబోధ మంగీకరింపఁ బడునప్పుడు విశేషముగఁ దాత్పర్యజ్ఞానమునకుఁ గారణత్వ మును గల్పించుటవలనఁ బ్రయోజనమేమి? అట్లుగాక "శక్తివలనఁ గలిగెడి శాబ్దబోధమునుగూర్చి తాత్పర్యజ్ఞానమునకు నిమిత్తత్వ మును గల్పించుకొనుచున్నాము. వ్యంజనా వ్యాపారజన్యమైన శాబ్దబోధము తాత్పర్యజ్ఞానములేనిదే గలుగుచున్నది. వ్యంజనా జన్యమైన శాబ్దబోధమునందు శక్తి జన్యత్వమును నివారించుటకై

తాత్పర్యజ్ఞాన కల్పన మావశ్యక"మని చెప్పుదువా? అదియు సరికాదు. తాత్పర్యవిషయముకాని యర్థబోధముగూడ సార్వత్రికమైనప్పుడది శక్తిజన్యమైనంత మాత్రమున బాధకమేమి?

"నానార్థకశబ్దమునుండి రెండర్థము లుపస్థితములుకాఁగాఁ బ్రకరణాదులచే నొక్కయర్థమందే తాత్పర్య నిశ్చయముండుట వలన నాయర్థమునకే మొదట శాబ్దబోధము గలుగుచున్నది. గాని రెండవయర్థమునకుఁ గలుగద"ను నియమమును రక్షించుటకై శక్తివలనఁ గలిగెడి యర్థముయొక్క శాబ్దబోధమునందుఁ దద్విషయక తాత్పర్యజ్ఞాన మపేక్షింపఁబడుచున్నది. లేనియెడల తాత్పర్యవిషయముగ నిశ్చితమైన యర్థమునకుంబోలెఁ దాత్పర్యవిషయముకాని యితరార్థమునకుఁగూడ మొదటనే శాబ్దబోధము గలుగును. తాత్పర్యవిషయమైన యర్థము బోధపడిన పిమ్మటఁ దాత్పర్యవిషయముకాని యితరార్థమునకు శాబ్దబోధము గలుగుట నాకును సమ్మతమే. కాఁబట్టి తాత్పర్యవిషయార్థబోధమునందు శక్తి జన్యత్వము నివేశింపఁబడుచున్నది." అని పలుకుటయు మిక్కిలి యనుచితము. ఏలయనఁగా, "సోవ్యాదిష్టభుజంగహారవలయ స్త్వాం సర్వదోమాధవః" సమస్తము నిచ్చువాఁడును, సర్పభూషణుండునైన యా యుమాధవుఁడు (పార్వతీపతి) నిచ్చలు నిన్నుఁ గాపాడుఁగాక. "కాళియమర్దనాది వేళలయందు భుజంగభూషణుండై సమస్తమును కృపసేయు నా మాధవుఁడు (కృష్ణుఁడు) సదా నిన్ను రక్షించుఁగాత" మను నితాద్వ్యర్థము నిచ్చు శ్లేషకావ్యములయందు వలెనే యిందుఁ

గూడఁ బ్రకృతా ప్రకృతార్థములకు శాబ్దబోధము నంగీకరిం చుటవలనఁ గీడు లేదుగదా?.

మఱి యిచ్చట దృష్టాంతమునందు రెండర్థములయందును బ్రకరణాది సామ్యమునుబట్టి తాత్పర్యజ్ఞానముండుటవలన నొ క్కసారియే రెండర్థము లుపస్థితము కావచ్చును. గాని దార్ష్టాం తికము నందొక్క యర్థమునందు మాత్రమే ప్రకరణాది జ్ఞానా ధీన తాత్పర్యజ్ఞాన ముండుటనుబట్టి రెండర్థము లొక్కసారి యుపస్థితములు కాఁజాలవని పలుకఁగూడదు. తాత్పర్యజ్ఞాన మర్థోపస్థితిని గూర్చి కారణమే కాదనునప్పుడు రెండర్థము లొక్కసారి బోధపడవని యుక్తిని గల్పించుట యొప్పని త్రోవ. ఒకవేళఁ దాత్పర్యజ్ఞానమునకు హేతుత్వము సిద్ధించియుండిన నిట్లు పలుకనగునేమో. అట్లయినఁ దాత్పర్యజ్ఞానమునకు మఱి యెచ్చట నుపయోగముండునని ప్రశ్నింపవచ్చును. చెప్పెద వినుము. ఈయర్థమునందీ శబ్దము ప్రమాణము. ఈయర్థము ప్ర మాణవేద్యము. ఇత్యాది నిర్ణయములయందుఁ బ్రవృత్త్యాదు లకుఁ దాత్పర్యజ్ఞాన ముపయోగిగా నుండునని గ్రహింపుము.

తుదకు నానార్థకస్థలమునఁ దాత్పర్యజ్ఞానమునకు హే తుత్వము తొలఁగఁగా అతాత్పర్యార్థబోధమును సంపాదించు టకై వ్యంజనావ్యాపారము నాశ్రయించుట యుక్తము. తా త్పర్యవిషయముగాని రెండవయర్థముగూడ శక్తివలననే బోధిం పఁబడుచున్నదని యేర్పడుచున్నది.

ఏదేని ఒక్కయెడ మాత్రమే నానార్థస్థలమున వ్యంజన

ముల్లసించునను రెండవదే సమ్మతమందువా, అందుకు నిమిత్త మేమి? వ్యంజనా వ్యాపారముచేఁ గలిగెడి శాబ్దబోధమునందుఁ దాత్పర్యజ్ఞానమునకుఁ గారణత్వము నీవంగీకరించుటవలన వ్యంగ్యార్థవిషయమైన కవి తాత్పర్యజ్ఞాన మందుకు నిమిత్తమనుటయు నెట్లనఁగా. మఱియు, అశ్లీలదోషస్థలమున సకలానుభవసిద్ధమైన ప్రాకరణికార్థమునందుఁ గవి తాత్పర్యమే లేకుండుటవలనఁ దాత్పర్యజ్ఞానమునకుఁ జెప్పెడి హేతుత్వము వ్యభిచారదోష దూషితము. (లక్షణ ముండవలసిన లక్ష్యమునందు లక్షణము లేకపోవుట వ్యభిచారమనఁబడును.)

"ఇఁక వ్యంజనా వ్యాపారమును బ్రకాశింపఁజేయుటకు వినువాని శక్తివిశేషమే కారణము. అన్యాది ఫలాంశమునుబట్టి చమత్కారమును గలిగించు నర్థవిషయముననే వ్యంజనను బ్రకాశింపఁజేయును. గాని యితరార్థవిషయమునఁ గాదని చెప్పి వ్యంజనా వ్యాపారమేదో యొక్కచోట మాత్రమే యుల్లసించుటసిద్ధమైనదని చెప్పఁగూడదు. అట్లు వినువాని శక్తివిశేషము వ్యంజనావ్యాపారమునకుఁ బ్రకాశకమనుటకంటెఁ బ్రకరణాదులచే నియంత్రితమయిన యభిధయే ప్రకాశకమనుట యుక్తము గదా? ఏల నానాస్థలమున వ్యంజనావ్యాపారము గల్పింపవలయును.? మఱి "ఉల్లాస్యకాల కరవాల మహాంబువాహమ్" మొదలగు నానావ్యంజనాస్థలంబున రెండవయర్థమునకు సంబంధించిన శక్తిజ్ఞానమే లేనట్టియు, లేక అట్టి శక్తిజ్ఞానము మఱచినట్టి పురుషునకు వ్యంజనావ్యాపారముచేత రెండవ యర్థము

గోచరింపకయే యుండుటవలన నందు రెండవ యర్థమునకు వ్యక్తిచేఁ బ్రతీతి నెట్లు వారింపఁగల్గుదువు?.

ఇదిగాక "ఏశబ్దమునుండి యేయర్థము వ్యంగ్యమగుచున్న దో యాశబ్దమునకుఁ దదర్థమైన శక్తిజ్ఞానమే వ్యంగ్యార్థప్రకాశక మగుచున్నద"నియుఁ జెప్పనొప్పదు. అట్లు చెప్పుపక్షమున 'నిఃశే షచ్యుత చందనమ్' అను పద్యమునందు రమణరూపార్థము వ్యంగ్యము గాకపోవును. అధమపదమెక్కడను రమణరూపార్థ మును బోధింప శక్తముగాదుగదా? ఒకవేళ రమణరూపార్థము నందధమ పదమునకు శక్తిగ్రహమే యుండుపక్షమున దానికి వ్యంగ్యత్వమును సంపాదించుట వ్యర్థమేయగును. మఱియు "నానార్థస్థలమున శక్తి నియంత్రింపఁబడుచున్నది. కాఁబట్టి శక్తిజ్ఞాన మప్రయోజకము. అందువలన వ్యంజనను గల్పింపవలసిన యవ సరముండును. అందుచే నానార్థస్థలమునందు మాత్రమే యిట్టి కార్యకారణభావము కల్పింపఁబడుచున్నద"ని చెప్పుదువేమో కాని యిట్టి యొక క్రొత్త కార్యకారణ భావమును గల్పించుట బరువే యగునుగదా. అని ఈరీతిని నవీనాలంకారికులు నానా ర్థక స్థలమున రెండవయర్థముగూడ శక్తిబోధ్యమనియే చెప్పు చున్నారు.

నానార్థస్థలమున వక్తకుఁ బ్రాకరణికార్థమునందే తాత్ప ర్యముగాని యప్రాకరణికార్థమునందు లేదనుట పిచ్చిమాట. ద్వితీయార్థమునందుఁ దాత్పర్యము లేనివాఁడెన్నఁటికి నానార్థక శబ్దములఁ బ్రయోగించఁడు. అట్లు ప్రయోగించువానికి రెండవ

యర్థముగూడ నెదుటివారికిఁ దోఁచవలయుననియే యభిప్రా యము. ఎచ్చట సాధారణముగా నొక విషయము నుగుఱించి ముచ్చటించునపుడుగాని, చదువునపుడుగాని, వ్రాయునపుడుగాని, యనేకార్థకశబ్దములు ద్వితీయార్థబోధకముగఁ బోడకట్టి మఱియొక యర్థము స్ఫురించునో యచ్చట మాత్రము ద్వితీయార్థ ప్రతీతి వ్యంజనా గమ్యమనుట యుక్తము. మఱి రెండర్థములకును గల్పించెడి యుపమానోపమేయ భావాదులు వ్యంగ్యములు కావచ్చును గాని నానార్థకశబ్దములు ప్రయోగింపఁబడినప్పుడు రెండవయర్థము వ్యంగ్యమనుట యసమంజసము. నానార్థకమనుటచేతనే మొదటి యర్థమువలె రెండవ యర్థముగూడ శక్తిబోధ్యమని యెల్లరకు విదితము గుచుండలేదా? కావున నివ్విషయమున నవీనులే యుక్తవాదులని నాయభిప్రాయము.

ఈప్రసంగము నిఁకఁ జాలింతము. చాలదూరము వచ్చితిమి. ప్రకృతమనుసరింతము....అట్లు ప్రాకరణికాప్రాకరణికార్థములకుఁ గల్పించెడి యుపమానోపమేయ భావరూపమైన యలంకారము శబ్దగతమయిన వ్యంజనాశక్తి నాశ్రయించి వ్యంగ్యమైనది గావున శబ్దశక్తిమూల మనఁబడును. ఇట్లే యలంకారాంతరములకు వ్యంగ్యత నూహించునది.

ఇచ్చట వ్యంగ్యమైన యుపమ యలంకార్యమా? అలంకారమా? అలంకార్యమగుదాని కలంకారత్వమెట్లు? అలంకారము ప్రధానమగుటచేఁ గావ్యమునకు ధ్వనిత్వమెట్లు? అని ప్రశ్నింపవచ్చునుగాని ధ్వనికావ్యములయందు వ్యంగ్యములైన యుప

మాదు లలంకార్యములే యైనను బ్రాహ్మణశ్రమణన్యాయమున వాని కలంకారత్వముగూడఁ బొసఁగుచున్నది. శ్రమణుఁడు బౌద్ధసన్యాసి. బ్రాహ్మణుఁడు శ్రమణుఁడైన యనంతరము శిఖా యజ్ఞోపవీతములు వదిలి కర్మలను విడిచినవాఁడగుటచే నప్పుడతనికి బ్రాహ్మణ్యము లేకున్నను బూర్వకాలిక బ్రాహ్మణ్యమునుబట్టి బ్రాహ్మణశ్రమణుఁడని వ్యవహరించునట్లు అలంకార్యములయిన యుపమాదులకుఁ బూర్వకాలిక వ్యవహారమును బట్టి యలంకారత్వము సిద్ధించుచున్నదని తాత్పర్యము.

—♦ వస్తుమాత్ర వ్యంగ్యధ్వని. ♦—

"పథిక! నాత్రస్రస్తర మస్తి మనాక్ప్రస్తర స్థలేగ్రామే,
ఉన్నత పయోధరం ప్రేక్ష్య యదివససి తదావస॥"

ప్రా॥ ఛా॥

తా॥ ఒక స్వయందూతి, "ద్వ్యర్థైః పదైః పిశునయేచ్చ రహస్యవస్తు" రహస్యమైన విషయమును నానార్థకపదములచే సూచింపవలయునను కామశాస్త్రపద్ధతి ననుసరించి యొక కాముకి పాంథునకు రెండర్థముల పదములతోఁ దన రహస్యవిషయము నుదెలుపుచున్నది. ఓయీ! పాంథుఁడా! మిగుల పాషాణప్రాయమైన యీగ్రామమున శయ్యాసులకుఁ దగిన యాస్తరణమేదియు లేదు. అయినను ఉన్నతపయోధరములను గాంచి యుండఁ దలఁచితివేని యుండుము. అని తాత్పర్యము.

ఇచట గ్రామము పాషాణప్రాయమనుటవలన శాస్త్రజ్ఞానము లేమింజేసి యాకారేంగితజ్ఞులు లేనిదనియు, ఉపభోగ

మున కుదోబ్ధకమైన మేఘోన్నతియు, స్తనోన్నతియుఁ గలది యనియుఁ, బాంథునకు సూచించుచు నుపభోగక్షముఁడవగు దేని యిందు నిలువుమనెడి యంశమును దెలుపుచున్నదను వస్తుమాత్రము వ్యంగ్యమగుచున్నది. ఇదియుఁ బరివృత్త్య సహమైన పయోధరాది శబ్దగమ్యమగుటచే శబ్దశక్తిమూల మనఁ బడును.

## —♦ అర్థశక్తిమూలధ్వని. ♦—

కావ్యములయందు అర్థాంతరవ్యంజకమైన యర్థము స్వతఃసంభవి, కవిప్రౌఢోక్తి మాత్రసిద్ధము, కవి నిబద్ధనాయకాది ప్రౌఢోక్తి మాత్రసిద్ధమని మూఁడువిధములు. లోకప్రసిద్ధమైనది స్వతఃసంభవి. కవిచేఁ జమత్కారానుగుణముగఁ గల్పితమైనది గవిప్రౌఢోక్తి మాత్రసిద్ధము. కవి కల్పితులగు నాయకాదుల మూలమునఁ జమత్కారానుగుణముగఁ గల్పింపఁబడినది కవి నిబద్ధనాయకాది ప్రౌఢోక్తి మాత్రసిద్ధము. ఈమూఁడువిధములైన యర్థము వస్తురూపము, అలంకారరూపమునని మొత్తమాఱు విధములు. ఇట్లాఱువిధములైన యీయర్థముచే వ్యంగ్యమగు నర్థముగూడ వ్యంజకార్థమువలెనే యాఱువిధములై మొత్తమున కర్థశక్తిమూలధ్వని పండ్రెండు విధములగుచున్నది. కొందఱు కవి ప్రౌఢోక్తి సిద్ధమునకును, కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధమునకును, భేదములేదు. గనుక అర్థశక్తిమూలధ్వని యెనిమిది విధములనియే చెప్పుచున్నారు.

—♦ స్వతఃసంభవి వస్తుగమ్య వస్తువు. ♦—

"అలస శిరోమణి ర్ధూర్తానామగ్రిమః పుత్రి! ధనసమృద్ధిమయః,
ఇతి భణితేన నతాంగీ ప్రఫుల్ల విలోచనాజాతా."

తా॥ ఇందుఁ బూర్వార్ధము ఉపమాత స్వయంపతింవర నుగూర్చి చెప్పునదిగాను, ఉత్తరార్ధము కవి వాక్యముగాను, నున్నది. "ఓపుత్రీ! ఈవరుఁడు నిరుద్యోగి శిరోమణి. ధూర్తులలో నగ్రగణ్యుఁడు. ఎక్కువ ధనసమృద్ధిగలవాఁడు." అని యుపమాత పలుకఁగనే కృశాంగి కన్నులు వికసింపఁజేసెనని తాత్పర్యము.

ఇచ్చట "అలసశిరోమణి" యనుటచే నాయకుఁడు నాయికాంతర గృహమునకుఁగూడఁ బోనిచ్చగించని వాఁడనియు, "ధూర్తాగ్రిణి" యనుటచే సంభోగములలోఁ దృప్తిలేనివాఁడనియు, 'ధన సమృద్ధిమయుఁ' డనుటచేఁ గృపణుఁడనియు, సుఖియనియు, గ్రహించి సంతసించిన కుమారియొక్క ప్రఫుల్ల నేత్రత్వరూపమైన వస్తువుచే 'నాకితఁడే యుపభోగయోగ్యుఁడ' నెడి కుమార్యభిప్రాయము సామాజికులకు వ్యక్తమగుచున్నది. ఇయ్యది కవి ప్రౌఢోక్తి నిష్పన్నముగాక సామాన్యముగ లోకులకుఁగూడ గోచరించును గావున స్వతఃసంభవి యనఁబడును. ఇట్లు స్వతః సంభవ్యలంకారములకును, వస్త్వలంకారములకును, అలంకార వస్తువులకును, ధ్వనిత్వమును స్వయముగా నూహించునది.

—♦ కవి ప్రౌఢోక్తి సిద్ధాలంకార వ్యంగ్యవస్తువు. ♦—

"గాఢాలింగన రభసోద్యతే దయితే లఘుసముపసరతి,
మనస్విన్యామానః పీడనభీత ఇవ హృదయాత్."

తా॥ ప్రణయకుపితను గుఱించి కోపాపనోదనమునకై యొక చెలంత మఱి యొక మానవతీ వృత్తాంతమును దెల్పుచున్నది. "ఓసి యమ్మా! ఆమానవతి యభిమానము. ప్రియుఁడు గాఢాలింగన ప్రయత్న మొనర్చుచుండఁగనే పీడనమునకు వెఱచుదానివలెఁ దిన్నఁగ హృదయమునుండి జాఱుచున్న"దని తాత్పర్యము.

ఇచ్చట "పీడనమునకు వెఱచుదానివలె" నను నుత్ప్రేక్షచే మానినికి మానభంగము గలుగుటయేగాక ప్రత్యాలింగనాదులుగూడ జరిగెననెడి వస్తువు వ్యంగ్యమగుచున్నది. ఇది లోకసిద్ధముగాదు. గావునఁ గవి ప్రౌఢోక్తిసిద్ధ మనఁబడును. కవి ప్రౌఢోక్తిసిద్ధములవలెనే కవి నిబద్ధప్రౌఢోక్తి సిద్ధములును గావ్యములయందు వ్యంజకములుగా నుండును. రసగంగాధరకారాదులీ రెండింటికి భేదము నంగీకరింపరు.

—♦ కవి నిబద్ధ ప్రౌఢోక్తి సిద్ధాలంకార వ్యంగ్యాలంకారము. ♦—

"మహిలాసహస్రభరితే తవ హృదయే సుభగ! సాఅమాంతీ
అనుదిన మనన్యకర్మా అంగం తన్వపి తనయతి."

తా॥ విరహాకృశాంగియగు నాయికను, నాయకునకు నివేదించు సఖీవచనము. "ఓయీ! సుభగ! వేలకొలఁదిగ దుష్టస్త్రీలతో నిండిన నీహృదయమునందు నిర్వ్యాజప్రేమభరిత

యగు నాసాధ్వి యిమునినిచె ప్రతిదినము పనులన్నియు విడిచి అసలే చిక్కియున్న శరీరమును మిక్కిలి కృశింపఁజేయుచున్నది" అని తాత్పర్యము.

ఇందు నాయక హృదమునందు నాయిక యిముడకుండు టకు అనేక యువతీభరితత్వము హేతువు. తను తనూకరణము నకు హృదయమునం దిముడకుండుట నిమిత్తము. కావున నివి రెండును హేత్వలంకారములగును. ఈ యలంకారముల చేత "శరీరమును తనూకరించినను నీహృదయమునఁ బట్టకున్న" దని విశేషోక్త్యలంకారము వ్యంగ్యమగుచున్నది. కారణమున్నను గా ర్యము గలుగకుండుట విశేషోక్తిగదా. ఇది లోకసిద్ధముగాని, కవి ప్రౌఢోక్తిసిద్ధముగాని గాదు. కవి నిబద్ధయయిన సఖీప్రౌ ఢోక్తిసిద్ధము గావున కవి నిబద్ధప్రౌఢోక్తి సిద్ధమనఁబడును.

—♦ ఉభయశక్తిమూలధ్వని. ♦—

కావ్యములయందు శబ్దార్థములు రెండింటివలనను గలిగెడి ధ్వని యొక్కటే.

"అతంద్రిచంద్రాభరణా, సముద్దీపిత మన్మథా,
తారకా తరళా, శ్యామా, సానందం నకరోతికమ్."

తా॥ ఈపద్యమునందు రాత్రిపరమైన యర్థమొకటియుఁ, గామినీపరమైన యర్థమొకటియుఁ గలదు. "ప్రకాశమానుఁడైన చంద్రుఁడే యాభరణముగాఁ గలదియు, మన్మథుఁ నభివృద్ధిఁ జేయునదియు, నక్షత్రములచేఁ దరళమైనదియు నగు రాత్రి యె వరి నానందింపఁజేయదు?" అని రాత్రిపరమైన తాత్పర్యము.

25097



"సురతాదులయం దలయిక లేనిదియు, చంద్రకమను శిరోభూష ణము గలదియు, సంతోషపూర్వకముగ మన్మథుని వెలిబుచ్చునదియు, చంచలమైన కనుపాపలు గలదియు నగు పదునాఱేండ్ల ప్రాయపు యువతి యెవరిని మాత్రము సంతసింపఁజేయదు.?" అని కామినీపరమైన తాత్పర్యము.

ఇట్లు రెండర్థములు ఉపస్థితములు కాఁగానే రెంటికిని మున్నుపపాదింపఁ బడినట్లు "రాత్రి కామిని వంటిద"ని గాని, "పూర్ణిమరాత్రి వంటిది కామిని"యని గాని, పరస్పర ముపమానోపమేయభావము వ్యంగ్యమగుచున్నది. మఱి యిందు చంద్ర, తారకా, తరల, శ్యామా, శబ్దములు కొన్ని పరివృత్త్యసహములుగాను, "అతంద్రాభరణ సముద్దీపిత మన్మథ" శబ్దములు కొన్ని పరివృత్తిసహములుగాను నుండుటవలన నిది శబ్దార్థోభయ శక్తిమూలధ్వని యనఁబడును. పద్యమునందే శబ్దములను మార్చివేసినఁ గావలసిన యితరార్థోపస్థితి సిద్ధింపదో యాశబ్దములే పరివృత్త్యసహములు. ఏశబ్దములను మార్చిన నర్థాంతర ప్రతీతి సులభమో యవ్వియే పరివృత్తిసహములు.

ఇట్లు ధ్వని సామాన్యముగఁ బదునెనిమిది విధములు. అర్థాంతర సంక్రమితము, అత్యంత తిరస్కృతమని యవివక్షిత వాచ్యధ్వని రెండువిధములు. వివక్షితాన్యపరవాచ్యమునందు అసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని యొకటి. సంలక్ష్యక్రమ వ్యంగ్యమునందు శబ్దశక్తిమూలము రెండు విధములు. అర్థశక్తిమూలము పండ్రెండు విధములు. ఉభయశక్తిమూల మొక్కవిధము, చేరి

ధ్వని సామాన్యము పదునెనిమిది విధములని తాత్పర్యము.

ధ్వని రసాది భేదములచే ననంతముగానుండ అష్టాదశ విధమని చెప్పుట యెట్లు? రసాదులు బహువిధములగుటం జేసి పరిగణింప నసాధ్యమగుటచే నది యొక్క విధముగనే పరిగణింపఁ బడుచున్నది. ఒక్క శృంగారరసమునకే సంభోగ విప్రలంభాద్యనేక భేదములుగలుగ మఱి యితరముల నెన్నఁదలమా? కావున ధ్వని పదునెనిమిది విధములనుట తప్పుగాదు.

ఉభయశక్తిమూలమైన ధ్వనివాక్యమునందును, ఇతరములు పదమునందును, పదైకదేశమునందును ప్రకాశించును. పద ప్రకాశ్యమైన ధ్వని యేకాంగగతమైన యాభరణముచేఁ గామిని వలె మిక్కిలి ప్రకాశించును. అందు,

## పదప్రకాశ్యధ్వని.

"లావణ్యం తదసౌకాంతి స్తద్రూపం సవచః క్రమః,
తదా సుధాస్పద మభూదధునాతు జ్వరోమహాన్."

తా॥ ఇది యొక విరహివచనము. "ఆలావణ్యము, ఆ కాంతి, యారూపము, ఆవచనక్రమము, అంతయు నప్పు డమృతప్రాయమాయె. ప్రకృతము జ్వరప్రాయమై మిగుల పీడను బుట్టించుచున్నదని తాత్పర్యము.

ఇందనుభవైక గోచరత్వమును దెలియఁజేయు తదాది శబ్దములన్నియు, లావణ్యాదిగతమైన లోకోత్తరత్వమును బ్రతిపాదించుచు విప్రలంభశృంగారమును వ్యక్తపఱుచు చున్నవి. గావున దీనిని బదప్రకాశ్యాలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని యందురు.

## పదప్రకాశ్య సంభోగ శృంగారము.

"ముగ్ధే! ముగ్ధతమైవ నేతు మఖిలః కాలః కిమారభ్యతే,
మానంధత్స్వ, ధృతింబధాన, ఋజుతాం దూ రేకురుప్రేయసి!
సఖ్యైవం ప్రతిబోధితా ప్రియవచస్తామాహ భీతాననా,
నీచైః శంస,హృదిస్థితోహి నను మే ప్రాణేశ్వరః శ్రోష్యతి."

అమరుకశతకము.

తా॥ రహస్యము నెఱింగి మాన ముపదేశించెడి సఖిని లక్ష్యపెట్టక, తన ప్రియునియందుఁ బ్రణయ వినయములుగల యొక నాయిక సఖినిగూర్చి యిట్లు బలుకుచున్నది. "ఓసీ! ఉపదేశమును గ్రహించ లేని భామినీ! నీవేల కాలమునెల్ల మౌగ్ధ్యముచేతనే గడుప నారంభించుచున్నావు.? ఓసీ! ప్రేయసీ! నీ యార్జవమును దూరముననుంచి మానమవలంబించి ధైర్యమును ధరింపుము. అని యీరీతిని సఖిచే నుపదేశింపఁబడిన నాయిక యించుక భీతాననయై "ఓచెలీ! మెల్లఁగాఁ బల్కుము. నాహృదయముననుండు ప్రాణేశ్వరుఁడు వినునుసుమా! అని యామెకు బదులు చెప్పెనని యభిప్రాయము.

ఇందు "భీతాననా పదము నాయికకుఁ బ్రియునియందకృత్రిమానురాగమును సూచించుచు, నీచైః శంసనవిధానమునకు యోగ్యతను దెలుపుచున్నది. అందుచే సంభోగశృంగారము బలపడుచున్నది. భావాదులు పదప్రకాశ్యములైనను జమత్కారావహములు కాఁజాలవు. సంలక్ష్యక్రమమునందు సర్వభేదములయందును బదప్రకాశ్యత గలదుగాని వాని నిందు

విస్తరభీతిచే నుదాహరింప విడిచితి. అర్థశక్తిమూలములైన ద్వాదశ విధ ధ్వని కేవల పదవాక్య వ్యంగ్యముగుటయే గాక, ప్రబంధ మునందుఁగూడ వ్యంగ్యమగుచున్నది. ఇందుకు గృధ్రగోమా యుసంవాద ముదాహరణము.

—♦ ప్రబంధ వ్యంగ్యార్థ శక్తిమూలము. ♦—

(1) "అలంస్థిత్వా స్మశానేస్మిన్ గృధ్రగోమాయుసంకులే,
కంకాలబహులే ఘోరే సర్వప్రాణి భయంకరే."

(2) 'నచేహ జీవితః కశ్చిత్కాలధర్మ ముపాగతః,
ప్రియోవాయదివా ద్వేష్యః ప్రాణినాంగతిరీదృశీ.'

(1) "ఆదిత్యోయం స్థితోమూఢాః స్నేహం కురుతసాంప్రతమ్,
బహువిఘ్నోముహూర్తోయం జీవేదపి కదాచన,
గృధ్రవాక్యాత్కథం మూఢాః త్యజధ్వమవిశంకితాః."

తా॥ మృతుండగు బాలుని స్మశానమునకుఁ దేఁగాఁ దన్మాంసమును భక్షింపఁగోరి దివారాత్రసమర్థములగు గృధ్ర జంబుకంబులు స్వస్వమనోరథముల కనుకూలముగ నచ్చటికి వచ్చిన జనులను వంచింపఁ గ్రమముగా నిట్లు బలుకుచున్నవి. ఇందు మొదటి రెండు కారికలు గృధ్రవాక్యములుగాను, తరు వాతిపి గోమాయువు వాక్యములుగాను నరయవలయును. అందు దివాసమర్థమైన గద్ద 'ఓమూర్ఖులారా! ఎముకలచే నిండి గ్రద్దలతోను, నక్కలతోను బూర్ణమయి సర్వప్రాణులకు భ యంకరమగు నీస్మశానమున నిలిచి యేమిఫలము? మిత్రుఁడో శత్రుఁడో చచ్చినవాఁడు మరల జీవింపఁడుగదా? ప్రాణుల గతి

యెల్ల నిట్టిదే యనియు, రాత్రిసమర్థమైన జంబుకము "ఓమూఢు లారా! ఇంకను బ్రొద్దు గ్రుంకలేదు. ఈముహూర్తమనేక విఘ్న భూయిష్ఠము. కావున నొకవేళ నీబాలుఁడు బ్రదుకవచ్చును. నా మాట నమ్ముఁడు. గ్రద్దమాటలు విని మూర్ఖులై శంకలేక యీ బాలుని మీరెట్లు విడిచివెళ్లెదరు." అనియుఁ బలుకుచున్నవి.

ఇచ్చట గ్రద్దకుఁ జీఁకటిపూఁటఁ గన్నులగుపడవు గావున నది సూర్యుఁడస్తమించకముందే వచ్చిన వారిని వంచించి బా లునిఁ దినఁగోరుచున్నది. వంచకమునకు రాత్రివేళ గ్రద్దబాధ తొలఁగును గనుక సుకరముగ భుజింపఁగల్గును. కాఁబట్టి జీఁకటి పడువఱకు మృతకళేబరము చెక్కుచెదరకుండ నుండవలయు నని యట్లు బలుకుచున్నది. ఈరెండింటి విషయమును బ్రబంధ రూపముగా నుండును. ఇయ్యది జనులు విడిచి వెళ్లవలయున నియు, వెళ్లఁగూడదనియు వ్యక్తపఱుచుచున్నది. గావునఁ బ్ర బంధవ్యంగ్యమైన వస్తువనఁబడుచున్నదని యభిప్రాయము.

రసాదులు పదైకదేశ, రచనా వర్ణములయందుఁ గూడ వ్యంగ్యమగుచున్నవి. అందు,

— { ప్రత్యయాత్మక పదైకదేశ సుప్తిఙ్వ్యత్యాసేప వ్యంగ్య విప్రలంభశృంగారము. } —

"లిఖన్నాస్తే భూమిం బహిరవనతః ప్రాణదయితః,
నిరాహారాః సఖ్యః సతతరుదితోచ్ఛూననయనాః
పరిత్యక్తం సర్వం హసితపఠితం పంజరశుకైః
తవావస్థాచేయం విసృజకఠినే! మానమధునా."

అమరుకశతకము.

తా॥ బహుదినములనుండి ప్రణయకుపితయగు నాయిక నుద్దేశించి సఖి పలుకుచున్నది. "ఓ నిర్దయురాలా! నీప్రాణ ప్రియుఁడవనతుఁడై భూమిని గీటుచు నిలుచున్నవాఁడు. నీ సఖులో సతతము కన్నులుబ్బ నేడ్చుచు నాహారము మానియు న్నవారు. పంజరశుకములచే హాసముగాని, పాఠముగాని, సర్వ ము విడువఁబడియున్నది. నీదురవస్థయో యిట్లున్నది. కావున నిఁకనైనను మానము వదలుము." అని తాత్పరము.

ఇచ్చట 'లిఖన్నాస్తే' "వ్రాయుచు నిలుచున్నవాఁడు" అను శతృప్రత్యయాంత వర్తమానకాలిక ప్రయోగములచే 'నీప్రియుఁ డిప్పటికిఁగూడ నీప్రసాద పర్యంత మట్లే చేయుచున్న వాఁడ' నియు, 'భూమినని' ద్వితీయావిభక్త్యంతముచే వ్యాపా రాంతర సంబంధమేమియు లేక త్వత్ప్రసాదైక తత్పరుఁడై యున్న వాఁడనియు, పదైకదేశములయిన సుప్తిఙ్విశేషములచే వ్యంగ్య మగుచున్నది. 'లిఖతి' యనిగాని, "ఆసిత' యనిగాని, 'భూమా' అనిగాని, ప్రత్యయములను మార్చియుండిన నీయభిప్రాయము వ్యంగ్యము కాఁజాలదు. ఇట్లే "రమణీయః క్షత్రియకుమారః ఆసీత్." "క్షత్రియకుమారుఁడు రమణీయుఁడుగా నుండెను." అని భగ్నపశుపతి కార్ముకుఁడగు దాశరథినిఁగాంచి కుపితుండగు పరశురాముండు పలుకు వచనమునందు 'ఆసీత్' అను భూత కాలిక ప్రయోగము. 'మతో(-)ధకవలితుఁడగు నీక్షత్రియ కుమారుని రామణీయకము ముందుండెను గాని యిఁకనుండదు. ఉండఁబోదు.' అను పరశురామాభిప్రాయమును వ్యక్తపఱుచు

చున్నది. విస్తరభీతిచే విడిచితి. గావున నుదాహరణాంతరముల నూహించుకొనునది.

ఇట్లు మున్ను నిరూపింపఁబడిన ధ్వనిభేదములు పద, వాక్య, ప్రకాశ్యత్వ భేదముచే, నేఁబదియొక్క విధములుగా నేర్పడి, మూఁడువిధములైన సాంకర్య సంయోజనలచేతను, ఏకరూపమైన సంసృష్టి సంయోజనచేతను, పదివేల నాల్గునూ దల నాల్గుభేదములుగలవి యగుచున్నవని యాలంకారికుల యభిప్రాయము.

సంకరాలంకారము, సందేహసంకరము, అనుగ్రాహ్యాను గ్రాహక సంకరము, ఏకవ్యంజకానుప్రవిష్ట సంకరము అని మూఁడు విధములు. అనేకాలంకారములు పరస్పర నిరపేక్షముగ నొక్కచోటఁ గూడుట సంసృష్టి. ఇది యొక్కటే విధము. పరస్పరసాపేక్షమైన యలంకారముల కూడిక సాంకర్యము. ఇందుచేతనే సంకరము క్షీరనీరన్యాయమువంటిదనియు, సంసృష్టి తిలతండుల న్యాయమునంటిదనియుఁ, జెప్పుదురు. మఱియు నీధ్వనిభేదములు శుద్ధభేదములతోఁగూడి పదివేల నాల్గువందల యేఁబదియైదు (10455) భేదములు గలవి యగుచున్నవి.

— { అనుగ్రాహ్యానుగ్రాహక, ఏకవ్యంజకానుప్రవిష్ట సంకరములకును, సంసృష్టికిని ఉదాహరణము. } —

"స్నిగ్ధశ్యామలకాంతిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనాః,
వాతాః శీకరిణః పయోదసుహృదామానన్దకేకాః కలాః,

నర్థము లక్ష్యము. ఇదియే అర్థాంతరము. అర్థానిచే రామునకు స్వావధీరణము వ్యంగ్యము. రామపదవ్యంగ్య స్వావధీరణము నకును, లేపన సుహృత్ప్రద వ్యంగ్యాతిశయములకును బరస్పరము ప్రయోజ్యప్రయోజకభావము (కార్యకారణభావము) ఉండు టంబట్టి యనుగ్రాహ్యానుగ్రాహక సంకరమగును. మఱియు రామపదముచే స్వావధీరణమునవలె విప్రలంభశృంగారము గూడ వ్యంగ్యమగుటవలన నారెంటికి నేకపదానుప్రవేశ సంకరము గలుగుచున్నది. ఇట్లే యుదాహరణాంతరముల నూహించునది.

—♦ గద్య. ♦—

ఇది శ్రీనిజామదేశీయ మహబూబునగర మండలాంతర్గత పెద్ద మందడి గ్రామవాసి భారద్వాజగోత్ర పవిత్ర కాందూరునకు వయఃపారావార రాకాసుధాకర చింతకుంట రాఘవా చార్య ద్వితీయతనూజ, శ్రీపదపురవాస్తవ్య మహా మహోపాధ్యాయ శ్రీమాన్, కపిస్థలాభిజన, దేశికా చార్యాది గురువర ప్రసాదలబ్ధ సాహిత్యప్రబోధ సాహిత్యశిరోమణి & ఉభయభాషాప్రవీణ పట్టసమంచిత, కడపమండల స్థానిక విద్యా శాఖాంధ్రపండిత, కాందూరు నరసింహా చార్య్య విరచితంబైన కావ్యప్రకాశం బునందు చతుర్థోల్లాసము సంపూర్ణము.

# కావ్యప్రకాశవివరణము.

## పంచమోల్లాసము.

### ప్రథమభాగము.

నాల్గవయుల్లాసంబునందు అవివక్షితవాచ్యధ్వనియు, వివక్షితాన్యపరవాచ్యధ్వనియు, వాని భేదంబులును, రస, భావ తదాభాసాది స్వరూపంబును, రసవిశేషంబులును, రసాది ధ్వనికసంలక్ష్యక్రమ వ్యంగ్యత్వంబును; సంలక్ష్యక్రమ వ్యంగమునందలి శబ్దశక్తిమూలధ్వని విశేషంబును, మొదలుగాఁగల యంశంబులు నిరూపింపఁబడినవి. ఇందు గుణీభూతవ్యంగ్యాదులు నిరూపింపఁబడుచున్నవి.

గుణీభూతవ్యంగ్యము అగూఢము, అపరాంగము, వాచ్యసిద్ధ్యంగము, అస్ఫుటము, సందిగ్ధప్రాధాన్యము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము, అసుందరము నని యెనిమిది విధములుగాఁ గలదు. వాచ్యార్థముకంటె స్పష్టమై చమత్కారిగా లేనటువంటి వ్యంగ్యార్థమగూఢము. ప్రధానమైన వాక్యార్థమునకంగమగు వ్యంగ్యమపరాంగము. వాచ్యార్థసిద్ధికి సాధనమగు వ్యంగ్యము వాచ్యసిద్ధ్యంగము. సహృదయులకుంగూడ సులభముగ గోచరించనిది యస్ఫుటము. చమత్కారము వాచ్యార్థమునుండి గలిగినదా? వ్యంగ్యార్థమునుండియా? అను సందేహాస్పదమగునది సందిగ్ధప్రాధాన్యము. వ్యంగ్యార్థమునకును,

తా॥ కీచకకృత పరాభవమును నివేదించెడి ద్రౌపదిని గూర్చి బృహన్నలరూపుండగు నర్జునుఁడు పలుకుచున్నాఁడు. అని కొందఱును, "అర్జునుఁడు బృహన్నడాదశయందుండ స్వాభ్యుదయమునకేల ప్రయత్నింపవని ప్రశ్నింపఁగా నతఁడందుకు సమాధానముగఁ జెప్పుచున్నాఁడని" కొందఱును జెప్పుదురు. ఎవని శత్రువు తిరస్కరింపఁబడినవాఁడై తానే శరణుఁజొచ్చి, తన కర్ణములను దానే కాలిన కఱ్ఱుచేత ముమ్మాఱు పొడుచుకొనుచుండునో యట్టి యీ నేను మొలత్రాళ్లు కట్టువాఁడనై యున్నాను. కావున నేనిప్పుడు జీవించువాఁడను గాను. నేనేమి చేయుదునని తాత్పర్యము.

ఇందు పద్యమునందలి 'జీవన్న సంప్రతిభవామి' యను పదమును జీవింపనివాఁడు చెప్పుట కశక్యము గావున నసంబద్ధమై 'శ్లాఘ్యజీవనుఁడను గాన'ను నర్థాంతరమును బోధించుచు నర్థాంతర సంక్రమితమగుచున్నది. ఇయ్యది ఇంతకంటె మరణమే శ్రేయస్కరమను నర్థమును వ్యక్తపఱుచుచున్నది. ఈవ్యంగ్యార్థము సహృదయులకుంగూడ వాచ్యార్థముంబోలె సుగమము గావున నియ్యది యగూఢవ్యంగ్యమగు మధ్యమకావ్యమని వ్యవహారము. ఇయ్యది యర్థాంతర సంక్రమితాగూఢ వ్యంగ్యమున కుదాహరణము.

—♦ అత్యంత తిరస్కృతాగూఢ వ్యంగ్యము. ♦—

"ఉన్నిద్రకోకనదరేణు పిశంగితాంగా
గాయంతిమంజుమధుపా గృహదీర్ఘికాసు,

ఏతచ్ఛ్రకాస్తి చ రవేర్నవ బంధుజీవ
పుష్పచ్ఛదాభముదయాచల చుంబి బింబమ్."

తా॥ నాయకునితో సహా నిద్రించి ప్రొద్దుపొడిచినను మేల్కొనని సఖినిగూర్చి సూర్యోదయ సూచనార్థము చేడియ పలుకుచున్నది. "ఇంటి నడబావులయందు దుమ్మెదలు వికసించిన యెఱ్ఱదామరపూవుల పుప్పొడిచేఁ బిశంగితావయవములై మనోహరముగ గానముచేయుచున్నవి. మఱియు బంధుజీవ పుష్పదళముంబోలె నుదయగిరి చుంబియగు నీసూర్యబింబము ప్రకాశించుచున్నద"ని తాత్పర్యము.

ఇందుఁ జేతనధర్మమైన చుంబన మచేతనమగు సూర్య బింబమునం దసంభవి గావున నది యత్యంతతిరస్కృతమై లక్షణాశక్తిచే సంబంధమాత్రమును బోధించుచు నుషఃకాలారంభ రూపమైన యర్థమును వ్యక్తపఱుచుచున్నది. అయ్యది వాచ్యార్థమువలె సామాన్యులకుఁగూడ వేద్యము గావున నగూఢమనఁ బడును.

—♦ అర్థశక్తి మూలానురణనరూపాగూఢ వ్యంగ్యము. ♦—

"అత్రాసీత్ఫణిపాశబంధన విధిః శక్త్యాభవద్దేవ ! తే,
గాఢంవక్షసి తాడితే హనుమతా ద్రోణాద్రి రత్రాహృతః,
దివ్యైరింద్రజిదత్రలక్ష్మణశరై ర్లోకాంతరం ప్రాపితః,
కేనాప్యత్రమృగాక్షి! రాక్షసపతేః కృత్తాచ కంఠాటవీ."

తా॥ రావణవధానంతరము విమానమార్గమున నయోధ్యకువచ్చు శ్రీరాముఁడు సీతంగూర్చి చెప్పెడి వచనము.

"ఓమృగాక్షీ! ఇచ్చట నాగపాశ బంధనవిధి జరిగెను. ఇచ్చట నీమఱఁదియగు లక్ష్మణుఁడు శక్తిచే గట్టిగా ఱొమ్మునఁ గొట్టఁ బడఁగా వాయుతనయుఁడు ద్రోణపర్వతమును గొనివచ్చెను. ఇచ్చట దివ్యములగు లక్ష్మణుని బాణములచే నింద్రజిత్తు లోకాంతరమునకుఁ బంపఁబడెను. ఇచ్చట రాక్షసరాజగు రావణుని కంఠము లోకానోకనిచే నఱుకఁబడె" నని తాత్పర్యము.

ఈపద్యమునందు "కేనాపి" అను పదమునకు రామరూపార్థము అర్థశక్తిమూలానురణన వ్యంగ్యమగుచు నగూఢమగుచున్నది. అది యేలాగనిన, ఫలానవాఁడను నర్థముగాని, సంబంధముగాని నిర్ణయింపఁబడని (కిం) శబ్దమునకు "నాచేత" అను నర్థము వ్యంగ్యమగుచున్నది. అది సర్వజన ప్రసిద్ధముగావున నగూఢమని భావము. "కేనాపి" యను పదస్థానమున రాక్షసపతి విశేషణముగ "తస్యాపి" యని చేర్చెదమేని రామపదార్థమునకు, గూఢవ్యంగ్యత్వము సిద్ధించునని యెంచి "తస్యాప్యత్ర" అను పాఠము యుక్తమని చెప్పుచున్నారు.

వాక్యార్థీభూతమగు రసాదులకు రసాంతరాదు లంగమగునేని యపరాంగ వ్యంగ్యమగునందురు. అందుఁ గరుణరసాంగమగు శృంగారమున కుదాహరణము.

"అయం స రశనోత్కర్షీ పీన స్తన విమర్దనః,
నాభ్యూరు జఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః."

తా॥ రణరంగమునఁ బడిన భూరి శ్రవసుని హస్తమును గొని యతని కాంతలు ప్రలపించుచున్నారు. "ఏహస్తము మొల

త్రాటిని లాగుచు పీన స్తనముల మర్దించుచు, నాభ్యూరుజఘనముల స్పృశించుచు కట్టుముడి విప్పుచుండెనో యదియే యిది." అని తాత్పర్యము.

ఇచ్చట శృంగారరసానుగుణమైన రశనాకర్షిత్వము మొదలగు విలాసస్మరణము హతపతులగు నాయికలకు శోకావేగము నధికముగఁ బుట్టించుం గావున నాయికావిషయకమైన నాయకాశ్రియ శృంగారము కరుణరసమున కంగమగుచున్నది. శృంగారముకన్నఁ గరుణరసమే యాస్వాదవిషయమునఁ బ్రధానమగుటవలనను, మున్నుపభుక్త శృంగారవిలాసస్మరణము కరుణరసపోషకమగుట వలనను, గరుణరసమే ప్రధానము. ఘోత్తమునకీ పద్యమునఁ గరుణరసమునుబట్టి ధ్వనిత్వ వ్యవహారమును, శృంగార రసమునుబట్టి గుణీభూతవ్యంగ్య వ్యవహారమును జెల్లుచున్నవి. ఇట్లే భావమునకు రసమంగమగుటయు, భావమునకు భావమంగమగుటయు, భావమునకుఁ దదాభాసము లంగములగుటయు మొదలగువానిని స్వయముగ నూహించునది. గట్టిగా బోధపడుటకై మఱియొక యుదాహరణ మియ్యఁబడుచున్నది.

"పశ్యేత్కశ్చిచ్చల! చపల! రే! కాత్వరాహం కుమారీ,
హస్తాలంబం వితరహాహా వ్యుత్క్రమః క్వాసి యాసి,
ఇత్థం పృథ్వీ పరివృఢ! భవ ద్విద్విషోరణ్యవృత్తేః,
కన్యాకంచి త్ఫలకిసలయా న్యాదదానాభిధత్తే.".

తా॥ కొంచెము వికసించిన యౌవనము గలదియు, వన

నివాసినియు నగు రాచకన్నియ కుసుమాదులను గోయుచు, నొక కాముకునిఁగాంచి జాతానురాగయై యిట్లు బలుకుచున్నది. అని యొకఁడు చెప్పుచున్నాఁడు. ఓధరణీనాథా! అరణ్యవాసి యగు నీశత్రువు కూఁతురు ఒక యువకు నవలోకించి యివ్విధ ముగఁ బలుకుచున్నది. అదెట్టులనిన "ఓరీ చపలుఁడా! యెవ్వ రేని జూచెదరుసుమా. ప్రక్కకుఁ దొలఁగుము. అంతత్వర యే మున్నది? నేను కుమారినిగదా. ఏదీ కొంచెము చేయూఁత నొ సఁగుము. అక్కటా! కన్యాగమనరూపమైన విపరీతాచరణము జరుగుచున్నది. ఓయీ! నీవెచ్చటి కరుగుచున్నావు? అని తా త్పర్యము.

ఇచ్చట భావాంగమగు భావశబలత నిరూపింపఁబడి యున్నది. కుమారీ వచనమునందలి యనేక భావములకుఁగల శబలత్వము రాజవిషయక రతి భావమున కంగమగుచున్నది. గావున నిది యపరాంగ వ్యంగ్యమగు మధ్యమకావ్యము. కు మారీవచనమునందుఁ బరస్పర భావములకు శబలత్వమెట్లు.?

కన్నియ కాముకునిఁగాంచి జాతానురాగయగుడు నతఁ డు విదిత తదంతఃకరణుఁడై యాలింగనాది శృంగార చేష్టాప్రవృ త్తుఁడగుచుండఁ గన్య, "ఓయీ! యెవ్వఁడైన జూచునుసుమా." యని శంకించెను. అనంతరము శంకనుదొలఁగించి "ఓరీ! చపలా! యిక్కడినుండి తొలఁగు' మని యసూయ యుదయించెను. అంతట నిరాశఁజెంది యతఁడు గమనోద్యుక్తుఁడగుచుండ ము న్నుదయించిన యసూయ నణఁచి 'ఏమి యింత త్వర' యని

ధృతి యుదయించెను. మరల సంతుష్టాంతరంగుఁడై యువకుఁడు శృంగారప్రియుఁడగుచుండ ధృతికి బాధకముగ 'నేను గన్నియ' నను స్మృతిగలిగెను. ఇట్లే పూర్వపూర్వ భావోపమర్దముగ "చేయూఁతనొసఁగు" మని శ్రమమును, "అక్కటా!" యని దైన్యమును, 'అయ్యో కన్యాగమనముగదా' యని విబోధమును, 'నీ వెందరుగుచున్నావ'ని యౌత్సుక్యమును, క్రమముగాఁ గలుగుచున్నవి. ఒక్కచోటఁ బరస్పరోపమర్దముగ నుత్పన్నమైన యనేక భావముల కలయికయే భావశబలత యనఁబడును. గావున నీభావశబలత నిరుక్తరాజవిషయక రతి భావమున కంగమగు భావము.

రసభావాదుల కంగములగు నీరసభావాదులే రసవదాద్యలంకారము లనఁబడుచున్నవి. ఇందు వ్యక్తివివేకకారుఁడగు మహిమభట్టుఁడు "గుణీభూతమగు రసము రసవదలంకారము. గుణీభూతమగు భావము ప్రేయోలంకారము. రసాభాస భావాభాసము లూర్జస్వి అలంకారములు. భావశాంతి సమాహితాలంకారమని" రస, భావ, తదాభాస, తచ్ఛాంతులకు నాలుగింటికే యలంకారత్వము సిద్ధమైయుండ భావోదయాదుల కలంకారత్వ మెక్కడిది? పూర్వులు చెప్పలేదుగదా? యని శంకించుచున్నాఁడు. అందుకు ప్రకాశకారుఁడు "భావోదయాదులకు నామతమునఁగూడ నలంకారత్వము లేదు. గాని యెవ్వఁడైన నొకఁడు వానికలంకారత్వము చెప్పవచ్చునన్న తలంపుచే ఇవ్వి

యే రసవదాద్యలంకారములని చెప్పితినని" సమాధాన మిచ్చు చున్నాఁడు.

"అయం సరశనోత్కర్షీ" యను పద్యము ధ్వనికుదాహరణమా? గుణీభూతవ్యంగ్యమునకా? మొదటిపక్షము సమ్మతమగునేని నాకును సమ్మతమే. రెండవపక్షమనుచో ప్రధానవ్యంగ్యమగు కరుణరసమునుబట్టి ధ్వన్యుదాహరణ మగుచుండ నంగమగు శృంగారమునుబట్టి గుణీభూత వ్యంగ్యోదాహరణమనుట యెట్లు? ఇందుకు ఏకావ్యముగాని ధ్వని, గుణీభూతవ్యంగ్యములకుఁ దమతమ భేదములతో సహా సంకరసంసృష్టులకు విషయముగానిది లేకపోయినను, ప్రతికావ్యమును చమత్కారప్రాధాన్యమునుబట్టి వ్యవహరించవలయునని సమాధానము. అనఁగా, ఒక్కపద్యమునందే ధ్వనియు, గుణీభూతవ్యంగ్యమును, సంకరముగఁగాని, సంసృష్టిగఁగాని యుండుచో నాకావ్యమును ధ్వనియని చెప్పవలయునా? గుణీభూతవ్యంగ్యమని చెప్పవలయునా? యని ప్రశ్నాభిప్రాయము. కావ్యమునందలి చమత్కారము ధ్వనిమూలకమగునేని ధ్వనికావ్యమనియు, గుణీభూతవ్యంగ్యమూలకమగునేని మధ్యమకావ్యమనియు వ్యవహరింపవలయునని నిష్కర్షము. ప్రకృతము "అయం సరశనోత్కర్షీ" యను పద్యమునఁ గరుణరసమునుబట్టి ధ్వన్యుదాహరణ మనుటకు శక్యమైనను, అంగముగ వ్యంగ్యమగు శృంగారమువలననే చమత్కార ముదయించుటఁబట్టి యియ్యది యపరాంగ వంగ్య మధ్యమకావ్యమునకే యుదాహరణమని కవి హృదయము.

— వాచ్యాంగ శబ్దశక్తి మూలానురణన రూపోపమాలంకారము. —

"జనస్థానే భ్రాంతం కనకమృగతృష్ణాంధితధియా
వచో వైదేహీతి ప్రతిపదముదశ్రు ప్రలపితమ్,
కృతాలంకాభర్తు ర్వదనపరిపాటీషు ఘటనా,
మయాప్తం రామత్వం కుశలవసుతా నత్వధిగతా."

అర్థము॥ రాజసేవకు విసుఁగుఁజెందిన యొక కవివచనము. మయా=నాచేత, రామత్వమ్=రామధర్మము, ప్రాప్తమ్=పొందఁబడెను. కాని, కుశలవసుతా=మిక్కిలి ధనము గలిగియుండుటయు, [కుశలవులు పుత్రులుగాఁగల సీతయు] నత్వధిగతా=పొందఁబడలేదు. రామత్వమెట్లు పొందఁబడెను. అనఁగా, కనకమృగతృష్ణాంధితధియా=బంగారును వెదకుటయను నాశచే దిక్కు తెలియని బుద్ధిగలవాఁడను. (బంగారు మృగముపై నాస చే నంధత్వము నొందిన బుద్ధిగలవాఁడను) నగు నాచేత జనస్థానే=జనులకు నివాసమగు గ్రామనగరాదులను, జనస్థానమను దండకారణ్యమందు భ్రాంతమ్=తిరుగఁబడెను. (భ్రాంతి పొందఁబడెను.) మఱియు, దేహీతివచోవై=ఇమ్మను వచనమును, (వైదేహీతివచః సీతా యను పలుకును) ప్రతిపదమ్=అడుగడుగున, ఉదశ్రు=కన్నీరుగారఁగా, ప్రలపితమ్=మొఱపెట్టఁబడెను. భర్తుః=రక్షించువానియొక్క, పరిపాటీషు=సేవారచనలయందు, అలం=మిక్కిలి, కాఘటనా=ఏయుపాయము. నకృతా=చేయఁబడలేదు. వద=చెప్పుము. (లంకాభర్తుః=రావణునియొక్క, వదనపరిపాటీషుఘటనా=ముఖపంక్తియందు శరసంయోజ

నము. కృతా=చేయఁబడెను) ఇట్టి నాచేత రామత్వము ప్రాప్తమైనను, కుశలవసుత పొందఁబడలేదని పూర్వముతో సంబంధము.

తా॥ రాముఁడు కనకమృగాభిలాషచే దానిని వెన్నంటి దండకారణ్యంబున జనస్థానమునందు భ్రాంతుఁడైనట్లు నేనును బంగారుమీఁది యాశచే గ్రామనగరాదులను జుట్టితి. పత్నీవిరహితుఁడగు రాముఁడు దండకారణ్యమున నడుగడుగునఁ గన్నీరుఁ గార్చుచు, వైదేహీ! వైదేహీ! యని విలపించినట్లు నేనును నడుగడుగున దుఃఖముతో 'దేహీ, దేహీ,' యని మొఱయిడితి. శ్రీరాముఁడు లంకాపతియగు రావణుని కంఠములయందు బాణములను బ్రయోగించినట్లు నేనును, యజమానునియొక్క సేవారచనలయందన్ని యుపాయముల నొనర్చితి. ఇన్నివిధముల నేను రామత్వము నొందితిఁగాని, రాముఁడు కుశలవులు పుత్రులుగాఁగల సీతను బొందినట్లు, నేను కుశలవసుతను (ధనికత్వమును) బొందనైతినని తాత్పర్యము.

ఇచ్చటఁ బద్యములోని మూఁడుపాదములయందు శబ్దశక్తిమహిమచేఁ బ్రకృతాప్రకృతులగు కవి రాములకుఁ దోఁచెడి యుపమాలంకారము (సామ్యము) "నాచే రామత్వము పొందఁబడె"నను వాచ్యమయిన రామత్వప్రాప్తి కుపకారముగఁ గవికి సమ్మతము. కాఁబట్టి యపరాంగ వ్యంగ్యమనఁబడుచున్నది. జనస్థానాదిశబ్దములు స్వస్థానపరివర్తనము సహింపమింజేసి యిచ్చటఁ గవి రాములకు వ్యంగ్యమగు సాదృశ్యము శబ్దశక్తి

మూలము. వ్యంగ్యప్రతీతికిఁ బూర్వమ్మ "రామత్వం మయాప్తమ్మ"నుటచేతనే వాచ్యార్థము సిద్ధమైనందున, వ్యంగ్యమైన సాదృశ్యము వాచ్యార్థసిద్ధికి సాధకము కాఁజాలదు. గావున నిది వాచ్యసిద్ధ్యంగోదాహరణమని చెప్పరాదు. మఱియు సాదృశ్యవాచకములైన 'వలె' "భంగి" 'రీతి' మొదలగు శబ్దములెవ్వియు లేమింజేసి యీపద్యమున నుపమాలంకారము వాచ్యము గాక మధ్యమకావ్య మనఁబడుచున్నది. "మయాప్తం రామత్వమ్మ"నుటకు వ్యంగ్యార్థ మెట్లుపకారకమగును? ఒకనికి సమానుఁడైన వానియందు వాని తాదాత్మ్యము నారోపించుట (తత్సదృశునియందుఁ దత్త్వారోపము) చమత్కారజనకము. రామసదృశుఁడగు వానియందు రామత్వారోపము చమత్కారజనకము గావున, నట్టివాచ్యమునకుఁ బరస్పరవ్యంగ్యమైన సాదృశ్యమంగమనియే కవి యభిప్రాయము. ఈయభిప్రాయమునే "అత్ర శబ్దశక్తిమూలానురణనరూపో రామేణ సహోపమానోపమేయ భావో వాచ్యాంగతాంనీతః" అను వాక్యము తెలుపుచున్నది.

మఱియు అపరాంగవ్యంగ్యమునకును, వాచ్యసిద్ధ్యంగమునకును, భేదమేమి? స్వతఃసిద్ధమైన వాచ్యార్థమున కెచట వ్యంగ్యార్థముచే నుత్కర్షము మాత్రము సంభవించునో యదియే యపరాంగవ్యంగ్యము. ఎచ్చట వ్యంగ్యార్థ ప్రతీతి లేనిది వాచ్యార్థమే సిద్ధింపదో యద్దియే వాచ్యసిద్ధ్యంగమని యెఱుంగునది.

—♦ వాచ్యసిద్ధ్యంగము. ♦—

ఇది యేకవక్తృకపద వాచ్యాంగము. అన్యవక్తృకపద వాచ్యాంగమని రెండువిధములు. ఎవరి మాటవలన గోచరించిన వ్యంగ్యార్థము వారివాచ్యార్థమునకే యంగమగుపక్షమున ఏకవక్తృకపద వాచ్యాంగము. ఒకరి మాటవలన వ్యంగ్యమైన యర్థము మఱియొకరి వాచ్యార్థమునకంగమగుట యన్యవక్తృకపద వాచ్యాంగము. అందు,

—♦ ఏకవక్తృకపద వాచ్యాంగము. ♦—

"భ్రమిమరతి మలసహృదయతాం ప్రలయం
మూర్ఛాంతమః శరీరసాదమ్
మరణంచ జలదభుజగజం ప్రసహ్య
కురుతే విషం వియోగినీనామ్."

తా॥ నాయికావస్థను నాయకునకు బోధించుటకై సామాన్యముగ వర్షర్తు వర్ణనాపరమైన వచనమును సఖి యిట్లు పలుకుచున్నది. మేఘమను సర్పమునుండి పుట్టిన జలమను విషము బలాత్కారముగ విరహాయువతులకు భ్రమణమును, సోమరితనమును, బహిరింద్రియ వ్యాపారశూన్యతను, మూర్ఛను, అంధత్వమును, శరీరకార్శ్యమును, మరణమును గలిగించుచున్నదని తాత్పర్యము. (ఇందలి మరణశబ్దము ముఖ్యమైన మరణము మంగళాశ్లీలమగుటచే నాలంబనోచ్ఛేదకము గావునఁ దత్పూర్వావస్థను బోధించుచున్నదని యెఱుంగవలయును.) భ్రమణమనఁగా తలత్రిప్పుట మొదలగు నొక యాంతరవికారము,

లేక మనసు ఒక్కయెడ నిలుకడఁజెందకుండుట, విషయముల యందభిలాష లేకపోవుట యరతి. బాహ్యాభ్యంతరేంద్రియ చేష్టావిరహము మూర్ఛ.

ఇందు విషశబ్దమునకు జలముకన్న హాలాహలము వ్యంగ్యముకాదేని 'జలదభుజగజమ్' అనునెడ జలదమను భుజగమని మేఘసర్పములకు రూపణ మేర్పడదు గావున నిందు విషశబ్ద వ్యంగ్యమైన హాలాహలము వాచ్యమగు రూపకమునకు సాధకమై వాచ్యసిద్ధ్యంగ మనఁబడుచున్నది.

—♦ అన్యవక్తృకపదవాచ్యాంగము. ♦—

"గచ్ఛామ్యచ్యుత! దర్శనేన భవతః కిం తృప్తిరుత్పద్యతే?
కిం త్వేవం విజనస్థయోర్హతజనః సంభావయత్యన్యథా,
ఇత్యామంత్రణభంగి సూచితవృథా వస్థాన ఖేదాలసా,
మాశ్లిష్య న్పులకోత్కరాంచిత తనుర్గోపీం హరిః పాతువః"

తా॥ ఓయచ్యుతా! నిన్నూఱక చూచుచుండుటచే నేమి తృప్తిగలుగును? వెళ్లుచున్నాను. ఇట్లు మనమిరువురము ఒంటిగానుండిన దుర్జనము వేఱుగాఁదలంచును. అని యిట్లు "అచ్యుతా!" యను సంబోధనాచాతుర్యముచేఁ దమ వృథావస్థాన దుఃఖమును సూచించెడి గోపికను బులకితశరీరుఁడై యాలింగనమొనర్చిన శ్రీకృష్ణుఁడు మిమ్ము రక్షించుఁగాతమని తాత్పర్యము. 'అచ్యుతా!' యనెడి సంబోధనముచే సూచింపఁబడు నర్థము. నిర్జనప్రదేశమునఁగూడ మావంటి కాంతాజనమును గాంచి చలింపనివాఁడా! ఒంటరిగనుండియు మాసన్నిధిని

సంభోగాభిలాషివి గాకుంటివేని నినుఁజూచుట మాత్రము నేమిఫలము. ఇంతమాత్రమునకు 'పేరు రత్యర్థమిందుఁగూడియున్నార'ని లేనిపోని జనాపవాదమేల నొందవలయును ఇష్టసిద్ధిగలిగి జనాపవాదముదయించినను నాకంత దుఃఖముం దు. కావున నేను వెళ్లెదననునదియే. ఈవ్యంగ్యార్థము గోచరించుటకు 'ఇత్యామంత్రణభంగి సూచితవృథావస్థానఖేదాలస శబ్దమునకు వాచ్యార్థము సిద్ధింపదు గావున నిది వాచ్యసిద్ధ్యంగమగుచున్నది. ఇందు గోపీవచనమువలన నేర్పడిన వ్యంగ్యము కవివచన వాచ్యమున కంగమగుచున్నది. గావున నిది వక్తృకపద వాచ్యమున కంగమగు వ్యంగ్యమనఁబడును. పూర్వపద్యమునం దొకఁడే వక్త.

—♦ అస్ఫుటగుణీభూత వ్యంగ్యము. ♦—

"అదృష్టే దర్శనోత్కంఠా, దృష్టే విచ్ఛేదభీరుతా,
నాదృష్టేన, నదృష్టేన భవతా లభ్యతే సుఖమ్.'

తా॥ ఒక నాయిక ప్రియునితోఁ బలుకుచున్నది. ప్రియా! నిన్నుఁ జూడకుంటినా, ఎప్పుడెప్పుడు జూతునాయని యాశపుట్టుచున్నది. నీవు కనఁబడితివా నన్ను విడిచిపోవు నేమో యని భయముగలుగుచున్నది. ఇట్లు నీవు కనఁబడినను, కనఁబడకున్నను సుఖములేదుగదా? యని తాత్పర్యము.

ఇచ్చట నీయదర్శనమును, వియోగదుఃఖమును గలుగకుండఁ జేయుమనెడి యర్థము వ్యంగ్యమగుచున్నది గాని యది సహృదయులకుంగూడ గోచరింపకుండుటచే నస్ఫుటవ్యంగ్యమనఁబడును.

## —♦ సందిగ్ధప్రాధాన్య గుణీభూత వ్యంగ్యము. ♦—

"హరస్తుకించిత్పరివృత్తధైర్య శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః। ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని."

కుమారసంభవము.

తా॥ వసంతర్తువృత్తాంతము హరుని చేష్టావర్ణనము. 'చంద్రోదయారంభమున సముద్రుఁడువలె నీశ్వరుఁడు ధైర్యమును వదిలినవాఁడై దొండపండువంటి మోవిగల పార్వతీముఖమునందు నేత్రములను బ్రసరింపఁజేసెను." అని తాత్పర్యము.

ఇచ్చట హరుఁడు పార్వతీముఖ పరిచుంబనమున కిష్టపడెనని వ్యంగ్యమగుచున్నది. సహృదయులకుఁ జమత్కారము గలిగించుటకీ వ్యంగ్యార్థము నిమిత్తమా? వాచ్యమైన హరుని విలోచనవ్యాపారము నిమిత్తమా? యని సందేహము వొడముచున్నది. గావున నిది సందిగ్ధప్రాధాన్య గుణీభూత వ్యంగ్యమనఁబడును.

## —♦ తుల్యప్రాధాన్యగుణీభూత వ్యంగ్యము. ♦—

"బ్రాహ్మణాతిక్రమత్యాగో భవతా మేవ భూతయే,
జామదగ్న్య స్తథామిత్ర మన్యథా దుర్మనాయతే."

తా॥ రావణుని గుఱించి పరశురామదూత వచనమని కొందఱును, రావణామాత్యుఁడగు మాల్యవంతుని వచనమని మఱికొందఱును బలుకుదురుగాని నిజముగా నిది రావణునిగూర్చి యతని మంత్రియగు మాల్యవంతునికిఁ బరశురాముఁడు పంపిన పత్రమునందలి పద్యమని మహావీరచరితనాటకము స్పష్ట

పఱుచుచున్నది. బ్రాహ్మణుల నవమానించకుండుట మీయభి వృద్ధికే కారణము. అట్లుగాదేని మిత్రుండగు జామదగ్న్యుండు (సాధుజనావమానాసహనశీలుఁడు) కలంతఁజెందునని తాత్పర్యము.

ఇచ్చట సాధుజన పక్షపాతియగు పరశురాముఁడు క్షత్రియులంబోలె సాధుజనదూషకులగు రాక్షసులంగూడ ధ్వంసముచేయునను వ్యంగ్యమును, బ్రాహ్మణప్రియులగు రాక్షసులకు జామదగ్న్యుఁడు మిత్రమను వాచ్యార్థమును బ్రాధాన్యమునఁ దుల్యములే యగుటంజేసి యిది తుల్యప్రాధాన్య గుణీభూత వ్యంగ్యమనఁబడుచున్నది.

—♦ కాక్వాక్షిప్త గుణీభూతవ్యంగ్యము. ♦—

“మథ్నామి కౌరవశతం సమరేనకోపాత్
దుఃశాసనస్య రుధిరం నపిబామ్యురస్తః,
సంచూర్ణయామి గదయాన సుయోధనోరూ,
సంధిం కరోతు భవతాం నృపతిః పణేన.”

వేణీసంహారము.

తా॥ సంధివచన కుపితుఁడగు భీమసేనుఁడు సహదేవునిఁగూర్చి యిట్లనుచున్నాఁడు. “ఓసహదేవా! సమరమునఁ గోపముచేఁ గౌరవశతమును నేను మథించను. దుఃశాసనుని యెదనుండి నేను రక్తమును ద్రావను. దుర్యోధనుని తొడలను గదచే నేను బొడిచేయను. మీరాజు గ్రామపంచకమునుగోరి సంధి చేసికొననిమ్ము. అని తాత్పర్యము.

ఇందుఁ గురుకులక్షయమొనర్చ బ్రతినసల్పిన భీమసేనుఁడు 'మథింపను' 'త్రావను' 'పొడిచేయను' అని చెప్పుట యసంగతముగావున 'నమథ్నామిా' త్యాది క్రియల యందలి నఞర్థమునందుఁ గాకుస్వరము ప్రతీతమగుచున్నది. అప్పుడు "మథింపను" మొదలగు క్రియలు "మథింపనా?" "త్రావనా?" "పొడిచేయనా?" యని యేర్పడి మిారాజు సంధిచేసికొనినను, దప్పక నేను కౌరవులను మథింతును. దుఃశాసనుని యురమునుండి నెత్తురు బీల్తును. దుర్యోధనుని తొడలను బొడిచేయుదునని వ్యంగ్యమగుచున్నది. ఈవ్యంగ్యార్థము వాచ్యార్థ నిషేధమునకు (అనఁగా నమథ్నామిాతిన, మథించననునది లేదను నర్థమునకు) సమకాలముగఁ బ్రతీతమగుటంజేసి స్వతంత్రవ్యంగ్యమై ధ్వని యనఁబడక గుణీభూత వ్యంగ్యమనఁబడుచున్నది.

కాకుస్వర విశిష్టధ్వనికిని, గాక్వాక్షిప్త గుణీభూతవ్యంగ్యమునకును భేదమేమి? ఎచ్చటఁ గాకుస్వరప్రతీతి సమకాలమే వ్యంగ్యార్థప్రతీతి గలుగునో యందు గుణీభూతవ్యంగ్యమనియు, ఎచ్చటఁ గాకుస్వరప్రతీతి యుండినను విలంబముగ వ్యంగ్యార్థము ప్రతీతమగునో యందు ధ్వని యనియు వ్యవహారము.

—♦ అసుందర గుణీభూత వ్యంగ్యము. ♦—

"వానీర కుంజోడ్డీనశకుని కోలాహలం శృణ్వంత్యాః,
గృహకర్మ వ్యాపృతాయా వధ్వాః సీదంత్యంగాని."

ప్రా॥ ప్రా॥

తా॥ ఇంటిప్రక్కలోని నికుంజమునందు సంకేతమొనర్చి

యందలి పక్షికోలాహలముచే సనగతోపనాయకాగమనమై గురుజన పారవశ్యముచేతను, నింటిపనుల యాటంకముచేతను, సంకేతస్థానమునకుం బోఁజాలని నాయికావస్థ యిందు వర్ణింపఁబడుచున్నది. ప్రబ్బలి తీఁగల పొదరింటినుండి వెగురుచుండెడి పక్షుల కలకలరవముల వినుచు గృహకృత్యములయం దాసక్తయయిన కామిని యంగములు తత్తఱపడుచున్నవని తాత్పర్యము.

ఇచ్చట "దత్తసంకేతుఁడగు నుపనాయకుఁడు లతాగృహమును బ్రవేశించియున్నాఁడ"ను వ్యంగ్యార్థముకంటె "కామిన్యంగములవసాదము నొందుచున్నవ"ను వాచ్యార్థమే చమత్కారజనకము గావున నిందలి వ్యంగ్యమసుందర మనఁబడుచున్నది.

ఇట్లు నిరూపింపఁబడిన యీగుణీభూత వ్యంగ్యములకు భేదావాంతరభేదములు ధ్వనిభేద ప్రభేదములవలెనే యెఱుంగవలెను. అనఁగా పూర్వోక్త ధ్వనిభేదములయందలి యసంభవిభేదములుదక్క నితరభేదములన్నియు గుణీభూత వ్యంగ్యభేదములుగ సంభవించునని తాత్పర్యము. అసంభవిభేదములెవ్వి? వస్తుమాత్ర వ్యంగ్యాలంకారభేదములే యసంభవిభేదములు. అనఁగా నెందు వస్తుమాత్రరూపమైన వాచ్యార్థముచే నలంకారము వ్యంగ్యమగునో యందు ధ్వని వ్యవహారముతప్ప గుణీభూత వ్యంగ్యవ్యవహారము సంభవించదని తాత్పర్యము. ఇందుకు "వ్యజ్యంతే వస్తుమాత్రేణ యదాలంకృతయస్తదా, ధ్రువం ధ్వన్యంగతా, తాసాం కావ్యవృత్తేస్తదాశ్రయాత్" అను ధ్వని

కాకోక్తి ప్రమాణము. కావ్యవ్యవహార మలంకారసాపేక్షము గలుగఁజేసి యెప్పు డలంకారములు వస్తుమాత్రముచే వ్యంగ్యములగునో యప్పుడవి నిశ్చయముగా ధ్వన్యంగములే (ధ్వని వ్యవహార ప్రయోజకములే) యగునని కారికాభిప్రాయము.

మొత్తమునకు ధ్వనిప్రభేదములలో వస్తుమాత్ర వ్యంగ్యాలంకారభేదములు తప్ప తక్కిన ప్రభేదములన్ని గుణీభూత వ్యంగ్యభేదములుగా నన్వయించునని నిష్కర్షము.

మున్ను నాల్గవయుల్లాసమున ధ్వనికి సజాతీయభేద సంబంధము నిరూపింపఁబడియె. ప్రకృత మాధ్వనికే విజాతీయ గుణీభూత వ్యంగ్యభేద సంబంధము నిరూపింపఁబడును.

అలంకార రూపములయినట్టియు, అలంకారసహితములయినట్టియు, గుణీభూత వ్యంగ్యములతో సంసృష్టిసంకరరూపమైన సంబంధము ధ్వనికిఁ గలుగునేని ధ్వనిభేదసంఖ్య మిక్కిలి యెక్కువగును. ఇందుకు ధ్వనికారుఁడు "సగుణీభూతవ్యంగ్యైః సాలంకారై స్సహప్రభేదైః స్వైః, సంకరసంసృష్టిభ్యాం పునరప్యుద్యోతతే బహుధా." అధ్వని యలంకార సహితములును, అలంకార రూపములునగు గుణీభూత వ్యంగ్యములతో సంకర సంసృష్టి సంబంధముగల్గియై నానావిధములుగఁ బొడచూపునని నుడివియున్నాఁడు. సంకర సంసృష్టిసంబంధము ధ్వనిప్రకరణమున నిరూపింపఁబడియె.

## —♦ ప్రకరణాంతరము. ♦—

ధ్వనియు, గుణీభూతవ్యంగ్యమును. వాని భేదములును

నిరూపింపఁబడినదె. ఇచ్చట శబ్దముద్వారాగాని అర్థముద్వారా గాని బోధపడునట్టి యర్థమునకు ధ్వనిత్వమెట్లు? అని వాది సంశయము బయలుదేఱుచున్నది. తన్నివృత్తికై ప్రకరణాంతర మారంభింపఁబడుచున్నది.

సంగ్రహముగా ధ్వని, వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని యని మూఁడువిధములు. ఇందులోఁ గొంత వాచ్యముగానుండును. వాచ్యముగాఁగలది అవిచిత్రము, విచిత్రమని రెండువిధములు. అవిచిత్రము వస్తుమాత్రము. విచిత్రమలంకారరూపము. రసాద్యర్థ మెప్పటికిని వాచ్యముకాఁజాలదు. అదియును వాచ్యముకాఁగలదంనుమేని అదెట్లు, వస్త్వలంకారరూపార్థములు శబ్దముచే బోధింపఁబడునట్లు రసాద్యర్థము శృంగారాది శబ్దములచే బోధింపఁబడునా? శృంగారాది శబ్దములను బ్రయోగించినను, విభావాది ప్రతీతిలేనిచో రసప్రతీతి లేకుండుటయు, శృంగారాది శబ్దములు లేకున్నను, విభావాదిప్రయోగమాత్రముచే రసప్రతీతి గలుగుటయు ననుభవసిద్ధములగుటం జేసి రసాద్యర్థము శృంగారాది శబ్దవాచ్యమనుట సర్వదా అసంభవము. ముఖ్యార్థబాధాది కారణములు లేకుండుటచే లక్షణావిషయమనుటయు నసంగతమే. కాఁబట్టి రసాద్యర్థము వ్యంగ్యమనియే నిష్కర్షము.

రసాదులు వ్యంగ్యమగునప్పుడు లక్షణ ప్రవర్తింపకపోయినను. వస్తుమాత్రము వ్యంగ్యమగునప్పుడు గలుగు లక్షణాప్రవృత్తినెట్లు నివారింపఁగల్గుదుము? మఱియు రసాదులు వ్యంజనా

గమ్యము లైనను, తదితరములు తద్గమ్యములు గాకుండుట సు
ప్రసిద్ధము గావున వ్యంగ్యార్థములు మూఁడు విధములనుట యె
ట్లనుసరిపడును.?

రసాదిభిన్నము లైన యర్థాంతర సంక్రమితాత్యంత తిర
స్కృత వాచ్యములయందు వస్తుమాత్రరూపమైన వ్యంగ్యార్థ
ములేనిది లక్షణయే సంభవింపదని ముందే "త్వామస్మివచ్మి"
"ఉపకృతం బహుతత్ర" ఇత్యాదులయందు నిరూపింపఁబడియె.
శబ్దశక్తిమూలమైన స్థలములయందు సంయోగాదులచే నభిధాశక్తి
నియంత్రితముకాఁగా అర్థాంతరమునకు, దానితో సహ ఉపమా
లంకారమునకును ప్రతీతి వ్యంగ్యమనుట నిర్వివాదాంశము.
మఱియు అర్థశక్తిమూలములయిన వస్త్వలంకారములు వాక్యా
ర్థప్రతీత్యనంతరము వ్యంగ్యములగుటంజేసి యవి యభిహితా
న్వయవాది మతమున వ్యంగ్యములనక తప్పదు. (ఇచ్చట ము
ఖ్యముగా శంకించువారు మీమాంసకులు.)

### అభిహితాన్వయవాది మతము.

మీమాంసకులలో అభిహితాన్వయవాదు లనియు, అ
న్వితాభిధానవాదులనియు, ఇరుతెగలవారు గలరని ముందే తె
ల్పితిమి. శబ్దములు సామాన్యముగఁ దమతమ యర్థములను
బోధించి వేఱొక యర్థమును బోధించుటకు శక్తిలేనివి కాఁగా,
ఆకాంక్షా, యోగ్యతా, సన్నిధివశమునఁ గలిగెడి పదార్థాన్వ
యరూపమైన సంసర్గము విశేషరూపమగుటంజేసి తదవబోధ
నార్థము మఱియొక తాత్పర్యవృత్తి నంగీకరించవలయును.

అనఁగా నభిధావృత్తి వ్యతిరిక్తముగ నంగీకృతమైన యీతాత్పర్యవృత్తిచేఁ బదముల సామాన్యార్థముగాక, విశేషరూపమైన పదార్థాన్వయము బోధింపఁబడుననియు, అభిధాశక్తి యాయా పదార్థములను సామాన్యముగ బోధించి పదార్థాన్వయరూపమైన విశేషార్థమును బోధింపఁజాలదు కాఁబట్టి తదర్థము మఱియొక తాత్పర్యవృత్తి నంగీకరింపవలయుననియు, వీరి యభిప్రాయము. అభిహితాన్వయవాది శబ్దమున కర్థమిదియే. ఇట్లన్వయరూపార్థమే వాచ్యముగానప్పుడు దానికంటెఁ బరముగఁ దోఁచెడి యర్థము వ్యంగ్యమనక మఱేమనవలయునో విజ్ఞులూహించెదరుగాక. అనఁగా మొదటఁ బదార్థస్మృతియు, అనంతర మన్వయప్రతీతియుఁ, దదనంతరము వ్యంగ్యప్రతీతియుఁ గ్రమముగాఁ గలుగునని యెఱుంగవలయును.

—◆ వాక్యార్థబోధహేతువులు. ◆—

ఒక వాక్యములోని పదార్థబోధానంతరము పరస్పర సంబంధరూపమైన వాక్యార్థబోధము ఆకాంక్షా యోగ్యతాసన్నిధులనెడి మూఁడు నిమిత్తములచేఁ గలుగుచున్నది.

—§ ఆకాంక్ష. §—

వాక్యమునందే పదము లేనిది యేయితరపదమున కన్వయము సంభవింపదో యాపదమునకా పదముతోఁగల ప్రశ్నోత్థాపకత్వ (ప్రశ్నను బుట్టించుట) మాకాంక్షయనఁబడును.

—§ యోగ్యత. §—

వాక్యమునందొక పదార్థమునందు మఱియొక పదార్థమునకు సరిపడు సంబంధముండుటయే యోగ్యత యనఁబడును.

## —♦ సన్నిధి. ♦—

వాక్యమునందుఁ బరస్పర సంబంధముగల పదము లొక దానితో నొకటి దగ్గఱ దగ్గఱఁజేరి యుండుటయే సన్నిధి. ఇదియే యాసత్తి యనఁబడును.

"కృష్ణుఁడు దుష్టులను శిక్షించును." ఇచటఁ గృష్ణాదిపదములు మూఁడును బరస్పరసాపేక్షములై క్రియయందన్వయించుచున్నవి. మఱియు నిందొక పదార్థమునకు మఱియొక పదార్థముతో సంబంధమును, సన్నిధియు నుండుటఁబట్టి శాబ్దబోధము (వాక్యార్థజ్ఞానము) నిరాక్షేపముగఁ గలుగుచున్నది. అగ్నిచే వృక్షమును దడుపుచున్నాఁడను నెడఁ బదపదార్థములకు సరియైన సంబంధము లేమింజేసియు, "రాముఁడు నిన్నవచ్చి వేఁపచెట్టుకు నీరుఁబోసి రంగఁడు చెప్పఁగా సంవత్సరము వెళ్ళిపోయె"నను నెడ "రాముఁడు వచ్చి సంవత్సరము వెళ్ళిపోయె" నను పదములకు సన్నిధి లేమింజేసియు, గోడ, చెట్టు, రాయి, వాన, సంత, గాలి, వాన యను నెడఁ బదములు పరస్పరసాపేక్షములు కాకపోవుటంజేసియు, శాబ్దబోధము గలుగదు.

## —♦ అన్వితాభిధానవాది మతము. ♦—

అన్వితాభిధానవాదులయిన ప్రాభాకరులు (మీమాంసకులు) బాలునికి వ్యుత్పత్తి మొదట వృద్ధవ్యవహారము వలనఁ గలుగుచున్నది. అందు వ్యుత్పాదక వృద్ధుఁడు, ప్రయోజకవృద్ధుఁడనియు, ప్రయోజ్యవృద్ధుఁడనియు రెండు విధములు. ప్రయోజకవృద్ధుఁడు ఉత్తమవృద్ధుఁడనియు, ప్రయోజ్యవృద్ధుఁడు

మధ్యమ వృద్ధుఁడనియుఁ జెప్పఁబడుదురు. వీరి వ్యవహారము వలన బాలుఁడు వ్యుత్పన్నుఁడగును. (అర్థజ్ఞానము గలవాఁడగును.) ఈవృద్ధ వ్యవహారము మున్ను రెండవయుల్లాసమున నిరూపింపఁబడియు, స్పష్టార్థము మరల నుదాహరింపఁబడుచున్నది. ప్రయోజకవృద్ధుఁడు "గోవును దెమ్ము." "గుఱ్ఱమును దెమ్మ"ని చెప్పఁగా బ్రయోజ్యవృద్ధుఁడు ఆవును, గుఱ్ఱమును దీసికొనిరాఁగా, బాలుఁడు చూచుచుండి మరల ప్రయోజక వృద్ధప్రేరితుఁడగు ప్రయోజ్యవృద్ధుఁడు గుఱ్ఱమును దీసికొని పోవుచుండ వాని యానయన నయనములంబట్టి (తెచ్చుటయు, తీసుకొని పోవుటయుఁబట్టి) 'యిది గుఱ్ఱము.' 'ఇది యావు.' అని వ్యుత్పన్నుఁడగుచున్నాఁడు. ఈయర్థమునే "శబ్దవృద్ధాభిధేయాంశ్చ ప్రత్యక్షేణాత్రపశ్యతి, శ్రోతుశ్చ ప్రతిపన్నత్వమనుమానేన చేష్టయా। అన్యథా నుపపత్త్యాతు బోధేచ్ఛక్తిం ద్వయాత్మికామ్। అర్థాపత్త్యావబోధేత సంబంధం త్రిప్రమాణకమ్." అనుకారికలు బోధించుచున్నవి. బాలుఁడు శబ్దవృద్ధాభిధేయములను (అనఁగా గోవును దెమ్మను శబ్దమును, ప్రయోజక ప్రయోజ్యవృద్ధులను, గవానయనమను నభిధేయమును, (అర్థమును) బ్రత్యక్షప్రమాణముతోఁ జూచుచున్నాఁడు. మఱియు, శబ్దమును వినిన ప్రయోజ్యవృద్ధుఁ డర్థము నెఱుంగుటను అనుమాన ప్రమాణముతోను గవానయన నయనరూపములయిన చేష్టలతోను, గ్రహించుచున్నాఁడు. పిదప అన్యథానుపపత్తిరూపమైన యర్థాపత్తిప్రమాణముచేత (అనఁగా గోవునుదెమ్మను వాక్యమును వినుటచే

గవానయనార్థజ్ఞానము పరస్పర వాచ్యవాచకభావ సంబంధము లేనిది సంభవింపదనునట్టి యనుపపత్తిప్రమాణముచేత) ఈశబ్ద ములకును, వీని యర్థములకును, బరస్పరము వాచ్యవాచకత్వ రూపమున ద్వివిధమైన యభిధాశక్తి గలదని యెఱుంగుచున్న వాఁడు. అనంతరము ప్రత్యక్షానుమానార్థాపత్తిరూప ప్రమాణ త్రయాత్మకమయిన సంబంధమును (అనఁగా ఆన యన నయన ములచే గోశబ్దమునకు గోవే యర్థమనియు, ద్వితీయావిభక్తికిఁ గర్మత్వమే యర్థమనియు) గ్రహించుచున్నాఁడు. అని పైకారి కల అభిప్రాయము. ఇట్లు పరస్పరాన్వితములైన వాక్యస్థితపద ములందే సంకేతము గ్రహింపఁబడును. గావున విశిష్టపదార్థము లే వాక్యార్థములుగాని, పదార్థవైశిష్ట్యము వాక్యార్థము గాదని వీరి మతరహస్యము.

## —♦ ప్రత్యక్షాది ప్రమాణములు. ♦—

పదార్థజ్ఞానసాధనములు ప్రమాణములు. అయ్యవి ప్ర త్యక్షము, అనుమానము, ఉపమానము, శాబ్దము, అని తార్కి కమతమున నాలుగు విధములు. మఱి యితర వేదాంతాది మత ములం దర్థాపత్తిప్రమాణాదులుగూడ గ్రహింపఁబడుచున్నవి. అందు ఇంద్రియములకును, బదార్థములకును గల సన్నికర్షసం బంధమును బట్టి గలిగెడి జ్ఞానమే ప్రత్యక్షమనఁబడును. అనఁగాఁ గృష్ణుని నేరుగాఁ గంటితోఁ జూచునప్పుడు నేత్రమునకును కృ ష్ణునికిని గల సంబంధము చేత 'వీఁడు కృష్ణుఁడ'ను జ్ఞానము గలుగును. ఇట్టి జ్ఞానమే ప్రత్యక్షమనఁబడునని భావము. ఒక హేతు

వునుబట్టి తన్నియతమైన పదార్థమును సాధించుట యనుమాన ప్రమాణము. పర్వతమునందుఁ బొగనుఁగాంచి మహానసాది దృష్టాంత బలమువలన నాహేతువుచేఁ బర్వతమునందు నిప్పుగల దని సాధించుట యనుమాన మనఁబడునని భావము. ఒక పదార్థము పోలికనుబట్టి మఱియొక యపరిచితపదార్థమును దెలిసికొనుట యుపమానము. గోవువంటిది గవయమృగమని విన్నవాఁడొకప్పుడు అరణ్యమున నొక మృగమును గాంచి యిది గోవువంటిది గావున గవయమృగమని తెలిసికొనుట యుపమానమని భావము. పదపదార్థముల సాయమునఁ గలుగు వాక్యార్థజ్ఞానమే శాబ్దప్రమాణము. ఇవ్విషయ మాకాంక్షాది నిరూపణావసరమున వివరింపఁబడియె. చాలునిఁకఁ బ్రకృతానుప్రసక్త ప్రసంగము. ప్రకృత మనుసరింతము.

నిరుక్త ప్రమాణములనుబట్టి యన్వితములైన పదార్థములే వాక్యార్థములు కాఁబట్టి యందుకై వేఱుగఁ దాత్పర్యవృత్తి నంగీకరింప నవసరములేదని వీరి నిష్కర్షము.

ఈమతమునందును, సామాన్య విశేషరూపార్థములే సంకేతవిషయములు గావున నతివిశేషరూపమై వాక్యార్థాంతర్గతమైన గవానయనాద్యర్థమే వాచ్యముగానప్పుడు వక్తృబోద్ధవ్యాది వైశిష్ట్యముచేత వాక్యార్థప్రతీత్యనంతరము గలిగెడి యర్థాంతరము వాచ్యమనుట యెవ్వరికిఁ దరము? అనఁగా, ఘటాదులు వస్తురూపముగ వస్తుపదవాచ్యములైనను, ఘటాదిరూపమున వాచ్యములుగానట్లు ఆనయనము ఆనయనపద వాచ్య

మైనను గవాన్వితానయనము ఆనయనపదవాచ్యము గాకుం డుటంబట్టి యసంకేతితమై వాక్యగమ్యమైన గవానయన పదార్థము ప్రాథమికబోధ విషయమైనను వాచ్యముగానప్పుడు దానికంటెం బరముగం దోంచెడి యర్థాంతరము వ్యంగ్యమనక వాచ్యమనుట మిక్కిలి యసంగతమని తాత్పర్యము.)

పూర్వమతమునం బదార్థాన్వితార్థమును, రెండవ మతమున సామాన్యముగం బదార్థాంతర మాత్రాన్వితార్థమును, సంకేతవిషయములు గావున రెండుమతములందును వాక్యార్థము వాచ్యమే కాంజాలదు.

మఱికొందఱు వ్యంగ్యార్థప్రతీతి నైమిత్తికము (నిమిత్తమునుబట్టి యేర్పడినది) అందుకు నిమిత్తము లితరము లెవ్వియు లేమింజేసి శబ్దమే యనవలయును. అదియును బోధ్యబోధకత్వరూపమైన నిమిత్తత్వము లేనిది సంభవింపను గావున వ్యంగ్యార్థముగూడ అభిధావ్యాపార బోధ్యమే యని వాదింతురు. మఱియు శబ్దమును విన్న యనంతరమే తోంచునటువంటి యర్థము సందంతటను శబ్దమే నిమిత్తమనియు, అందువలనం దోంచెడి యర్థాంతరము నైమిత్తికము గావున దాని ననుసరించి శబ్దము నకుం బునఃపునరనుసంధానము కల్పింపంబడుచున్నది. కాంబట్టి వాచ్యార్థమునందువలె వ్యంగ్యార్థమునందును, అభిధావ్యాపారమే ప్రవర్తించునుగాని వ్యాపారాంతరమును గల్పించుట యన్యాయమనియు, వాది యభిప్రాయము.

నిమిత్తత్వము కారకత్వము, జ్ఞాపకత్వమని రెండు విధ

ములు. ప్రకృతము నైమిత్తికప్రతీతినిగూర్చి శబ్దమునకుఁగల నిమిత్తత్వము కారకత్వరూపమా? జ్ఞాపకత్వరూపమా? శబ్ద మర్థమునకుఁ బ్రకాశకమగుటంబట్టి జనకత్వరూపమైన కారక త్వము సంభవింపదు. అర్థాంతరబోధకముగ నజ్ఞాతమైన శబ్దము నకు జ్ఞాపకత్వము మాత్రమెట్లు సంభవించును? ఒకవేళ శబ్ద మర్థబోధకముగా నెఱుంగఁబడినను సంకేతముచేతనేగదా? ఆ సంకేతముగూడ అన్వితమునందే గావున శబ్దమునకు నిమిత్తత్వ మే నిశ్చితముగానప్పుడు నైమిత్తికప్రతీతి మాత్రమెట్లు గలుగ వచ్చును? కాఁబట్టి "నైమిత్తికానుసారేణ నిమిత్తాని కల్ప్యంతే" యను న్యాయముంబట్టి వ్యంగ్యార్థముగూడ అభిధావ్యాపార బోధ్యమనుట విచారశూన్యమగుమాట.

అనఁగా వ్యంగ్యార్థప్రతీతినిగూర్చి శబ్దమునకు జ్ఞాపకత్వ రూప నిమిత్తత్వమును మేము సహిత మంగీకరింతుము. అందే మియు సందియము లేదు. గాని, వ్యంజనావ్యాపారము నంగీక రింపనిది శబ్దమునకు జ్ఞాపకత్వ నిమిత్తత్వ మెన్నఁడును బొసఁ గదు. వ్యాపారములేనిది శబ్దమునుండి యర్థమెప్పటికి బోధపడ దు. వాచ్యార్థ లక్ష్యార్థములు బోధపడుటకై యభిధాలక్షణా వ్యాపారముల నంగీకరించునట్లు వ్యంగ్యార్థప్రతీతినిగూర్చియు నొకవ్యాపార ముండవలయును. లేదేని శబ్దమునకు నిమిత్త త్వమే యేఱుకపడకుండుటంజేసి నీవొప్పుకొనెడి నైమిత్తికరూ పమైన వ్యంగ్యార్థబోధమే కలుగనేరదు. వ్యాపారములేనిదే శబ్దము వ్యంగ్యార్థమును బోధించునందుమేని సర్వసమ్మతము

మీమాంసకమతమునందు "యాగములలో ఋత్విజులు ఎఱ్ఱని రుమాళ్లు గట్టుకొని తిరుగుచుందురనునట్టి యర్థముగలట్టి యు, పెరుగుచేత హోమముచేయుచున్నాఁడను నర్థముగలట్టి యు, "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరంతి," "దధ్నా జుహోతి" అను వాక్యములచేతఁ దత్తత్సంబంధి యాగాదిక్రియలనుగూర్చి ప్రమాణాంతరముచే సిద్ధమైన పదార్థములుగాక సాధ్యమైన పదార్థములు విధింపఁబడుచున్నవి. ప్రమాణాంతరముచేఁ బ్రాపించువానిని మరల విధించుట అయుక్తము గావున నెద్ది యప్రాప్తమో దానినే విధింపవలయును. ఎద్ది విధేయమో దాని యందే వాక్యమునకుఁ దాత్పర్యము. దేనియందుఁ దాత్పర్యమో యద్దియే వాక్యార్థము. ఆయప్రాప్తార్థమును బోధించుటకే యావాక్యము ప్రయోగింపఁబడినదిగాని వాక్యములోని యన్నిపదార్థములను బోధించుటకుఁగాని, విధించుటకుఁగాని కాదనియే "యత్పరః శబ్దః సశబ్దార్థః" అను న్యాయము తెలుపుచున్నది. అందువలనఁ బైవాక్యములయందు "ఋత్విక్కు లెఱ్ఱని పాగాలతోఁ బ్రచురింపవలయు" ననుట యితరవాక్యముచే సిద్ధమైనందువలన నీవాక్యముచేత నుష్ణీషములయందు లౌహిత్యమును, "అగ్నిహోత్రం జుహోతి" మొదలగు వాక్యములచే సిద్ధమైన దధికి "దధ్నా జుహోతి'' యను వాక్యముచేఁ గరణత్వము మాత్రమును విధింపఁబడుచున్నవి. అందువలన నీ వాక్యములకు లౌహిత్యవిధియందును, కరణత్వవిధియందును మాత్రమే తాత్పర్యము. పై న్యాయమునకుఁ గూడ శబ్దమునకు

ముఖ్యార్థమునందుఁ దాత్పర్యముగాని ప్రతీతమైన యర్థమునం దుఁగాదు. "యత్పరశ్శబ్దః సశబ్దార్థః" అను న్యాయమునకు శబ్దోపాత్తమైన ముఖ్యార్థమునందే తాత్పర్యము కాదందుమేని "పూర్వుఁడు పరుగిడుచున్నాఁడ"ను వాక్యమునకు ఉపాత్తము గానట్టి "అపరుఁడు నిలువఁబడియున్నాఁడ"ను నర్థమునందుఁ దాత్పర్యము గలుగవలయునుగదా? కావున నుపాత్తమైన శబ్దార్థమునందే పైన్యాయమునకుఁ దాత్పర్యమని యభిప్రాయ మును గల్పించుట సమంజసము.

కొందఱీయభిప్రాయమును సమ్మతింపక ఉపాత్త శబ్దార్థమునందే పైన్యాయమునకుఁ దాత్పర్యమందుమేని "విషం భక్షయ మాచాస్య గృహేభుంక్థాః" "విషమును దినుము. వీని యింటిలో భుజింపకుము"ను నెడ విషభక్షణ వాక్యమునకు శబ్దో పాత్తము కానటువంటి 'వీని యింట భుజింపకుమ'ను వాక్యార్థ మునం దెట్లు తాత్పర్యము సంగతమగును? నిరుక్తవాక్యమున కనుపాత్త శబ్దార్థమునందుఁ దాత్పర్యముండుట వలన నుపాత్త శబ్దార్థమునందే వాక్యమునకుఁ దాత్పర్యమనుట అయుక్తమం దురు. గాని విమర్శించినచోఁ బైవాక్యమునకుఁ గూడ ఉపాత్త శబ్దార్థమునందే తాత్పర్యము గనఁబడుచున్నది. అదియెట్టులన, "విషంభక్షయ మాచాస్య గృహేభుంక్థాః" అను వాక్యముల యందుఁగల చకారము రెండు వాక్యములకు నేకవాక్యతను సూచించును. వాక్యములు రెండును సమాపక క్రియాన్వితము లగుటంజేసి పరస్పరాంగాంగి భావమును జెప్పఁగూడదు. ఇది

యొక మిత్రునకుఁ జెప్పినది గావున "వీని యింటిభోజనము విష భక్షణముకంటెఁ జెడ్డది. సర్వవిధముల వీనియింట భుజింపకు ము"ని విషభక్షణవాక్యమునకును ఉపాత్తశబ్దార్థమునందే తాత్ప ర్యమని యూహించునది.

మఱియు శబ్దశ్రవణానంతర మేయేయర్థము తోఁచుచు న్నదో యందంతటను నభిధావ్యాపారమే ప్రవర్తించుననిన యెడల "బ్రాహ్మణుఁడా! నీకుఁ బుత్రుఁడు గలిగినాఁడు." 'విప్రుఁ డా! నీకన్నియ గర్భిణి' యను వాక్యములనుండి హర్షశోకము లెట్లు గోచరించును? అవి శబ్దములకుఁ బ్రసిద్ధములుగ వాచ్య ములు గావుగదా? శబ్దముయొక్క దీర్ఘదీర్ఘతర వ్యాపారము చేతనే యవి గోచరించుననిన, లక్ష్యార్థప్రతీతికై లక్షణనేల యంగీకరింపవలయును? మీమాంసకమతములోని శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలను నంగములకెట్లు పూర్వ పూర్వబలీయస్త్వము సిద్ధించును. కావున అన్వితాభిధానవాది మీమాంసకమతమునందును 'నిఃశేషచ్యుత చందనమ్' త్యా దులందుఁ దోఁచెడి విధికి వ్యంగ్యత్వమే సిద్ధమగును.

మఱియు, వాచ్యవాచకత్వములకంటె వేఱుగ వ్యంగ్య వ్యంజకత్వముల నంగీకరింపకుందుమేని యసాధుత్వాదులు నిత్య దోషములనియు, కష్టత్వాదు లనిత్యదోషములనియు, విభాగ మే నిష్ప్రయోజనమగును. అన్నియు వేఱువేఱుగఁ దోఁచు చుండుటవలన విభాగము నిష్ప్రయోజనమనుటకు వీలులేదు. వాచ్యవాచకత్వ వ్యతిరిక్తముగ వ్యంగ్యవ్యంజకభావము నంగీక

రించిన వ్యంగ్యార్థము బహువిధమగుటంజేసి యొకానొకచోట నేదో యొక దానికి ఔచిత్యముగ విభాగవ్యవస్థ యుపపన్నమగుచునే యున్నది. వ్యంజనావ్యాపారము నంగీకరింపకుండినం బదములకన్నింటికి వాచకత్వశక్తి సాధారణమగుటంబట్టి "పర్యాయపదములలో నొక్కొక్కచోట నొక్కొక్కశబ్దము నుపయోగించిననే సారస్యమను నియమము పొసఁగనేరదు. అదియెట్లు?.

"ద్వయం గతం సంప్రతి శోచనీయతాం,
సమాగమ ప్రార్థనయా కపాలినః"

(కుమారసంభవము)

తా॥ తపంబొనరించుచున్న పార్వతి నుద్దేశించి బ్రహ్మచారి వేషధారియైన శివుఁడు స్వనిందాపరముగఁ బలుకుచున్నాఁడు. "ఓపార్వతీ! నీవు కపాలధారియైన శివునిఁ బొందఁగోరుటచే నిప్పుడు రెండు వస్తువులు నిందాపాత్రములగుచున్నవి గదా?" అని తాత్పర్యము. ఇచ్చటఁ గపాలశబ్దమువలన శోచనీయత్వము స్పష్టమైనట్లు పినాక్యాది పదప్రయోగముచే స్పష్టముగాదుగదా? కపాలి పినాకి శబ్దములు పర్యాయములే యైనను, అర్థవిశేషప్రతీతియందుఁ బరస్పరము తారతమ్యము తప్పక గోచరించుచునే యున్నది. అయ్యది వ్యంజనావ్యాపారకృతమనక మఱేమనవచ్చును? లేనిచోఁ బినాక్యాది పదములకంటెఁ గపాల్యాది పదములచేఁ గలుగు కావ్యానుగుణత్వ మెట్టిది.?

మఱియు, వాచ్యార్థ మొందఱ కొక్కవిధముగనే తోఁ

చుచుండును. "సూర్యుఁ డస్తమించె" ననునెడ అందఱకు సరిగ దా స్ఫురించునటువంటి వాచ్యార్థమొక్కటే. వ్యంగ్యార్థమట్లు గాదు. అది ప్రకరణవిశేషమునుబట్టియు, వక్తనుబట్టియు. గ్రహించువానినిబట్టియు, నానావిధములుగఁ దోఁచుచుండును. ఎట్టులనఁగా "సూర్యుఁడ స్తమించె" నని యుద్ధప్రకరణమునఁ జెప్పిన రాత్రి యుద్ధము కపటభూయిష్ఠము గావున యుద్ధమునుండి నివర్తింపుఁడని సైనికులకును, వ్యభిచారిణి నుద్దేశించి పల్కిన నభిసరణమునకు సమయము సమీపించెననియు, వాసకసజ్జికకుఁ బ్రియుఁ డిఁక రానున్నాఁడనియుఁ, బనివాండ్ర కిఁకఁ బని చాలింతమనియు, బ్రాహ్మణుల కిఁక సాయంతనవిధి ననుష్ఠింపవలెననియు, బాటసారికి దూరము వెళ్లరాదనియు, గొల్లలకు, ఆవుల నింటికిఁ దోలుకొని వెళ్లవలయుననియు, తాపపీడితులకిఁకఁ దాపమడఁగుననియు, కోమట్ల కంగడి నెత్తవలయుననియు, విరహిణికింకను బ్రియుఁడు రాలేదే యనియు, ఆయావ్యక్తులకనుగుణముగ నానావిధములఁ దోఁచుచున్నది. గావున వాచ్యవ్యంగ్యములకు భేదము లేదనుట సర్వథా అసంగతము.

మఱియు "నిఃశేషచ్యుతచందనమ్" ఇత్యాదులయందు వాచ్యార్థము నిషేధరూపముగను, వ్యంగ్యార్థము విధిరూపముగను, నుండుటఁ బట్టియు, వాచ్యవ్యంగ్యములకు భేదములేదనుట యొంతమాత్రము యుక్తియుక్తము కానిమాట. ఇంకను,

"మాత్సర్యముత్సార్య విచార్యకార్య
మార్యాః సమర్యాద ముదాహరన్తు,

సేవ్యా నితంబాః కిముభూధర్ణాణా
ముతస్మరస్మేర విలాసినీనామ్." (భర్తృహరి.)

తా॥ ఆర్యులు మాత్సర్యము విడిచి యుక్తాయుక్తముల బాగుగాఁ బరికించి మర్యాదగాఁ బలుకవలెను. ప్రపంచమునందు సేవింపఁదగినవి పర్వతనితంబములా? లేక చిఱునగవుతో విలసించెడి కామినీ నితంబబింబములా? అని తాత్పర్యము.

ఈపద్యమునందు వాచ్యార్థము సంశయాత్మకము. శాంతపురుషునకు శాంతరస నిశ్చయమును, శృంగారిపురుషునకు శృంగారనిశ్చయమును వ్యంగ్యములు. గావున నిందు వాచ్యవ్యంగ్యములకుఁగల పరస్పరసంశయ నిశ్చయరూపమైన స్వరూపభేదమును,

"కథ మవనిప! దర్పో యన్నిశాతాసిధారా
దళన గళితమూర్ధ్నాం విద్విషాం స్వీకృతాశ్రీః,
నను తవ నిహతారే రప్యసౌ కిం నసీతా
త్రిదివముపగతాం గైర్వల్లభా కీర్తిరేభిః."

తా॥ ఓయవనిపా! నీవు బహుతీక్ష్ణమైన ఖడ్గముతో శత్రువుల తలలు ఖండించి వారి సంపదను స్వీకరించితినని యేల గర్వించెదవు? నీవు శత్రువులను సంహరించినను నీకీర్తిని ఈయంగహీనులగు నీశత్రువులు స్వర్గమునకుఁ గొనిపోవలేదా? (కావున నీవేల గర్వించెదవని పూర్వముతో సంబంధము) అనఁగా రాజు శత్రువుల సంహరింప నాతని కీర్తి స్వర్లోకపర్యంతము వ్యాపించెనని తాత్పర్యము.

ఇచ్చట "సంరక్షణ సమర్థుండవగు నీవు జీవించియుండఁగనే చచ్చిన నీశత్రువులు నీకీర్తిని హరింప నీకు గర్వమనుచిత" మని సామాన్యముగఁ దోఁచెడి రాజు నిందచే 'సకల శత్రువులను జయించి నీవు ముల్లోకములఁ గీర్తివడసితివ'ను రాజస్తుతి వ్యంగ్యమగుచున్నది. ఇందు వాచ్యవ్యంగ్యములకుఁగల నిందాస్తుతి రూపమైన స్వరూపభేదమును, వాచ్యార్థము ముందును, వ్యంగ్యార్థము తర్వాతను స్ఫురించుటచేఁ గలుగు కాలభేదమును, వాచ్యము కేవల శబ్దాశ్రయముగాను, వ్యంగ్యము శబ్ద, తదేకదేశ, తదర్థ, వర్ణ, సంఘటనాశ్రయముగాను నుండుటచేఁ గలుగు నాశ్రయభేదమును, వాచ్యము కేవల శబ్దానుశాసనజ్ఞానముచేతను, వ్యంగ్యము ప్రకరణాది సహాయమైన ప్రతిభానైర్మల్యముతోఁగూడిన శబ్దానుశాసనజ్ఞానముచేతను గోచరించుటంబట్టి గలుగు నిమిత్తభేదమును, మఱియుఁ గార్యసంఖ్యాభేదములును,

"కస్య వా న భవతి రోషః దృష్ట్వా ప్రియాయాః సవ్రణమధరమ్। సభ్రమర పద్మాఘ్రాయిని! వారితవామే! సహస్వేదానీమ్." (ప్రా॥ ఛా॥)

తా॥ దేశాంతరమునుండి వచ్చిన ప్రియుఁడు ఉపపతిదష్టమైన తన ప్రేయసి మోవినిఁగాంచి కుపితుఁడగుచుండ వానిని వంచించుటకై సఖి 'నీప్రేయసి నిరపరాధ' యని తెలుపుటకిట్లు బలుకుచున్నది. ఎట్టివారికిఁగాని దెబ్బతగిలిన ప్రేయసి యధరముంగాంచి కినుకవొడమకుండునా? పిచ్చిదానా! పద్మములోఁ

మమ్మెదయున్నది. వాసన జూడకుమని యెంత బ్రతిమాలినను వింటివా? సరే యిప్పుడోర్చుకొమ్మని తాత్పర్యము.

ఇచ్చటఁ బదార్థమునకు సంబోధ్యయగు నాయిక విషయము. 'ఈపెదవిని భ్రమరము గఱచినదిగాని యుపపతిగాడ'ను వ్యంగ్యార్థమునకు నాయకుఁడు విషయము. 'ఇదిగో చూచితివా, నాసామర్థ్యము. నేనెట్లు తప్పించితినో' యను వ్యంగ్యమునకు నెదురింటి కామిని విషయము. 'ఇప్పటికేమో యిట్లు తప్పించితివిగాని యిఁకమీఁద నిట్లాచరింపఁగూడద'ను వ్యంగ్యమున కుపనాయకుఁడు విషయము. 'ఈపె పెదవిని గఱచినవి తుమ్మెదగాని, ప్రియుఁడు గాఁడ'ను వ్యంగ్యమునకు సవతి విషయము. 'పాపము. అమాయికురాలు. ప్రపంచపరిజ్ఞానమేమియు నీమెకు లేదు. వేఱుగ భావింపకుఁడ'ను వ్యంగ్యమున కత్తమామలు విషయము. ఇన్నియర్థములు పైపద్యమునుండి వ్యంగ్యమగుచున్నవి. ఇట్లు వాచ్యమునకు నాయికామాత్రమును, వ్యంగ్యార్థమునకు సఖీ తత్కాంతాదులును విషయములగుటం బట్టి గలిగెడి విషయభేదమును స్పష్టముగా నద్దమువలెఁ గన్పట్టుచుండినను వాచ్యవ్యంగ్యములకు భేదము లేదని వాదించుపక్షమున నెక్కడఁగాని నీలపీతాదులకుఁగూడ భేదమే లేదని చెప్పవలసియుండును. ప్రత్యక్షసిద్ధమైన నీలపీతాదిభేదమును దోసిపుచ్చలేమనుచో ననుభవసిద్ధమైన వాచ్యవ్యంగ్యముల భేదమునుమాత్ర మెట్లు నివారింపఁగల్గుదుము.?

మఱియు, విశుద్ధధర్మజ్ఞానమే భేదమనియు, కారణభేద

మే భేదహేతువనియుఁగదా, చెప్పఁబడుచుండును. వాచ్యవ్యం గ్యములయందు స్పష్టముగ స్వరూపాదిభేదమును, శబ్దానుశాసనాదిభేదహేతువులును గన్పట్టునప్పుడు వాని కైక్యతనెట్లు సంపాదింపఁగల్గుదురో యెఱుఁగఁజాలము. మఱియు, వాచ్యవ్యంగ్యముల కేకాక వాచక వ్యంజకములకుఁగూడ వైధర్మ్యము (విరుద్ధధర్మములు గలిగియుండుట) కనఁబడుచున్నది. అది యెట్లనఁగా,

వాచకములు సంకేతితార్థమునే బోధించుచుండుటవలన నవి యర్థాపేక్షములుగాను, వ్యంజకములు తీరానులయందు లేని పావనత్వాదులనే బోధించుటంజేసి యర్థాపేక్షములు కానివిగాను నుండును. మున్నుపపాదింపఁబడిన "వానీరకుంజోడ్డీన" అను పద్యము వాచ్యార్థమాత్ర విశ్రాంతమైనను, తాత్పర్య విషయముకాని యొక యర్థాంతరము స్వశబ్దానభిధేయమై వలదనినను బ్రతీయమానముగుచు నేవ్యాపారమునకు విషయము కావలయునో మీరే యూహింపుఁడు.

ఒకవేళ వాచ్యవ్యంగ్యముల కభేదము పొసఁగకుండినను, మున్ను నిరూపించిన "రామోఽస్మి సర్వంసహే," "రామేణ ప్రియజీవితేనతుకృతం ప్రేమ్ణః ప్రియే! నోచితమ్" 'రామోసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధింపరామ్' ఇత్యాదులయందు లక్ష్యార్థముగూడ నానావిధత్వమును బొందుచు నర్థాంతర సంక్రమితత్వాది విశేషహేతువగుచుండుట చేతను, దానిబోధముగూడఁ గేవల శబ్దాధీనముగాక శబ్దార్థాధీనమై

కరణాదుల నపేక్షించునదిగూడ నగుటచేతను, లక్ష్యార్థమే వ్యంగ్యార్థమనక క్రొత్తఁగా నొకదానిని వ్యంగ్యమని యేల చెప్పవలయునని కొందఱు ప్రశ్నింపవచ్చునుగాని నానావిధమైన లక్ష్యార్థముగూడ నానార్థక శబ్దార్థమువలె నియతమే గావున అనియతమైన వ్యంగ్యార్థముతో లక్ష్యార్థమున కైక్యత సమకూరనేరదు. ఎట్లైనను ముఖ్యార్థసంబంధములేనిది లక్ష్యార్థము నుపపాదింపఁ గలుగుదుమా? వ్యంగ్యార్థము ప్రకరణాదుల సాయమున నొక్కయెడ ముఖ్యార్థముతో నియతసంబంధము గలదిగాను, నొక్కయెడ అనియతసంబంధము గలదిగాను, నొక్కయెడ సంబద్ధసంబంధము గలదిగాను దోఁచుచుండును.

మఱియు, "శ్వశ్రూరత్ర నిమజ్జతి అత్రాహం దివసకం ప్రలోకయ, మాపథిక! రాత్ర్యాంధ! శయ్యాయామావయోర్నిమంక్ష్యసి." ఇత్యాది వివక్షితాన్యపరవాచ్యధ్వనియందు ముఖ్యార్థ బాధాదులెవ్వియు లేవుగదా? అవ్వి లేనప్పుడిందు లక్షణయెక్కడిది.? లక్షణ యుండినను ప్రయోజనప్రతీతికై వ్యంజన నవశ్య మంగీకరింపవలయునని ప్రతిపాదించితిమి. అభిధావ్యాపారము సంకేతము ననుసరించును. లక్షణ ముఖ్యార్థబాధాదిహేతుత్రయమును గోరును. ఈరెండింటి కింతమాత్రము తప్ప మఱి విశేషమైన భేదమేదిగలదు? అందువలననే లక్షణయభిధాపుచ్ఛభూతమని నాడుదురు. వాచకత్వమునకే వ్యంజనతో నైక్యత పొసఁగనప్పుడు తత్పుచ్ఛభూతమైన లక్షణతో నెట్లు పొసఁగును? కావున వ్యంజన లక్షణననుసరించి ప్రవర్తిం

చుటవలన లక్షణాత్మకమనుటకును, లక్షణానుసారిమాత్రమే కాక యభిధానుసారియు నగుటవలన నభిధాత్మకమనుటకును, అవాచక వర్ణాద్యనుసారి యగుటవలన నభిధా లక్షణోభయ మాత్రానుసారి యనుటకును, నేత్రవ్యాపారాది చేష్టానుసారి యగుటవలనఁ గేవల శబ్దానుసారియనుటకును వలనుపడదు. గావున అభిధాలక్షణా తాత్పర్యాది వృత్తులకంటె నతిరిక్తముగ ధ్వనన (వ్యంజనా) వ్యాపారమొకటి గలదని యంగీకరించుట మనకుఁ దప్పని సరియైయున్నది.

—♦ నియతాది సంబంధములు. ♦—

మున్నుపపాదింపఁబడిన "శ్వశ్రూరత్ర నిమజ్జతి" ఇత్యాదులయందు "నాశయ్యయందుఁ బ్రవేశించకుము"ను వాచ్యమునకును, "నాశయ్యయందుఁ బ్రవేశింపుము"ను వ్యంగ్యమునకును, విరోధసంబంధము ప్రసిద్ధముగ నియమితమగుటంజేసి నియతసంబంధమనఁబడును. మఱి, 'కస్యవానభవతిరోషః' ఇత్యాదులయందు "దీని యధరమును గఱచినది తుమ్మెదగాని యుపపతి గాఁడని" నాయకుఁడు గ్రహించిన వ్యంగ్యార్థమునకును, అవినీతత్వరూపమైన వాచ్యార్థమునకును బ్రసిద్ధసంబంధమేమియు లేమింజేసి యనియతసంబంధమనియు,

"విపరీతర తే లక్ష్మీ ర్బ్రహ్మాణం దృష్ట్వా నాభికమలస్థమ్,
హా రేర్దక్షిణ నయనం రసాకులాఝుడితి స్థగయతి."

తా॥ లక్ష్మీదేవి విపరీతరతాసక్తయై (పురుషాయితమొనర్చుచు) పురుషోత్తముని నాభికమలమునందు బ్రహ్మనుగాంచి

సురతమునుండి విరమింపఁజాలక తన్మణమే భగవంతుని కుడికన్నును మూయుచున్నద'ని తాత్పర్యము.

ఇచ్చట భగవంతుని కుడికన్ను సూర్యాత్మకమనియు, ఎడమకన్ను చంద్రాత్మకమనియు, సూర్యాత్మకమైన కుడికంటి నిమూయుటచే సూర్యాస్తమయమును, అందువలన నాభికమలము ముడుచుకొనుటయు, నందులోని బ్రహ్మమరుగుటవలన లక్ష్మి యసన్యసాధారణము లైన సంభోగసుఖముల ననుభవించెననియు వ్యంగ్యమగుచున్నది. ఇందు వాచ్యవ్యంగ్యములలో నొకదానితో నొకదానికిఁ గ్రమమైన సంబంధమున్నదని స్పష్టమగు చున్నది. కాఁబట్టి యిది సంబద్ధ సంబంధమనియుఁ జెప్పఁబడును.

## —♦ వేదాంతిమతము. ♦—

అఖండవాక్యమునకే వాక్యార్థమునందు శక్తి నంగీకరించు వేదాంతులు వాక్యమే వాచకము, వాక్యార్థమే వాచ్యము. గావున వాక్యగమ్యమైన వ్యంగ్యార్థముగూడ వాచ్యమేయని వాదింతురు. (అనఁగా క్రియాకారక భావములేనిది సంభవింపదు. సంసారము మిథ్య గావున దానియందును, ధర్మశూన్యమయిన బ్రహ్మమందును, ధర్మధర్మిభావము పొసఁగదు గావున 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' ఇత్యాది వాక్యములు పదపదార్థవిభాగము లేకయే యఖండమైన వాక్యార్థమును (బ్రహ్మమును) బోధించునందురు గాని పారమార్థికదశయందు జ్ఞానులు పదపదార్థ విభాగము నంగీకరింపకుండినను సాంసారిక దశయందవి

ద్యాపదపతితులు (అజ్ఞానదశయందుండువారు) అవశ్యము పద పదార్థ విభాగము నొప్పుకొనక తప్పదు. కాఁబట్టి యీపక్షము నందును నిరుక్తోదాహరణములయందు విధినిషేధాదులకు వ్యం గ్యత్వమును దొలఁగించుట యసాధ్యము.

మఱియు, వాచ్యార్థమునకు సంబంధములేని వ్యంగ్యా ర్థము తోఁచదుగదా? అట్లు తోఁచునేని ఏదో యొకయర్థము తోఁచవలసివచ్చును. ఇది యనుభవవిరుద్ధము. కావున వాచ్య వ్యంగ్యములకుఁ దప్పక సంబంధముండవలయును. ఈరీతిని వా చ్యవ్యంగ్యములకు సంబంధముండవలసి యుండుటచేతను, ని యత (ఎడతెగని) సంబంధము లేనిది వ్యంగ్య వ్యంజకభావమశ్య ము కలుగదని వ్యాప్తియుండుటవలనను, నియతధర్మనిష్ఠమగు టవలనను, 'త్రివిధమైన లింగజ్ఞానమునుండి గలిగెడి లింగిజ్ఞానమే యనుమానము'ను నట్టి యనుమాన రూపముగా ఈవ్యంగ్య వ్యంజకభావ మేర్పడుచున్నది. అది యెట్లనిన.

"భ్రమధార్మిక! విస్రబ్ధం సశునకోద్యమారితస్తేన, గో దావరీ కచ్ఛకుహరవాసినా దృప్తసింహేన." అను నెడ ఇంటి యందుఁ గుక్కలేకపోవుట వలన ఇచ్ఛవచ్చినట్లు సంచరింప వచ్చునని విధింపఁబడిన భ్రమణము, గోదావరీతీరమునందు సిం హాముండుటనుబట్టి, భ్రమణాభావమును అనుమానముచే బో ధించుచున్నది. 'ఎచ్చటెచ్చట భీరువులు సంచరింతురో యచ్చ టచ్చట భయకారణముండద'ను వ్యాప్తి జ్ఞానముండవలయును. ఇచ్చట "గోదావరీ తీరమునందు సింహామున్నద"ను జ్ఞానము పైఁ

ముకి వచనముచేతనేగదా నిశ్చయింపఁబడుచున్నది. ప్రత్యక్షా దులవలె వచనము (మాట) ప్రమాణ మెట్లగును? మఱియు అర్థముతోఁగూడ వచనమునకు (మాటకు) నియతసంబంధము లేదు. కాఁబట్టి హేతువసిద్ధము. ఇట్లు దోషదుష్టమైన హేతువు చేత సాధ్యమును సాధించుట యెట్లు? కావున వ్యంజన కనుమా నాంతర్భావమును జెప్పుటకంటె వ్యాపారాంతరముగ నంగీకరిం చుట సమంజసము.

— గద్య. —

ఇది శ్రీనిజామదేశీయ మహబూబునగర మండలాంతర్గత పెద్ద
మందడి గ్రామవాసి భారద్వాజగోత్ర పవిత్ర కాండూరు వంశ
పయఃపారావార రాకాసుధాకర చింతకుంట రాఘవా
చార్య ద్వితీయతనూజ, శ్రీపట్టపురవాస్తవ్య మహా
మహోపాధ్యాయ శ్రీమాన్, కపిస్థలాభిజన, దేశికా
చార్యాది గురువర ప్రసాదలబ్ధ సాహిత్యప్రబోధ
సాహిత్యశిరోమణి & ఉభయభాషాప్రవీణ
పట్టసమంచిత, కడపమండల స్థానిక విద్యా
శాఖాంధ్రపండిత, కాండూరు నరసింహా
చార్య వివృతమైన కావ్యప్రకాశం
బునందు పంచమోల్లాసము
సంపూర్ణము.



శ్రీ జానకీ ముద్రాక్షరశాలయందు ముద్రితము. 1934.